LIBRARY EDITION.

శ్రీజ్ఞాన ప్రసూనమాలిక. — ప్రథమ ప్రసూనము.

శ్రీరస్తు.

శ్రీమన్మహాకవిధూర్జటిచే

రచియింపఁబడిన

# శ్రీకాళహస్తిమాహాత్మ్యము.

శ్రీగోష్టపల్లి - అన్నపూర్ణమ్మచేఁ

ప్రకటింపఁబడియె.



విప్రుఁడు.—" * * మణి గొనువాని వెతక

దమనిఁ గొనువాఁడె రత్నంబు నరయుఁ గాదె? "

Madras:

PRINTED AT THE VAIJAYANTI PRESS,

*32, Mount Road.*

1914.



శ్రీ కాళహస్తీశ్వరాలయము.



శ్రీరామ.

తాళదళగహనంబున దోసిద్రవ్వి యీ గ్రంథరత్నము వెలికిఁ దీసినవారు బ్రహ్మశ్రీ కొత్తపల్లి - వేంకటపద్మనాభ శాస్త్రులవారు. వీరు దీని విషయమై పడిన పాటెంతం తని చెప్ప సాధ్యపడదు. వీరెట్టెట్టో గ్రంథముల సంపాదించి మ-రా-రా-శ్రీ, ఆర్. వేంకట సుబ్బయ్యగారి తోడ్పాటుచేఁ దొలుత నీ గ్రంథము ముద్రించి ధూర్జటికవి నామము లోకమున శాశ్వతమొనర్చి బుధజనాహ్లాదము గావించిరి. దొరకిన తాటియాకు పుస్తకము లసమగ్రములుగా నుండుటచేఁ దొలుతటికూర్పున దోషములు మెండుగానుండఁ గారణమయ్యె. పద్మనాభశాస్త్రులవారు దీనిని సంస్కరించి మరల ముద్రింపఁబూనిరి గాని గ్రంథము సొంతముగ ముద్రితమగుట కన్నులారఁ జూచు భాగ్యములేనివారై నిజస్వామిభక్తి, దైవభక్తి, సత్యవ్రతాది సద్గుణములచే జయించిన పుణ్యలోకముల సుఖ మనుభవింపఁజనిరి. తరువాతఁ బద్మనాభశాస్త్రులవారిపత్ని అన్నపూర్ణమ్మ గారు నన్నుఁ జేరఁబిలిచి "తండ్రీ! నాభర్తకు నీవు ప్రాణమిత్రుఁడవు. నాకుఁ దండ్రి వంటి వాఁడవు. కావునఁ జెప్పుకొనుచున్న దానను. శ్రీకాళహస్తిమాహాత్మ్యము ముద్రింప నాభర్త యెంత యుత్సాహము వహించి యుండెనో యాయనకుఁ జేదోడు వాదోడుగా నుండిన నీకుఁ దెలియని విషయముగాదు. కావున నాయన కోర్కి వ్యర్థపఱుపక నీ వాకార్యమునకుఁ బూని దానిని సొంతమొనర్చి నాభర్తపేరు లోకమున శాశ్వతముగ నిలువఁజేయుము" అని చెప్పిన నేను నీయకొనితిని. దీనిని సంస్కరించుటయం దాంధ్రసాహిత్య పరిషత్తు వారు సేకరించిన యొక కాళహస్తిమాహాత్మ్య పుస్తకము జీర్ణము నసమగ్ర మయ్యు నాకు మిక్కిలి యుపయుక్తమయ్యెఁ గావున వారికిఁ గృతజ్ఞతచే నమస్కరించుచున్నాఁడను. పద్మనాభశాస్త్రులవారు కోరినట్లు నేను వ్రాసియిచ్చిన లఘుటీకయు దీనికిఁ జేర్చితిని. అన్నపూర్ణమ్మగారి కోరికచొప్పున నామె భర్తపటమును, నేతత్కార్యార్థముగఁ జిత్రలేఖకుని గాళహస్తికినంపి వ్రాయించి సిద్ధము చేయించిన కాళహస్తిపటమును, దిన్నఁడు శివలింగపూజచేయు పటమును నిందుఁ గూర్చితిని. శ్రీకాళహస్తీశ్వరుఁడు పద్మనాభశాస్త్రులవారి కవ్యయానందమును, ఆయన కుమారున కాయురారోగ్యైశ్వర్యములును బ్రసాదించును గాత.

వావిలికొలను సుబ్బరావు.



శ్రీరామ.

ఈ గ్రంథమును దొలుత ముద్రించి ప్రకటించిన కీ॥ పద్మనాభశాస్త్రిగారు నామేమగారు.

ఆకారణముచే నీ గ్రంథరత్నమునకు విపులముగ విమర్శనము వ్రాయఁ దలంపు గలిగియు గ్రంథవిస్తరభీతిని విరామములేమిని విరమింపవలసి వచ్చెను. ఇది యుత్తమ కావ్యము. మహాకావ్యమున కుండవలసిన లక్షణములన్నియు నిందుఁగలవు. శైలి యందందుఁ దత్తద్రసముల పోషించునదియై యుండును. ద్రాక్షాపాకమే విశేషముగఁ గాన

వచ్చును. ఇది భక్తిరస ప్రధానము. కవియో రాజయోగియని చెప్పుట కనేక నిదర్శనములు కలవు. కావున ననేకోపమానములు యోగశాస్త్రమునుండి గ్రహింపఁబడినవి. ఇది యెంతయు సముచితము. శ్రీ కాళహస్తి దక్షిణ కైలాసమని చెప్పుచో నందలి పదార్థములు కైలాసమున నుండువానితోఁ బోల్చుట సమంజసము గదా. కావుననే కాళహస్తియందలి వేశ్యలను వర్ణించునపుడును వారి కన్నుముక్కు కాలు వర్ణింపక "కామినీ జనులు పోల్తురు యోగిజనంబు పోలికన్" అని కవి వర్ణించెను. ఈ ప్రకారమే యనేక స్థలములందు నౌచిత్యము పోషించి వర్ణించియున్నాఁడు.

నేఁటి కాలమునఁ గవిత్వాభ్యసనమం దభిలాషగలవారు చక్కని కవిత్వము చెప్ప నేర్చుకొనఁదగిన విషయము లిందుఁ బెక్కులు గలవు. చేతి కడియములు మెడకును, మెడలోని హారములు పాదములకును దగిలించి తమ్మిపూల మాఱు తుమ్మపూల నలంకరించి కవితాకన్యకకు నలంకారమున నూతన పథకము కల్పించుచున్నామను కొనువారును, గ్రామ్య ముపయోగించినఁగాని గ్రాంథికభాష సుబోధము గాదనువారును, సంస్కృతపద భూయిష్ఠమైనఁగాని గ్రంథమునకు గౌరవమురా దనుకొనువారును, బాత్రోచిత భాషయను భ్రాంతిని నన్యభాషాపదములు స్వేచ్ఛగాఁ బ్రయోగించి నియమ సేతువుఁ ద్రెంచువారును, అలంకారములు ఘోరములని భయపడువారును, బూతులు వ్రాసినఁగాని శృంగారరస ముత్పన్నము గాదనువారును, నేర్చుకొనఁదగిన విషయము లందందుఁ గలవు. గుణరత్నాకరమైన నిట్టి గ్రంథముచే గ్రామ్యవాదులు తమ పక్షమును బలపఱచికొనఁ జూచుట యెంతయు శోచనీయము. షోడశకళా పూర్ణుఁడైన చంద్రునందు మచ్చవలె నీ గ్రంథమునఁ జ్యుతసంస్కార దోషములు రెండుమూఁడు గానవచ్చుచున్నవి. ప్రమాదపతితములు గాని యజ్ఞానకృతములు గాని ప్రమాణములు గావనియు నపవాదములు విధులుగావనియు నెఱుంగక ధూర్జటి యంతటివాఁ డొకటి రెం డసాధుప్రయోగము లేకారణముచేతనో యుపయోగించెఁ గావున మేము గ్రంథమంతయు నపశబ్దములతోనే వ్రాసెదమను వారెట్టి బుద్ధిమంతులో! ఈ దోషములు కవికృతములో లేఖక కృతములో యెవ్వఁడెఱుఁగును. ధర్మరాజునంతటి వాఁడొక యసత్యమాడెను గావున మేము బ్రతికినంతకాలము కల్లలతోనే కాలక్షేపము చేయుదుమనుట యెట్టి తెలివి? కొన్ని యౌషధముల నణుమాత్రము పాషాణము గలసెనని విషమే తినెద ననెడు వాఁడు వివేకియా? ధూర్జటి కవీంద్రుని కవితయందుఁగల గుణమొక్కటియైనఁ దమ వ్రాఁతల నుద్ధరించుశక్తి లవమైనను లేక దోషము మాత్రము ననుకరించెదమని చెప్పిన లోకులు నవ్వకుందురా యని యైనవారికిఁ దోఁపదేమో. ఎట్టివాఁడు చేసినను దోషము దోషమే. గుణబాహుళ్యముగలకృతి దోషలవకారణమున నీసడింపఁబడక గ్రాహ్యమగునుగాని దోషము లనుకరణీయములు మాత్రము గావు. ఈ గ్రంథ ప్రకటనమందుఁ దోడ్పడిన మ-రా-రా-శ్రీ, వా॥ సుబ్బరావుగారు నాకు వంద్యులు.

కొ॥ కామశాస్త్రి బి. ఏ.

శ్రీ

# శ్రీ కాళహస్తిమాహాత్మ్యము

మొదటికూర్పు.

---

## పీఠిక.

"శ్రీజ్ఞానప్రసూనమాలిక" యనుపేరం బ్రకటింపఁబడు గ్రంథరాజని మొదటి యగు శ్రీకాళహస్తిమాహాత్మ్య మిపుడు సిద్ధమైనది. ఈగ్రంథరాజముఁ బ్రకటించు భాగ్యము మాకబ్బుట శ్రీజ్ఞానప్రసూనాంబాసమేత ప్రమథగణసహిత శ్రీకాళహస్తీశ్వరుని కృపాతిశయమహిమయె యని యెన్ని యెంతయు నుబ్బుచున్నారము. దీని ప్రతి చిక్కుట యరుదు. బ్ర. శ్రీ. మ. రా. రా. శ్రీ. పూండ్ల రామకృష్ణయ్యగారు సహాయులై తమయొద్దనున్న ప్రతి నొకటిని మాకొసంగిరి. దొరతనమువారి లిఖితపుస్తక భాండారంబునందు మెస్తరు బ్రౌను దొరగారిచే సేకరింపఁబడి కడుహెచ్చరికతో వ్రాయింపఁబడిన ప్రతియొకండును మాకు దొరకె. ఇవి రెండును దోషముగా మఱియును రెండుసమగ్రగ్రంథములం బరిశీలించి యొకప్రతిని వ్రాసికొని దానిని ముద్రింపించినారము. మాయదృష్టవశంబున నిట్టిగ్రంథతల్లజంబు దొరకినది యట్లుండఁగా దాని కనువుగ నతిమనోహరంబుగ ముద్రాక్షరములం గూర్చు యంత్రశాల దొరకినదియు మాభాగ్యవశమ యగును.

ఈ గ్రంథమును రచియించినకవి ధూర్జటి. ఇతని కులగోత్రాదులం దెలుపఁదగు సాధనము లెవ్వియు నీగ్రంథమునం గానరావు. ఈతని పౌత్రుఁడగు వేంకటార్యకవి రచియించిన కృష్ణరాజవిజయంబునందలి యీపద్యముచే వానిఁ దెలియనగును:-

సీ. నను భరద్వాజగో ♦ త్రుని సదాపస్తంబ-సూత్రుని బాంధవ ♦ స్తోత్రపాత్రుఁ
బాకనాటార్వేల ♦ వంశప్రసిద్ధుని-ధూర్జటిపౌత్రు బం ♦ ధురచరిత్రు
సద్గురుకారుణ్య ♦ సంప్రాప్తవిద్యావి-హారుని శ్రీకాళ ♦ హస్తినిలయ
చిత్ప్రసూనాంబికా ♦ శ్రీకరానుగ్రహ-సాదితకవితార ♦ సజ్జహృదయు
సారరచనాధురీణుఁ గు ♦ మారధూర్జ, టిప్రధానాగ్రగణ్యుఁ బ ♦ టీరహార
మహితసత్కీర్తిఁ గాళియా ♦ మాత్యపుత్రు, వేంకటార్యుని బిలిపించి ♦ వేడ్కసలిపి.

ఈ కృష్ణరాజవిజయంబుననే:—

చ. స్తుతమతియైన యాంధ్రకవి ♦ ధూర్జటి పల్కులకేల కల్గెనో
యతులితమాధురీమహిమ ♦ నా మును మీపెదతాత చాల స
న్నుతిఁ గనెఁ గృష్ణరాయల మ ♦ నోజ్ఞసభ న్వీను మీవు నట్ల మ
త్కృతబహుమానవైఖరులఁ ♦ గీర్తివహింపుము ధాత్రిలోపలన్

అని తను నార్వీటి చినవేంకటావనీంద్రుఁడానతిచ్చినట్లు కవి వ్రాసియున్నాఁడు. ఇందుచే శ్రీకాళహస్తిమాహాత్మ్యము రచించిన ధూర్జటికవి కృష్ణదేవరాయలకాలము వాఁడగునని తెలియుచున్నది. కావునఁ గ్రీస్తుశకము 16 వ శతాబ్దాదిని అనఁగా నించుమించుగ 370 ఏండ్లక్రింద నీకవి బ్రతికియుండెనని చెప్పవచ్చును. కృష్ణదేవరాయల సభలో నష్టదిగ్గజములనఁ బ్రఖ్యాతిఁజెందిన కవులలో నీతఁడు నొకఁడు. కుమారధూర్జటినాఁ బ్రశస్తిఁగాంచి పైకనిన కృష్ణరాజవిజయమను గ్రంథంబును రచియించిన వేంకటార్యుండు తనగ్రంథమును శ్రీరామచంద్రున కంకితమిచ్చినను దన యజమానునియందుఁ గృతజ్ఞతఁగలవాఁడై యార్వీటి చిన వేంకటావనీంద్రు నానతిఁదా నాగ్రంథము నరచియించినదిగా వ్రాయుచు నాతని పేరును షష్ఠ్యంతములలోనను గూర్చియున్నాఁడు. ఈచిన వేంకటావనీంద్రునికాలముఁబట్టి చూచినను ధూర్జటి కాలము పైకనినట్లు 16-వ శతాబ్దాది నుండవలయు. మఱియు నీకుమారధూర్జటి పుత్రుఁడు లింగరాజకవియనునతఁడును శ్రీకాళహస్తి మాహాత్మ్య మనునొండొక గ్రంథమును రచియించినాఁడు. దీనిని మామిత్రులొక్కరు మాకియ్యఁగాఁజదివి చూచితిమి. అది యీ కాళహస్తిమాహాత్మ్యముకన్న గ్రంథబాహుళ్యంబున నాల్గింత లెక్కువయై 12 ఆశ్వాసములు కలదియై యొప్పుచున్నది. అదికాళహస్తిని పాలించుచుండిన యక్కరాజు వేంకటపతిగారి కంకితమీఁబడియున్నది. అందలి పద్యములు గొన్ని యీ క్రింద వ్రాసి వానివలనఁ బ్రస్తాపగ్రంథకాలనిర్ణయాదుల కెంతమాత్రముపయోగపడునో విచారింపవలసియున్నది:—

సీ. శ్రీకాళహస్తిగౌ ♦ రీనాథపదపద్మ-సద్భక్తియుక్తి ని♦ శ్చలతఁగాంచి
సారసుధాసార ♦ సరసోక్తిగుంభనఁ-గాళహస్తిమహత్త్వ ♦ కథనొనర్చి
కృష్ణరాయకిరీట ♦ కీలితమణిగణా-ర్చితపదాబ్జద్వయు ♦ శ్రీ వహించి
యాసేతుకాశీత ♦ టావనీవిఖ్యాత-సత్కీర్తివిస్ఫూర్తిఁ ♦ జాల వెలసి
ధరణిఁ జెలువొందె నేకవీ♦శ్వరవతంస, రత్నమమ్మహనీయు ధూ♦ర్జటిసుధీంద్రుఁ
దలఁతు జలనిధివీచికా ♦ కలకలాను, కారిభూరికవిత్వవా ♦ క్పటిమ గులుక.

అనుపద్యముచే ధూర్జటికవి కృష్ణరాయలసన్మానముఁ బొందినవాఁడనుట మొదలుగాఁ గలయంశములు దృఢపడియె.

సీ. శ్రీకాళహస్తీశ ♦ సేవనాన్వితచిత్త-చిత్తజాకార ల♦క్ష్మీవిహార
రమణీయశీల భా ♦ రద్వాజగోత్రప-విత్రయాపస్తంబ ♦ సూత్రమహిత
ధూర్జటివంశపా ♦ థోధిచంద్రకుమార-ధూర్జటినాఁగవి ♦ స్ఫూర్జితాంశ
స్తుతమతి వేంకట ♦ పతితనూభవలింగ-రాజకులేంద్ర ధై ♦ ర్యాచలేంద్ర

అనుపద్యముచే నాకవియొక్క గోత్రాదులఁగూర్చినయూహ నిజమయ్యె.

క. వినుకాళహస్తిమహిమం, బనుపమమై వెలయ మును మ ♦ దధ్యాయికథఁ
దెనుఁగునఁ గావ్యముగ నొన, ర్చెను బెదధూర్జటికవీంద్ర ♦ శేఖరుఁ డనఘా.

గీ. బహుపురాణమథిత ♦ భవ్యార్థశివతత్త్వ, సారమెల్ల నైక్య ♦ సరణిఁబొదలి
జగతి శివరహస్య ♦ సంగ్రహమనునితి, హాసమొనరు విబుధు ♦ లభినుతింప.

సీ. ఆయితిహాసంబు ♦ నందలియుత్తర-భాగంబునందు భా ♦ స్వన్నిరూఢిఁ
గాళహస్తిమహత్త్వ ♦ కథనూటయిర్వది-యధ్యాయములఁజెలు ♦ వమరుచుండుఁ
దత్కథఁదెనుఁగున ♦ ద్రాక్షరసోర్మికా-పరిపాకవిస్ఫూర్తిఁ ♦ బరిఢవిల్లఁ
గృతియొనర్చుముదం ♦ కితముగశబ్దచ-మత్కృతిఁబండితు ♦ ల్మది గణింప.

అనుపద్యములచే నీరెండు గ్రంథంబులకు నాదిగ్రంథంబులు సూచింపఁబడియె. నత్కీరునిచరిత్రము లింగరాజకవికృత గ్రంథంబునఁ గానరాదు. తక్కిన వసిష్ఠాదులచరితలు భేదముగఁ గన్పట్టుచున్నవి.

సంస్కృతమునం దొకకాళహస్తిమాహాత్మ్య మున్నది. అది వేంకటగిరిలో నుండు శ్రీమన్మహారాజరాజశ్రీ రాజా వెలుగోటిముద్దుకృష్ణయాచేంద్ర బహదర్వారిచే ముద్రింపింపఁబడియున్నది. అందలికథలు నీలింగరాజకవికృత కాళహస్తిమాహాత్మ్యమునందలికథలు నొకతీరున నున్నయవి.

ధూర్జటికవితయందు లక్షణవైపరీత్య మెచటను గానరాదు. ఇత్వసంధియుఁ, గాచుక, చేసుక, ఇత్యాదిప్రయోగములు నీకవికి సమ్మతములు. "కఱవు" శబ్దమును బ్రాసస్థానమున లఘురేఫముగఁ బ్రయోగించియున్నాఁడు. ఒకవేళ లఘ్వలఘురేఫములకు యతిప్రాసములయందు మైత్రిఁగూర్చుట యీతని మత మనుకొందమనిన నట్టి ప్రయోగము లీగ్రంథమునందొండుకడం గానరాకున్నయవి. కావునఁ గరవు అని వ్రాయుటయె యీయన కిష్టము కాఁబోలు. "ఓంకారాక్షరమంత్రమర్మమున కాద్యంబైన వర్ణంబుతో నేకగ్రీవమునేసి పల్కెడుతురంగేంద్రంబు" "జీవులంగొట్టు రట్టున కొడిగట్టువేలుపుగట్టివాయిదెస వెండిగట్టు" ఇత్యాదిప్రయోగములీయనకు మంచినీళ్లప్రాయముగ నున్నయవి. శైలి చదువఁజదువఁ జవులొలుకుచుండును. ప్రతిపద్యము నొకరసముగలదియై మెలఁగునీ గ్రంథంబున నీయాపద్యములు మేలని చెప్పఁ జాలమైన నిట మేముసూచించు పద్యములఁ బ్రత్యేకముగఁ జదివి వానియందలి సారస్యముం గ్రహింపఁ జదువరులం బ్రార్థింతుము.

| | |
|---|---|
| 1 ఆ. 23, 25, 26, 63, 83, | 3 ఆ. 30, 41, 65, 69, 110, 165, 169, 208, |
| 2 ఆ. 84, 96, 120, 127, | 4 ఆ. 40, 43, 63, 91, 112, 116, |

ఈకవి శివభక్తాగ్రేసరుండు. కాళహస్తిపురవాసియయ్యుఁ గృష్ణదేవరాయలయాస్థానమునందు గౌరవమువహించియుండె. ఇతనిసంతతివారికిఁ గాళహస్తిని గౌరవము కలిగెను. ఇప్పటికిని గాళహస్తిరాజుగారి దర్బారులో ధూర్జటివారిదని యొకయాసనము కవిస్థానములలో నేర్పడియున్నది.

కృష్ణరాయలవంటిప్రభువు కాలమునను దనగ్రంథమును నరాంకితము సేయనోపని యిమ్మహాత్ముని భక్తి యెట్టిదై యుండవచ్చు. ఇట్లుండఁగొందఱు

చ. "స్తుతమతియైనయాంధ్రకవి ♦ ధూర్జటిపల్కులకేలకల్గెనో
యతులితచాతురీమహిమ"

అనికృష్ణరాయ లడుగఁగాఁ దత్సభాసదులలో నొకరు,

"♦హాతెలిసెఁ భువనైకమోహనో

ద్ధతసుకుమారవారవని ♦ తాజనతాఘనతాపహారిసంత

తతమధురాధరోదితసు ♦ ధారసధారలు గ్రోలుటంజుమీ♦"

అని దానిం బూర్తిచేసిరనియుఁ బల్కుచు దానిచే నీతఁడు వేశ్యారతుఁడై యుండెనని యూహించెదరు.

ధూర్జటికి నిజముగనో యబద్ధముగనో యీయపయశస్సు వచ్చియుండవచ్చుఁ గాని యికావ్యంబుఁ జదివిన వారి కీతనిభక్తివైచిత్ర్యంబు దెల్లంబుగాకుండదు. అటు గాక యీపద్యమందలి ప్రతిపదంబును బ్రమాణంబుగ గ్రహింతుమేని యసమానకవితాధోరణి కల్గుటకు వారకాంతల యుచ్ఛిష్ట మా సాధనంబు !! అదియునుగాక యిట్లీసమస్యం బూర్తిగావించిన కవియాకాలపుఁ బ్రతికవీశ్వరునియందు నేదోదోషమారోపించి నవ్వఁగలుగఁజేయు హాస్యకాఁడని విందుముగాన దీనివల్లనే ధూర్జటి నిజమైన భక్తుఁడుకాఁడనియు బాహ్యచిహ్నములచే భక్తాగ్రేసరుఁడని పొగడ్తగాంచిన వేషధారియనియు నెన్నఁజాలము. "ఉమెతః కయఁదిని సెపిన" కవిత్వమునకు గౌరవము తగ్గెనా? హాస్యకానిమాటల కేమి? అందుఁగల్పితములెన్ని? కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునందుఁ బై సమస్య నుదాహరించియుండుటచేనది కల్పితమని త్రోసివేయుటకు వీలులేదు. సమస్యాపూరణ ముక్తరీతిం గావింపఁబడియుండునాయనుకే సంశయంబు విద్వద్గేసరుండయిన కృష్ణదేవరాయలు తామెచ్చినకవిపట్టున నిట్టియసంబంధాలాపమున కెడమిచ్చియుండునా? కుమారధూర్జటియు లింగ రాజకవియునీతఁడు కృష్ణరాయల సభయందుఁ గడుగౌరవముఁ జెందినవాఁడని ప్రస్తాపించియున్నారు. ఇట్టివార్తజరిగియుండిన నదిగౌరవావహమెట్లగు? విద్యచే మించినవాఁడును దనగ్రంథము నీమనుజునకు నంకితమీయని ఘనుఁడునైన యీకవి దానికోర్చి యొకనిముసమైన నచటనుండియుండునా?

వేంకటగిరిస్థానములోఁ గారూరు, ధూర్జటిఅమ్మపాళెము, అనుగ్రామములున్నవి. కారూరులో ధూర్జటివారనియింటిపేరుఁ గలవారిప్పటికిని నున్నారు-వారియొద్దఁగొన్ని శాసనములేవో యున్నవఁట. వానినెల్లఁబరిశీలించి సాధ్యమైనంత యీకవియొక్క చరిత్రమును సాధించి క్రమంబుగఁ బ్రకటింతుము. దొరతనము వారిపుస్తకభాండారమునందే కాళహస్తిశతక మొక్కటి ధూర్జటికృతమని వ్రాయఁబడియున్నదిగాని దానిం జదివిచూడఁగా నదియీధూర్జటిచేరచియింపఁ బడియుండుననునూహఁబుట్టించు నంశము లెవ్వియుఁగానరావయ్యె.

కొ. పద్మనాభ శాస్త్రి

1895. ర. వేంకట సుబ్బయ్య.

# విషయసూచిక.

శ్రీరామచంద్రాయనమః.

శ్రీమహాగణపతయే నమః.

శ్రీజ్ఞానప్రసూనాంబా సమేత ప్రమథగణ సహిత

శ్రీకాళహస్తీశ్వరాయ నమః.

# శ్రీ కా ళ హ స్తి మా హా త్మ్య ము.



## ప్ర థ మా శ్వా స ము.



విద్యానిధియై మహామహిమచేఁ♦ జైనైక వసిష్ఠాజ లూ
తా వాతాశన సామజాటవిక గో♦త్రాదేవ నతీకగ రా
జీవాక్షీయుగ యాదవాధిపులకు♦ న్నైశ్రేయసకరం బైనయా
ర్యావామాంగము దివ్యలింగము మదీ♦యాభీష్టము ల్సల్పెడున్.

సీ. హిమధరాధరమండ♦లేశ్వరకులపాలి, కామణితనువల్లి♦ కాప్రసూన
యసితకంధరసింధు♦రాజనాంబరఘోర, గంధబంధనకర♦గంధలహరి
సంతతశివభక్తి♦సామ్రాజ్యజ్ఞాన, సారమరందని♦ష్యందధార
పరమహంసోత్తంస♦భావభృంగవ్రాత, తన్మయావస్థప్ర♦దానకేళి

తే. నిఖిలవిద్యారహస్యవా♦టీపరాగ, పాళికాపూరితాఖండ♦పద్మజాండ
పేటియై యొప్పుచంద్రార్ధ♦జూటకోటి, జోటిఁ గొల్చెద జ్ఞానప్ర♦సూనకలిక. 2

శా. వ్యాకీర్ణస్థితి నాలకించి నకులీ♦వారాహులూటాడఁగా
నాకారాక్షర మంత్రమర్మమున కా♦ద్యం బైన వర్ణంబుతో
నేకగ్రీవము సేసి పల్కెడుతురం♦గేంద్రంబుపై నెక్కి వి
ద్యాకల్పుం బ్రణుతింతు భైరవుని లీ♦లాహాస్యలీలాలయున్. 3

సీ. కాసరాసురరాజ♦కంఠనిర్గతరక్త, పంకంబు శ్రీపాద♦పద్మలాక్ష
చండముండాహవ♦సంభ్రమస్తనజాత, ఘర్మవారికణరాజి♦కంఠమాల
రక్తబీజాదిమ♦ర్దనసమయాట్టహా,సము మోమునకు లోధ్ర♦సుమరజంబు
శుంభనిశుంభర♦క్షోవీరసంహార, వేళఁ గప్పినధూళి ♦ మేలుముసుఁగు

తే. గాఁగ నేదేవి వీరశృం♦గారమూర్తి, యనుచు శోభిల్లు నట్టిదు♦ర్గాంబఁ గొలుతుఁ
గనకముఖరీసమాఖ్యగం♦గాప్రతీర, హాటకాచలతుంగశృం♦గాగ్రగేహ. 4

శా. సర్గస్థిత్యపహారకర్మనవదీ♦క్షావేళ బ్రహ్మాన్వభూ
భర్గు ల్విఘ్నములేక సాగుటకు నై ♦ ప్రార్థింపఁగాఁ దత్క్రియా
దార్ఢ్యంబు నదల్చి సంస్మరణమా ♦ త్రంబ్రాప్తిఁ గావించు దృ
జ్నిర్గచ్ఛత్కరుణాకదంబుఁ గొలుతు ♦ న్నిత్యంబు హేరంబునిన్. 5

క. ఈరీతి నిష్టదేవస,మారాధన మాచరించి ♦ యస్మత్కృతిక
న్యారత్నమునకు విద్యా,పారంగతుఁడైన వరునిఁ ♦ బరికించి మదిన్. 6

శా. వాగర్థంబులు శ్రోతృవక్తలు జగ♦ద్వంద్యుండు నద్వైతవి
ద్యాగోష్ఠిన్ వివరింప నీశ్వరుఁడ కా♦దా మత్ప్రబంధాధిప
త్యాగణ్యార్హుఁడు వేఱొకండు గలఁడే ♦ యామాట లేలంచుఁ జే
తోగమ్యుం డగు కాళహస్తిపతి నా♦థుంగా సమర్థించితిన్. 7

ఉ. ఈశుభకావ్యరత్నమున ♦ కీశు నధీశునిఁ జేసినన్ మహా
దేశికసార్వభౌముఁడు మ♦దిం బ్రమదంబు వహించి ధూర్జటీ!
నీశివభక్తి కావ్యసర♦ణిం గడు ధన్యతఁ బొంద నవ్యభా
షాశతధానిగుంభనర ♦ సస్థితి నొప్పు దలిర్పఁ జెప్పుమీ. 8

క. అని గురుఁ డనుపమకరుణా,వనధి యనుగ్రహముసేయ ♦ వరమానిమనో
వనజవనరాజహంసము, ననుభవగోచరుఁ గృతీశు ♦ నభివర్ణింతున్ 9

మ. తనయిల్లా లఖిలైకమాత, తనసం♦తానంబు భూతవ్రజం,
బనులాపంబులు వేదము, ల్దనవిహా♦రాగారము ల్మానిహృ
ద్వనజంబు, ల్దనసేవకు ల్గమలజా♦తశ్రీధరు, ల్గాఁ జెలం
గిన దేవోత్తము నమ్మహాత్ముఁ దరమే ♦ కీర్తింపఁగా నేరికిన్? 10

—◆ షష్ఠ్యంతములు. ◆—

క. ఏతత్కల్యాణగుణో,పేతున కఖిలప్రపంచ♦భిన్నాభిన్న
జ్యోతికిని నాదబిందుక,ళాతీతేశునకుఁ గాళ♦హస్తీశునకున్. 11

క. బహుముఖసువర్ణముఖరీ, లహరీశీతలశిలాత♦లస్థితమునిహృ
ద్బహిరబహిఃపరిపూర్ణున, కహరహరుదితునకుఁ గాళ♦హస్తీశునకున్. 12

క. పంచేంద్రియమత్తద్విప, పంచాస్యకిశోరమునకు ♦ భవఫణిఖగరా
ట్పంచమూకోటికి సదయదృ, గంచలనటనునకుఁ గాళ♦హస్తీశునకున్. 13

క. జ్ఞానప్రసూనకలికా, పీనకుచగుళుచ్ఛమత్త♦భృంగమునకు సం
ధ్యానటనపటువిహారమ,హానటహంసునకుఁ గాళ♦హస్తీశునకున్. 14

క. సతతత్రైగుణ్యావశా,చ్యుతకేళిజగన్మహార్ణ♦హర్నిర్మాణ
స్థితిభంజనకరణునకును, హతభవపాశునకుఁ గాళ♦హస్తీశునకున్. 15

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన శ్రీమత్కాళహస్తి మాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందుఁ దదీయ కథాసంవిధానంబునకుఁ బ్రధానస్థానంబైన మహాపురం బెట్టి దనిన.

శ్రీకాళహస్తిపుర వర్ణన

సీ. సంసారపారదో♦చ్చాటనానలకీల, కలుషసంచయతామ్ర♦గంధకంబు
కామలతామూల♦కందకుద్దాలంబు, సంకల్పపాషాణ♦టంకముఖము
రాగశాలివనాంకు♦రకడంగరీయంబు, శంకాకళంకభు♦జంగనకులి
నవమనోగోరాజ ♦ నాసికారజ్జువు, కోపనేక్షణవిశి♦ఖోపలంబు
తే. దివ్యదేశికహంసోప♦దిష్టమార్గ, నిర్గుణధ్యానసంధాన♦నిరుపమాన
సౌఖ్యసంపన్నసాధక♦జననివాస, మమృతలింగాకరము కాళ♦హస్తిపురము. 17

శా. ఆడం జిత్రము వాడవాడ ఘనకు♦డ్యస్వర్ణరత్నద్యుతుల్
చూడం జూడఁగ షణ్ముఖీకరణతే♦జోరూఢి చిత్తేక్షణ
క్రీడాదుస్తరమార్గసౌఖ్యరసవా♦ర్ధిం దేల్చుఁ దత్పట్టన
క్రోడక్షోణి నటన్న నున్నపురముల్ ♦ గొండాట కర్హంబులే? 18

మ. అతులైశ్వర్యపరంపరావిలసితం ♦ బైనట్టి తత్పట్టన
ప్రతిబింబం బనఁ జంద్రకాంతరచిత ♦ ప్రాకార మొప్పారు న
ద్భుతమాయాబహువిభ్రమభ్రమితవ ♦ స్తువ్రాతలోకోదయ
స్థితి లోఁగొన్న శివుం డసంగ హృదయా♦చింత్యప్రభావంబునన్. 19

మ. జనలోకోన్నత మైన తత్పురము తూ ♦ చా తప్పకుండంగ వ
ర్ణన సేయన్ వశమానె? గీటమునకై♦నం జక్రికైనన్ మదాం
ధునకైనన్ బహుజీవహంతకయినన్ ♦ దుర్వాసనం బాసి మో
క్షనిధిం గొల్ల గొనంగవచ్చునఁట పై♦జాడ న్విలోకించినన్. 20

మ. ఎలదోఁట ల్వనము, ల్వధూకుచము ల♦ద్రీంద్రంబు,లాకంటికి
న్ఫలము ల్వాతెర, లంగజాగమకళా♦బంధంబు లిచ్ఛాసనం
బులు, కోపంబునఁబాయుటల్ తపము, సం♦భోగంబు కైవల్య మం
దుల లీలారతి నుండు మానవుల కెం♦దుం గాన మీచిత్రముల్. 21

చ. అమితములైన జంతువుల ♦ కక్కడ నుత్తమ మధ్య మాధమ
త్వము లరయంగఁ గాన మప♦వర్గరమాసతిఁ బెండ్లియాడుచో
సమతయెకాని తత్పురము♦సాటిగ నన్యపురంబు లెన్నఁగా
నమరు నటన్న హస్తిమశ♦కాంతర మింతియ వాసి చూచినన్. 22

సీ. నైజంబులగు నిత్య♦నైమిత్తికంబులు,నడుపుచో బ్రహ్మార్ప♦ణంబు సేసి
సంగరహితబుద్ధి ♦ శాంతనవస్ఫూర్తి,వైరివర్గంబు సం♦హారమాడి

ప్రబలమహార్థప్ర♦భాసమానస్థితి, కోశంబు లుండెడు♦కొలఁదు లరసి
యాతప శీత వా ♦ తాదుల సమముగా, నాత్మప్రయత్నంబు♦లందుఁ దలఁచి
తే. సంచరింతురు బ్రాహ్మణ ♦ క్షత్ర వైశ్య, శూద్రు లవ్వీట సంతత ♦ భద్రహృదయ
నిరుపమానందవిహరణో♦న్నిద్రులగుచు, రాజయోగైకసామ్రాజ్య♦రతులభంగి. 23

చ. పరిచితబంధనైపుణి, న♦పారకళానుభవప్రసక్తి, నా
దరసవివేకసంపద, స ♦ దాశుకవాక్యసుధానుభూతి, మో
హరహితవృత్తిఁ, బ్రిస్ఫురద♦నంగరహస్యవిచారబుద్ధి, న
ప్పురమునఁ గామినీజనులు ♦ పొల్తురు యోగిజనంబుపోలికన్. 24

మ. అరగంటం గనుగొంట మందగతిఁ బూ♦ర్ణాహంకృతిం బ్రార్థనా
కరభుక్తిస్థితి ముక్తలోకభయశం♦కావృత్తి నున్మత్తన
వ్యరతి న్సత్త్వసమగ్రత న్మృదితప ♦ ద్మాభ్యున్నతి న్గంధమం
థరదంతావళకోటి యొప్పు నవధూ ♦ తప్రక్రియం దత్పురిన్. 25

క. ఆపురి తేజుల వేగ, న్వ్యాపారము గెలువ నోప ♦ మనుసిబ్బితిఁబో
చాపలవిరహితసౌఖ్యం, బాపాదించుకొను మాన♦వావళిమనముల్. 26

వ. అప్పురంబున కధీశ్వరుండు. 27

సీ. తనయాజ్ఞజంగమ ♦ స్థావరజంతుసం, తాన మెన్నఁడు జవ♦దాఁట వెఱవఁ
దన తేజమున నర్బు♦దన్యర్బుదోష్మర్బ, ధార్క-చంద్రములైన ♦ నడఁగిపోవఁ
దనదు శక్తిత్రయం♦బున సమస్తప్రపం, చంబుల కభివృద్ధి ♦ సంభవిల్లఁ
దన మహాప్రకృతిపై ♦ ద్దల చిత్తవృత్తికి, నగణితాశ్చర్యంబు ♦ నావహింపఁ
తే. జెలఁగె విశ్వేశ్వరుఁడు రాజ♦శేఖరుండు, కమఠ శర కిటి పరివృఢ ♦ కరటికుధర
విషధరాధీశ హరిముఖ ♦ వివిధభువన, భారవహులకుఁ బ్రాణంబు♦ప్రాణ మగుచు.

క. శ్రీకాళహస్తినాయకుఁ, డీకైవడి జగము లెల్ల ♦ నేలుచు నొకనాఁ
డాకస్మికంబ యాదవ, భూకాంతుని భక్తిఁ దెలియఁ ♦ బూని కడంకన్. 29

మాయాజంగమస్వరూపము.

సీ. అడుగునెత్తమ్ముల ♦ నపరంజిపావాలు, కరమునఁ గేదార♦కంకణంబు
బంగారుపాత్రచే ♦ అంగులగోణాము, గళమున రుద్రాక్ష♦కంఠమాల
యొకకేల భసితభ♦స్త్రికతోడిబెత్తంబు, సంధిగట్టిన తరు♦ణేందుధరుఁడు
మాణిక్యరుచులయో♦డ్డాణంబు భూతిపైఁ, బెట్టినకస్తూరి ♦ బిల్లబొట్టు
తే. సార్వకాలిక తాంబూల♦చర్వణార్ద్ర, రాగసౌభాగ్యమునఁ బద్మ♦రాగమణులఁ
దృణముగాఁజూచుదంతపం♦క్తియునుగలిగి, యంగజారాతియొకమిండ♦జంగమగుచు.

క. ఆరాజు నిజపురం బగు, నారాయణవనముఁజేరి ♦ నానాజనముల్
గారవమునఁ గనుఁగొన నొ, య్యారంబున రాజవీథి♦యందుఁ జరింపన్. 31

మ. తన సౌందర్యముఁ జూచి కామశరసం♦తాపంబునుం బొందఁగు
డినకాంతామణిఁ, దాల్మిదూలిని వధూ♦టిం, గౌఁగిలింపం దలం
పని శంపాలలితాంగిఁ, బోటులకుఁ జె♦ప్పంబోని పంకేరుహా
ననఁ, గీర్తింపని లేమ, మందునకునై ♦నం గాన మూహింపఁగన్. 32

—కపటజంగమరూపియైన శివుఁ డొకదాసియింట విడియుట—

శా. ఆవేళం బురపల్లవప్రకరనే♦త్రానందబాష్పాంబుధా
రావర్షాగమచంచలాలతికదు♦ర్వారప్రసూనాస్త్రితే
జోవైశ్వానరసామిధేనిరశనా♦సూత్రస్థితస్వర్ణపే
టీవిన్యస్తకపర్ది నొక్కకలకం♦ఠీరత్న మేతెంచుచున్ 33

చ. కపటకుమారజంగమవి♦కారముసం జనుదెంచు శైలజా
ధిపుఁ గని భక్తిపూర్వకమ♦తి న్నరణార్థి యొనర్చి యొక్కచేఁ
బ్రపదము లంటి తన్మృదుల♦పాణిసరోగుహదత్తభూతి ని
ద్దపునుదుటం ధరించి ప్రమ♦దామణి యిట్లనియెం బ్రియంబునన్. 34

సీ. బిజమాడుదేవరు ♦ నిజకృపాదృష్టిఁ జె,న్నారునాయిల్లు బి♦డారు మీకు
నాకు మీపాదార్చ♦నము సేయ నడలింగ,మూర్తి చేకుఱె నచ్చి ♦ మూర్తమాడి
యొడయ చిత్తేశ నా♦యునికిని మజ్జనం,బాడి శివార్చన ♦ మాడిబేకు
విచ్చేయుఁడు విభూతి ♦ వీడియంబందుకో,జంగమస్వామి నా ♦ నదనమునకు

తే. నోగిరంబులు మంచిమే ♦ లోగిరములు, నావటించెదఁ బదఁడు మీ ♦ రారగింపఁ
బ్రతిదినంబును జంగమా♦ర్చనము లేక, తనివుపడరొల్ల విజితకం♦దర్ప యనుచు.

శా. సంతోషించి మహాత్ము రాలిది శివా♦చారైక సంశీల, య
త్యాంతాపాదితజంగమార్చనకళా♦సామర్థ్య, కందర్పశు
ద్ధాంతశ్రీపరిహాసకృన్నిఖిలలో♦కాతీతసౌందర్య, యి
క్కాంతారత్నము, దీనిభక్తికి మనః♦కంజంబు రంజిల్లెడిన్. 36

క. అని కాంతా! నీయింటికిఁ, జనుదెంచెద నీదు గుబ్బ♦చనుఁగొండలసం
దునఁ దెరు వెఱుఁగక తిరిగెడి, మనసను తెరువరికి దప్పి ♦ మాన్పం గలవే? 37

క. అనవుడు నొడయని కిట్లను, వనజానన నీదు మనసు ♦ వచ్చినరీతిం
బనివినియెద మాటల కేఁ, బనిలే దీతలఁపు నాదు♦భాగ్యముగాదే? 38

ఉ. నావుడు సంతసిల్లిన మ♦నంబున జంగమలింగమూర్తి పా
రావతకంఠి కోకిలవి♦రావయు ముందరఁ బోవఁ జంద్రికా
శ్రీ వెనువెంట నేగునల ♦ శీతమయూఖుని రేఖఁ బోలి నా
నావిధభోగ్యవస్తుకల♦నం దగు తన్నిలయంబుఁ జేరుచున్. 39

క. ఆజలజేక్షణ సేసిన, పూజలు గైకొనుచు మెఱుఁగుఁ♦బోఁణి న్వదనాం
భోజమునం జిఱునగవులు, రాజిల్లఁగ సన్న సేసి ♦ రతి కెలయింపన్. 40

క. అంతకు మునుపే మరువిరి, కుంతంబులఁ జిక్కువడ్డ♦ కోమలి మిగులన్
సంతోషమంది యొకయే, కాంతగృహములోని కరిగి♦ యలరుల సెజ్జన్. 41

ఉ. తానుఁ గుమారజంగమసు♦ధాకరమౌళియుఁ గూడిమాడి యిం
పైనరతిప్రసంగముల ♦ నర్ధనిమీలితనేత్రపద్మముల్
మాననిచుంబనంబులును ♦ మాటలచొక్కులు వీడివీడిపో
నీనికవుంగిలింతలు న♦నేకవిలాసములుం జెలంగఁగన్. 42

ఉ. ఎక్కడఁ బట్టినం గళల♦యిక్కువ, లెక్కడనోరుసోఁకినన్
జక్కెర లప్ప, లేమనిన ♦ సారసుధారస, మెట్టు లుండినన్
జక్కఁదనంబు పెన్నిధులు ♦ సంభ్రమ మొప్పఁగ నేమిసేసినన్
మక్కువచెయ్వులై మెఱయు ♦ మన్మథకేళి యొనర్చునంతటన్. 43

దాసిని రాజు శిక్షించుట.

క. ఆనీలవేణి యాదవ, భూనాయకుఁ డారగింపఁ ♦ బోయెడువేళన్
దానయిపళ్లెర మిడియెడు, దానఁ గదా యనక తపసి♦తగులున నుండెన్. 44

క. భూపాలరత్న మంతటఁ, గోపంబునఁ బళ్లెరంపుఁ♦గోమలిఁ బిలువన్
బోపొండు పట్టి తెండన, నాపడఁతుకకడకు వేత్ర♦హస్తులు కడఁకన్. 45

ఆ. ఒకరిఁ బట్టఁ బలువు ♦ రుద్ధతి నేతెంచి, పిలువ నదరిపడుచు♦బెదరి లేచి
భయము రాజుకడకు♦రయమునఁదివియంగఁ, దగులు తపసికడకు♦మగుడఁదివియ. 46

సీ. వడికొల్పి యొకకేల ♦ ముడిచినకొప్పుముడి, గొబ్బునఁ గటిఁ జుట్టు♦కొన్న చేల
మొండొంటఁ బెనఁగొని ♦ యున్న హారంబులు, నిద్రదేఱెడునేత్ర♦నీరజములు
వాడఁబాఱినతీఁగ♦వంటిచక్కనిమేను, చిన్నికెంపులతోడి ♦ చిగురుమోవి
పిఱుఁదుభారంబున ♦ బెణఁకెడు పదములు, చనుఁగవవ్రేఁగున ♦ జడియుకౌను
తే. కలిగి కలఁగని మనముతోఁ ♦ గాళహస్తివిభునిఁ దలఁచుచు దిక్కనీ♦ వేయటంచు
నరగ నేతెంచి యూర్పులు ♦ నందడింప, రాజుముందర నిలిచె నం♦భోజవదన. 47

చ. నిలిచినఁ జూచి మండి ధర♦ణీపతి నిష్ఠురభాష లాడి వే
ల్పుల భ్రమయించు నీచిగురుఁ♦బోఁడిమనోహరమూర్తిరేఖకున్
వెలితి యగుం గదా యనక ♦ వేగమ నిర్దయచిత్తవృత్తిమైఁ
దల గొఱిగింపఁ బంచె; నొక♦తప్పును గావరుగా నృపాలకుల్. 48

క. పంచిన జలదమువాసిన, చంచల యనఁ జంచరీక♦సంబంధవిహీ
నాంచితలత యన లజ్జా, చంచలగతి నేగి తపసి♦చరణంబులపై. 49

చ. పడి బిగువైనపీనకుచ♦భారమువంక ధరిత్రి మోవకుం
డెడుతనువల్లితోఁ గటికి♦డెందముభూపతి దూఱుచున్ వడిన్
వెడలుదృగంబుపూరములు ♦ వెల్లిగొనం బలవించె దైవమున్
దడవుచుఁ బంచమధ్వనుల♦ తానము లీనుపికాంగనాగతిన్. 50

శిక్షితదాసిని శివుఁ డనుగ్రహించుట.

సీ. ఓయనురోదనం ♦ బోంకారమనువుగాఁ, గనుఁగవనీరు మ♦జ్జనము గాఁగ
నిడువాలుఁగన్నులు ♦ నీలోత్పలములుగా, నెమ్మోము గ్రొత్తనె♦త్తమ్మిగాఁగఁ
గమ్మని నిట్టూర్పు♦గాడ్పుధూపంబుగా, దంతకాంతులు దీప♦తతులుగాఁగ
నధరోష్ఠ మమృతోప♦హారంబుగాఁ బదాబ్జంబులఁ బడుట దం♦డంబుగాఁగ
తే. నవధరించెనో కాక లో♦కైకవిభుఁడు, భక్తజనముల ముంగిటి♦పారిజాత
మేలయేడ్చెదు మానవే♦చాలు ననుచు, హస్తమస్తకసంయోగ♦మాచరించి 51

ఉ. ఎత్తిన నింద్రజాలగురుఁ♦ డెత్తిన బర్హమనంగ మన్మథుం
డెత్తినపువ్వువింటిమద♦మెత్తినతుమ్మెదపిండునారి నాఁ
జిత్తజరాజ్యలక్ష్మి కభి♦షేకముసేయ శివుండు కాంతకై
యెత్తిననీలకుంభ రుచి♦హిండన మోయన నద్భుతంబుగన్. 52

క. నెఱిమిగులఁ గలిగి నలుపై, తఱచై మదన ప్రతాప♦దావాగ్ని శిఖల్
మెఱయు నవధూమ మనఁగాఁ, దెఱవకుఁ గచభరము వచ్చె ♦ దేవునికరుణన్. 53

సీ. వచ్చిన నానంద♦వారిధిలోఁ దేలి, జంగమయ్య పదాంబు♦జముల కెరఁగి
యతని యానతిమీఁదఁ ♦ జతురలంకారంబు, లాచరించి మహేశ్వ♦రార్చనంబుఁ
జేసి యెప్పటియట్ల ♦ చిత్తజాతునిఁ బాసి, చనుదెంచు రతియన ♦ మనుజవిభుని
సన్నిధి కేతెంచి ♦ సముచితస్థితి మ్రొక్కి, లేచిన వెరఁగంది ♦ చూచి విభుఁడు
తే. ఆజ్ఞ వెట్టించి చేతడి ♦ యార దిపుడు, దీని కెబ్భంగి మోహనం ♦ బైనవేణి
గలిగె? నీమాయ మంగలి ♦ కతనగాదె, వానిఁ దెమ్మన్నఁ గ్రమ్మఱ♦ వనిత మ్రొక్కి. 54

ఉ. విన్నప మాదరింపు పృథి♦వీవర ! మంగలి మాయ లేవియుం
బన్నఁడు, మీమహాజ్ఞకొక♦భంగము గల్గునె? సర్వమంగళా
సన్నమనోహరాంగ మొక♦జంగమలింగము నాగృహంబులో
నిన్నటినుండియుం గరుణ ♦ నివ్వటిలన్ వసియించి యుండుటన్. 55

ఉ. నీకృపలేక భంగపడి ♦ నేఁ జని యాతని దివ్యపాదనా
ళీకయుగంబులం బడి ఫ♦లించె మదీయ తపంబటంచు బా
ష్పాకులనేత్రనై పొగుల ♦ నాకరుణాంబుధి నాశిరంబుపై
శ్రీకరపల్లవం బిడినఁ ♦ జిత్రముగాఁ జనుదెంచె వెండ్రుకల్. 56

మాయాజంగమును యాదవరాజు దర్శించుట.

వ. అనవుడుఁ గనుంగొనలఁ గొనలుసాఁగుకనలున ననుకూలంబైనహృదయంబు సదయం
బుగా నొనరించి చతురుదధి వలయిత క్షితిపతి కతిపయ హితపురోహిత సచివసహి
తంబుగా నమ్మచ్చెకంటి యింటికిం జని జంగమలింగంబు పదాంభోజంబులఁ గరాం
భోజముఖాంభోజములం బూజించి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె. 57

శా. అయ్యా! యెక్కడనుండి యిక్కడికి లీ♦లార్థంబు విచ్చేసినా ?
రియ్యజ్ఞాననమీఁద నింతదయ మీ♦ కెట్లయ్యె? నేఁ డెద్ది నేఁ
జెయ్యంగాఁ గల యూడిగం బని ప్రశం♦సింపక ఫణిగ్రామణీ
శయ్యాస్థుండు ప్రసన్నమూర్తియయి రా♦జన్యు న్విలోకించుచున్. 58

ఉ. జంగమనామధేయము ని♦జంబుగ నిచ్చఁ జరించి కాళహ
స్తిం గల చోద్యము ల్బుధులు♦సెప్పఁగ వచ్చి కనుంగొన న్మహా
లింగనివాస మేమియును♦ లేమికిఁ జొక్కి 'నమశ్శివాయ' నే
యం గల కార్య మెద్దియొకొ♦ యంచు విచారముఁ జేసి యాత్మలోన్. 59

ఉ. నీకెనయైన భక్తవరు♦నిం బొడగానను గాన నీకు నే
నీకథఁ జెప్పవచ్చి జల♦జేక్షణ భక్తికి మెచ్చి పాయఁగా
లేక నిను న్మహాకపట♦లీల వశీకృతుఁ జేసినాఁడ రా
జా! కల ధౌతశైలశిఖ♦రాలయ గేహముఁ గట్టఁ బంపవే. 60

చ. అనవుడు భూవరుండు విన♦యంబున నిట్లను మీర లానతి
చ్చినగతిఁ గాళహస్తి శశి♦శేఖరు దివ్యనివాసపంక్తి మో
హనముగఁ గట్టఁబంచెదఁ ద♦దాదిపురాణకథాప్రసంగముల్
వినవలతుం గృపాంబుధి! స♦విస్తరవైఖరిఁ జెప్పవే యనన్. 61

శివుఁడు యాదవరాజునకుఁ గాళహస్తిమాహాత్మ్యం బుగ్గడించుట.

మ. అగుఁగాకంచుఁ బ్రపంచభర్త యనుకం♦పాలింగితస్వాంతుఁడై
జగతీనాథునితోడ నిట్లనియెఁ ద♦చ్చారిత్ర మాలింప నిం
పగునేని న్విను మమ్మహత్త్వము పురా♦ణాబ్ధి న్మథింపంగఁ బూ
ర్ణగతిం బుట్టిన మోక్షలక్ష్మికి విహా♦రస్థానమై యొప్పగున్. 62

చ. జనుదెస వెండికొండ ఘన♦సాల మగస్త్యధరాత్మజాలలా
మము, పరిఖాబ్ధి, రాజ్యగరి♦మం బపవర్గసుఖంబు, రాజర
త్నము పరమేశ్వరుండు, వటు♦నాథుఁడు కావలికాఁడు, తన్మహా
త్త్వముఁ గొనియాడఁగా హరిపి♦తామహ శేషుల కైన శక్యమే ? 63

మ. శమనాశారజతాద్రి మేను శిగ మా♦శంభుండు దుర్గాద్రి నీ
లమహాద్రు ల్చనుదోయి పొన్ముఖరి లీ♦లా వేణి బాహాంఘ్రులిం

ద్రమయూర్ఘాఖ్యసహస్రలింగపదభా♦రద్వాజ తీర్థంబులై
యమరుల్ ముక్తివధూటి కన్నగరమా♦హాత్మ్యంబు సామాన్యమే ? 64

ఉ. అక్కడఁ దొల్లి సింహశర♦భాదిమృగాకులమై పునఃపునః
పక్కణనిక్వణశ్రవణ♦బంధురమై శబరీకిరాతస
మ్యక్కృతమన్మథశ్రమవి♦హారమహాఖురళీకుడుంగమై
వాక్కబళీకృతేతరద♦వజ్వలనోగ్రవనంబు చెల్వగున్. 65

ఉ. వారణకుంభము ల్శబర♦వల్లభు లమ్ముల వ్రక్కలించి ర
క్తారుణమౌక్తికావళిఁ గు♦చాంతరవీథు లలంకరించి నీ
రేరుహపత్రనేత్రలకుఁ ♦ బ్రీతి యొనర్తురు తీఱ నింక వ
క్షోరుహసామ్యగర్వ మిభ♦కుంభయుగంబుల కంచు నచ్చటన్. 66

వ. అవ్వనాభిధానంబు గజకాననం, బందుఁదొల్లి వసిష్ఠునకుం బరమేశ్వరుండు ప్రసన్నుం
డైనవిధంబుఁ జెప్పెద వినుము. 67

వసిష్ఠునకుఁ బరమేశ్వరుఁడు ప్రసన్నుఁడగుట.

చ. తనయులు గాధినందనకృ♦తంబున నూర్వురుఁ జచ్చినన్ మనం
బునఁ గడలేని దుఃఖమును ♦ బొంది వసిష్ఠుఁడు గొండ యెక్కి కూ
లినఁ బడకుండఁగాఁ బుడమి♦లేమ కరంబునఁ గందుకంబుఁ బ
ట్టినగతిఁ బట్టి నిల్పి ముని♦డెందము గుం దెడలింప నిట్లనున్. 68

శా. ఓ వెఱ్ఱీ! సుతు లందఱుం దెగిన న♦య్యో దుఃఖివై యీగతిన్
జావం బుట్టువుదీఱునే? మనములో♦సంసారమున్ రోసినన్
దేవోత్తంసునిఁ బార్వతీరమణు భ♦క్తిం గొల్వుమీ చేకుఱున్
జీవన్ముక్తి యటంచు ధాత్రి యుపదే♦శింపం బ్రమోదంబునన్. 69

క. నానాముఖవాసనలకుఁ, దానక మగుచున్న హృదయ♦తామరస ముమా
జానికి నర్పించి తపో, ధీనుండై యతఁడు బ్రహ్మ♦తేజము మెఱయన్. 70

సీ. శ్రీగురుపాదరా♦జీవయుగాతపత్రచ్ఛాయ నెండకుఁ ♦ దల్లడిలక
తరుణేందుభూషణ♦ధ్యానసుధాధార, ఘోరక్షుధాబాధఁ ♦ గుటిలపడక
సకలాంగభసితకం♦చుకమున విషపుచ్ఛ, విషధరాదుల భీతి ♦ వెగడు వడక
ఘనభక్తిగర్త ని♦ర్ఘాతచిత్తస్తంభ,తను గేహమునఁ గాలి ♦ దలఁకులేక

తే. బహువిధోపాయములఁ జిక్కు♦పడక తిరుగు,ప్రకటసంసారమోహాజం♦బుకముఁబట్టి
యుద్ధవిడిఁ జంపుటకు రాజ♦యోగజాల, మాసపడి చేసె నత్యుగ్ర ♦ మైనతపము.71

శా. దావానేకపము ల్గరాపహృతపా♦థఃపూరము ల్దెచ్చి యి
చ్ఛావృత్తిం జలకంబు లార్పఁ జమరీ♦జాలంబు వాలంబులన్

పీవం గ్రోఁతులు పండ్లు గానుకలు గా♦వింపం గిరాతాంగనల్
సేవ ల్సేయఁ జెలంగె నమ్ముని తప♦స్సింహాసనాసీనుఁడై. 72

శా. శుండాలార్భకషండగండతలఖ♦ర్జూభర్జనోపార్జు నా
ఖండగ్రావము చండకుండలివిశం♦కవ్యాప్తి కింపైన శ్రీ
ఖండస్థాణువు శారికాశుకవిహం♦గవ్రాతపుంఢేత్కృకో
దండక్రీడకు నీడమై తవ మతి♦స్థైర్యంబునం జేయఁగన్. 73

ఉ. వాకిటఁ గాచియున్నహరి♦వారిజసంభవముఖ్యదేవతా
నీకమునుం దలంప కవ♦నీధరజాదరహాసలోలతం
బోక సమీపవర్తు లగు♦పుత్రులఁ జూడక భక్తభక్తిక
న్యాకరపంకజగ్రహణ♦నైష్ఠికుఁడై కడుసంభ్రమంబునన్. 74

వ. మనోదృష్టిదురభివేశ నిరవకాశీకృత దశదిశాప్రదేశంబగు దివ్యప్రకాశంబునఁ బంచభూత పంచేంద్రియ పంచవిషయ పంచక్లేశ పంచకోశాది పంచవర్గప్రాయ ప్రపంచంబుఁ బంచుకొని భక్షింపం బాలువడినపంచముఖంబులతోడి ముక్తకంచుకాకారంబునఁ బంచశరభంజనుండు పరమశివలింగరూపంబునఁ బశ్చిమాభిముఖంబుగం ప్రసన్నుండై

మ. మునిచూడామణి! నీతపంబునకు స♦మ్మోదంబునం బొంది నేఁ
డ, ననుఁ వేఁడుము నీమనంబునకు ని♦ష్టంబెద్ది నే నిత్తు న
న్న నిజస్వాంత విచింత్యమానగిరిజా♦నాథస్వరూపంబు వ
ల్కినయట్లైన భయంబు భక్తియుఁ బిసా♦ళింపం బ్రహర్షంబునన్. 76

ఉ. కన్నులు విచ్చి చూచి పుర♦తుస్మరు దిక్పరిపూర్ణదీప్తినం
పన్నతనుఁ భయాకులిత♦పద్మనిరీక్షణుఁడై వడంకు పై
కొన్న శరీర మంతయు గ♦గుర్పొడువంగఁ బ్రమోదసంభ్రమ
స్విన్నలలాటభాగమునఁ ♦ జేతులు చేర్చి మునీంద్రుఁ డిట్లనున్. 77

క. విశ్వపతి విశ్వకల్పక, విశ్వాత్మక విశ్వసాక్షి ♦ విశ్వంభర యో
విశ్వజనిస్థితిలయకర, విశ్వాధిక యనఁగ నిన్ను ♦విందు మహేశా. 78

క. ఇరువదినాలుగుతత్త్వము, లరయఁగ నీయందు పుట్టి ♦ యణఁగె నన జగ
త్పరిపూర్ణుఁడ వన దృశ్యే, తరమూర్తి వనంగ వింధుఁ ♦ దత్త్వజ్ఞులచేన్. 79

క. స్వానుభవంబునఁ దథ్యము, గానంబడుఁగాని మాయ♦ఖండాద్వైత
జ్ఞానమయాకృతి బహుభా, షానైపుణిఁ దెలియునది య♦శక్యమఁట శివా. 80

క. ఇటువంటి మిమ్ముఁ దెలిసిన,పటుబుద్ధికి భవపయోధి ♦ పశుఖురజనితా
వటమాత్రంబఁట యిల్లా,లఁట ముక్తిప్రమద యిది మ♦దభిమత మభవా. 81

తే. భక్తవత్సల కాలసం♦భవములగుచుఁ, గాలభుక్తంబు లయ్యెడి♦కమలజాది
పదవు లేనొల్లఁ గాలంబుఁ ♦ బట్టిమ్రింగ, నోపు మీచిన్మయాకృతిఁ♦జూపుమీశ.

ఉ. ఆదిగృహస్థశేఖరుఁడ ♦ వైననిన్ను భవతాపనక్షుధా
వేదనచేఁ దపఃకుతప♦వేళఁ గనుంగొనఁ గల్గె, బ్రహ్మవి
ద్యాధనభిక్షు నామహృద♦యం బనుపాత్రమునందుఁ బెట్టవే
యాదర మొప్పఁగాఁ బునర♦యాచితవృత్తి సుఖింతు నీశ్వరా. 83

క. మన్ననతో నా కిచటఁ బ్ర,సన్నుఁడవైనట్ల ఘోర ♦ సంసారగదా
పన్నౌషధఘుటికామహి,మోన్నతిఁ బూజఁగొనవయ్య♦యుగముల నెల్లన్. 84

క. ఈరెంటను నాఁడుదికిం, గోరం దగినయవి నేత్ర♦కోణములఁ గృపా
పూరంబు దొరఁగ నీవే, భోరున నన భక్తకల్ప♦భూరుహ మగుటన్. 85

సీ. తన్నులోనుగఁ జుట్టు ♦ కొన్నవటచ్ఛాయ, నిజదీప్తి మొగులునా ♦ నింగిఁ బర్వ
బ్రహ్మసంహననామ♦రద్రుపల్లవశిఖా,చ్ఛటలునాఁ గుఱుచకెం♦జడలు దనర
నీశ్వరోహమ్మను ♦ నీరహస్యముదెల్ప, మురువున సుజ్ఞాన♦ముద్ర మెఱయ
మనము చిద్రసములో♦మునిఁగిన మాటాడ, నెఱుఁగఁడో యనమౌన♦మెసకమెసఁగ
తే. నమ్మహాలింగ మధ్యంబు ♦ నందునుండి, దక్షిణామూర్తిరూపంబుఁ♦దాల్చి శివుఁడు
యౌవనశ్రీసమేతుఁడై ♦ యవతరింప, శక్తితండ్రియు నత్యంత♦భక్తితోడ.

క. పౌనఃపున్యప్రణతివి,ధానుండై మ్రోలనిలువఁ ♦ దడయక కారు
ణ్యానూనాపాంగుండై, యానిఖిలేశుఁడు భవార్తి ♦ యడఁచెడుకొఱకై 87

శా. చింతాంతస్థలమై ప్రకాశితజగ♦చ్చిత్తక్రియాభోగమై
భ్రాంతిప్రాపితజీవితప్రథితమై ♦ పద్మప్రసూతాదికీ
టాంతవ్యాపకమై మనోవిషయదూ♦రానందమై సంహృతా
ద్యంతం బైనరహస్యముం దెలిపి పా♦శానీకముం గోయుచున్. 88

వ. ఆక్షణంబ దక్షిణామూర్తియు నంతర్హితుం డయ్యె. వసిష్ఠుండును నిజప్రతిష్ఠితదివ్య
లింగోపకంఠంబున నకుంఠితానందంబున నెందేనియుం దిరుగుచుండె. పరమేశ్వరి
యుఁ బరమేశ్వరచిరవిరహభారంబు సహింపఁజాలక 89

ఉ. ప్రమథు ల్లాంచనదండము ల్గొని చతు♦ర్భాగంబులం గొల్వఁ ద
ద్రమణుల్ డగ్గఱి సేవఁ జేసి నడువన్ ♦ బ్రహ్మాచ్యుతుల్ దేవబృం
దముతో దూరమునందు ముందటఁ బఱుం♦దన్ సందడింపంగ వ
చ్చె మహాదేవి విమాన మెక్కి విభునిన్ ♦ సేవింప నచ్చోటికిన్. 90

మ. శంబరసూదనాహితుని ♦ శాసనముం దల మోచి వచ్చి లో
కాంబ తదీయసన్నిధిఁ బ్రి♦యంబున నిల్చె సమస్తభక్తభృం

గంబులఁ జిన్మరందరస♦గాఢసుఖాత్ములఁ జేసి జ్ఞానసూ
నాంబ యనంగఁ గీర్తిఁ గని ♦ యవ్యయభూభువనైకవాసనన్. 91

క. ఆదిమదంపతు లీగతి, సాదరత వసిష్ఠతాప♦సాశ్రమవనలీ
లోదవసితు లగుటయు నవి,పాదస్వాంతమున రజత♦శైలం బంతన్. 92

క. జననీజనకులఁ బాసిన, తనయునిగతి నొంటినుండఁ ♦ దగవగునె జగ
జ్జననీజనకుల హిమగిరి, తనయేశులఁ బాసి దీన♦తామతి ననుచున్ 93

శా. కైలాసం బగజేశులం గొలువ రాఁ♦గా భక్తితో దేవతా
శైలంబుం జనుదెంచెఁ గూడి ధనదా♦శం బుట్టి జోడై యమా
శాలీలాగమనంబునన్ శశిదిన♦స్వాముల్ వియద్వీథి రాఁ
గాలం బిట్లగు టేలొకో యనుచు లో♦కం బద్భుతం బందఁగన్. 94

క. ఆదంపతులకుఁ బూర్వది,శాదేశంబున విహార♦సదనం బగుచున్
దా దక్షిణకైలాసము, నాదేవప్రమదసేవ♦నప్రథ నిలిచెన్. 95

క. ఆగిరివరునకు నుత్తర, భాగంబునఁ బసిఁడికొండ ♦ భైరవ దుర్గా
నాగ ముఖ రక్షితం బై, యోగిజనాకీర్ణవైభ♦వోన్నతిఁ దనరెన్. 96

మ. అణిమాదిప్రదమై పురాణకథితం♦బై మోక్షదం బైన ద
క్షిణకైలాసముమీఁదికూరిమి విత♦ర్కింపన్ శివాజానికిన్
గణనాతీత మనంగ నేల? గిరిజా♦కర్ణోత్పలధ్వంసితో
ల్బణగండస్థలఘర్మవారియయి త♦త్ప్రాంతంబునం దిమ్మరున్. 97

సీ. విహరించు నొకవేళ ♦ విపినామ్రపల్లవ, చ్ఛాయల గిరిజాస♦హాయుఁ డగుచుఁ
గ్రీడించు నొకవేళ ♦ గిరిదరీ నిర్ఝర, ధారాపనీతని♦దాఘుఁ డగుచుఁ
జరియించు నొకవేళ ♦ శబరవేషవిశేష, మృగయావిహార స♦మీహుఁ డగుచు
విచ్చేయు నొకవేళ ♦ విధురితరతిపరి, శ్రమచంద్రికావృతో♦త్సంగుఁ డగుచు

తే. మందరాచల హిమనగా♦నందవిపిన, రజతగిరి నీలకంఠాది♦నిజనివాస
వైభవోన్నతి మఱచి దే♦వతలతోడ, హరుఁడు దక్షిణకైలాస♦ధరమునందు. 98

చ. తన కెటువంటివేడుకయొ♦ తద్గిరిమీఁద వినోదకేళి స
ల్పునపుడు పార్వతీచరణ♦పుష్కరము ల్గతినాశ్మఘట్టనం
బునఁ గసుగందకుండ నవ♦భూరుహపల్లవరాజి మెత్తఁగా
ధనదసఖుండు దేవవని♦ తాతతిచేఁ బఱపించు ముందటన్. 99

మ. అలరుందీఁగెలు పువ్వుగుత్తులు కురం♦గాలోకము ల్పల్లవం
బులు పంచాననమధ్యము ల్మధుకరం♦బు ల్బింబము ల్దాడిమీ
ఫలబీజాదులు నద్రిజావయవసా♦భాగ్యంబుతో నీకు రాఁ
గలవో లేవో యటంచుఁజూచుగతి నా♦గాద్రవంబునం ద్రిమ్మరున్. 100

సీ. శిష్టసీవారము♦ష్టింపచాశ్రమముల, మెలఁగు నంయమిగృహ♦మేధియగుచుఁ
గాంతారమధ్యప♦క్ష్మణవిహారంబులఁ, జలుపుఁ గిరాతసం♦చారి యగుచు
సంతతాంతర్యాగ♦సాధకస్థలముల, నలరారు సిద్ధగృ♦హస్థుఁ డగుచు
లలితచతుర్విధా♦లంకారములఁదాల్చు, నవభోగరతిగృహ♦నాథుఁ డగుచు
తే. మంచుగుబ్బలిరాజుకు♦మారిఁ గూడి, వేలుపులపెద్ద జముదెస ♦ వెంశికొండఁ
దన్నుఁదెలిసిన వారికి♦నన్నిదెసలఁ, దాన యగురీతి బహువేష♦ధారి యగుచు. 101

ఉ. ఆసగణేశవాస మగు♦నగ్గిరి నల్దెస నామడర్ యను
గ్రామసమహోర్మ్యాదేహులకుఁ ♦ గాలము సేరువమైన దీర్ఘని
శ్వాసము హంసమంత్రమణి ♦ చక్షులు మూయుట యోగనిద్ర, మూ
ర్ఛానమయంబు దత్పరవ♦శత్వము, సచ్చుట మోక్షమౌఁ దుదిన్. 102

చ. జడలు ధరింప, రంగజునిఁ ♦ జంపరు, పూయరు బూదిపూఁత్పమై,
నడుగరు భిక్ష, కట్ట రజి♦నాంబరము, ల్చరియింపఁబోరు పే
రడవుల, నగ్గిరీంద్రమహి♦మాతిశయం, బిఁక నేమిసెప్పఁదుర్
బడయుదు రూరకుండియును ♦ బ్రాణులు చిత్రముగా శివత్వమున్. 103

మ. భవదావాగ్ని విదాహముం జెఱుచు నా♦పై జాడ నేతెంచినర్
బవమానంబులు నిర్ఘరోభయతటీ♦పాటల్యశోకాటవీ
నవమల్లీ నవమాలికా వకుళ పు♦న్నాగామ్రచాంపేయ గా
లవనీప ప్రసవాది గంధలహరీ♦లక్ష్మీమదప్రోద్ధతిన్. 104

చ. అమరమనుష్యదైత్యభుజ♦గాదులు గూడి చరింతు రగ్గిరిం
ద్రమున నఖండసౌఖ్యరస♦దాయకమైన శివాగమప్రభా
వముఁ దమలోనఁ దాము సరి ♦ వచ్చెఁగదా యని శంక దీర భా
వముల మథించి చూచి తను♦వాత సమాధినిమీలితాక్షులై. 105

ఉ. వేలుపుఁగొమ్మ లందుఁ జల♦వృక్షములర్ వివరింపలేక యు
య్యాలలు గట్టియాడ నవి♦యల్లన దవ్వుగఁ బోయినర్ మహాం
దోళనమంది మున్నుదమ♦తోడనె కొప్పులనుండి చాలుగా
రాలిన దివ్యపుష్ప నిక♦రంబుల చొప్పున వత్తు రిండ్లకున్. 106

వ. తదనంతరంబ సువర్ణముఖరీజననప్రకారంబు సెప్పెద వినుము. 107

## సువర్ణముఖరీజనన ప్రకారము.

సీ. తనపెండ్లిఁ జూడంగ ♦ దక్షిణదిక్చరా,చరభూతములు హిమ♦శైలమునకుఁ
జనుదేర నుత్తరా♦శాభూమి గ్రుంకి ద,క్షిణభూమి కడునొడ్డ♦గెడవు గాఁగ
నెగసిన నిది మాన్ప♦నీశైన నేనైనఁ, గాని సమర్థులఁ ♦ గాన మెందుఁ
బొమ్మన్న ఘటసూతి ♦ భూతేశ్వరుని యాజ్ఞఁ, దలమోచి యుల్లాలుఁ♦దానుగదలి

తే. వింధ్యపర్వతి గర్వంబు♦విఱుగఁ ద్రొక్కి,గౌతమీ కృష్ణవేణ్యాప♦గాహనములు
సేసి శ్రీశైలనాథు దర్శించి జ్యోతి, సిద్ధవటనాథుఁ గొల్చి వి♦చ్చేయునపుడు. 108

మ. పరిణతు ల్సేయుచుఁ గాంచె కుంభజుఁడు లో♦పాముద్రతోఁ గూడి ద
క్షిణకైలాసము, నంబికాహరకృత♦శ్రీపాదుకాన్యాసముం
మణిమంత్రౌషధ వాసముం, భవమహా♦మాయావిపర్యాసముం,
గణనాతీతనటీవిలాసము, సమ♦గ్రశ్రీ సముల్లాసమున్. 109

క. కాంచి మునీంద్రుఁడు జలనిధి, కాంచీవలయప్రసిద్ధ♦ కాశీమధురా
కాంచీముఖపురలక్ష్మీ,కాంచీమణి యామ్యభాగ♦కైలాసగిరిన్. 110

క. డగ్గఱి పెనఁగొను దురితపుఁ, బగ్గంబులఁ ద్రెంచివైచి ♦ పరిమదాశ్రితతుల్
దృగ్గోళంబులఁ దొరఁగఁగ, దగ్గుత్తికతోడఁ దనదు♦దయితయుఁ దానున్. 111

శా. కాంచెం వంచితపాంచభౌతిక సుఖా♦కారాంగముం, జిన్నటీ
సంచారాంచితరంగముం, మునిమన♦స్సమ్యక్పరిష్వంగముం
బంచాస్త్రాసుమరుద్భుజంగము, కృపా♦పాణింధమాపాంగముం,
బ్రాంచన్ముక్తికళత్రసంగము, ఫణా♦రాజన్మహాలింగమున్. 112

క. కాంచి వధూయుతుఁడై ఫుల,కాంచిత దేహమునఁ బ్రణతుఁ♦డై ధ్యానించెం
గించిన్ముకుళితనయనయు,గాంచలుఁడై వాని దర్శ♦నానందముతోన్ 113

సీ. అర్చించె శివుని స♦హస్రనామంబుల, వివిధవాక్ప్రౌఢిఁ గా♦వించె నుతులు
సేసెఁ బెక్కులు ప్రద♦క్షిణములు జపియించెఁ, బంచాక్షరంబు స♦ప్రణవముగను
ధ్యాన నిష్ఠాబుద్ధి♦మానముద్ర వహించె, నానందపరవశుం ♦డయ్యెఁ బిదపఁ
దలఁగి పోఁజాలక♦ నిలిచిచూచుచు నుండెఁ,దలయూఁచి వెరఁగందెఁ ♦దనకుఁదాన

తే. కాశికానాథ విప్రయో♦గవ్యథావి,దూరుఁడగుచు వసిష్ఠత♦పోరమాను
భావ మాంత్ర్యవధూటితోఁ♦బ్రణుతిఁ జేసె,మునిశిఖామణి దక్షిణా♦మూర్తిఁగొలిచె

స్రగ్ధర. పంచాశద్వర్ణమూర్తిం ♦ బరశివరమణిం ♦ బంచభూతాత్మ పీఠం .
బంచక్లేశప్రణాశ♦ప్రఘటనచతురం ♦ బంచవిద్యాస్వరూపం
బంచాశత్కోటిపృథ్వీ ♦ భరణచణమహా ♦ భాగ్యలక్ష్మీప్రదాత్రీ
సంచారాగారయోగీ♦శ్వరజనహృదయం ♦ జ్ఞానపుష్పాంబఁ గొల్చెన్. 115

తే. ఎక్కె దుర్గాంబకొండ ము♦నీశ్వరుండు, మ్రొక్కెఁ దత్పాదనీరేజ♦ములకుభక్తిఁ
జొక్కెఁ దద్దివ్యరూపంబుఁ ♦ జూచినపుడ, దక్కెనతనికి ముక్తితా♦టంకవతియు.

వ. మఱియు నమ్మునీశ్వరుండు గణేశ్వర భైరవాదులఁ గొల్చి మునీశ్వరులసన్నిధిని నిల్చి చంద్రికాకందళితంబుగాని నిండుఁజందురుచందంబున మందాకినీ సుందరంబగు పుణ్యనదీప్రవాహంబు లేనికతంబున నిమ్మహాస్థలంబు దుఃఖంబు నావహించుచున్న

యది. పరమేశ్వరు నుద్దేశించి తపం బొనర్చి యిక్కడ నొక్కనదిఁ బ్రవహింపఁ జేయవలయు నని యీసంకల్పంబు నిర్విఘ్నంబుగా ననుగ్రహింపుఁ డని వారలచే ననిపించుకొని దక్షిణకైలాస గోత్రంబునకుం జతుర్యోజనమాత్రంబున రాత్రిం
చరదిశాభాగంబున నొక్కమహాశైలంబుఁ గని 117

ఉ. చేరఁగఁ బోయి యాత్మసర♦సీరుహలోచన కేలు వట్టి వ
క్షోరుహకుంభభారమున ♦ సూక్ష్మవలగ్నము వీడఁ బొందఁ బొం
దారయువృత్తి రమ్మనుచు ♦ నాదరణంబునఁ దోడుకొంచు విం
ధ్యారి తదగ్రభాగమున ♦ కల్లన యెక్కి ఝరాంబుధారలన్. 118

క. స్నానంబుసేసి నిజకర్మానుష్ఠానంబు దీర్చి ♦ యభిమతపుణ్య
స్థానమునఁ దపము సేయఁగఁ, బూనిసుఖాసనదృఢత్వ♦మునఁ గూర్చుండెన్. 119

చ. తపమొనరింతుఁ గాక హిమ♦ధామకిరీటునిఁగూర్చి తన్మహా
కృపఁ బ్రవహించుఁ గాక భవ♦కిల్బిషవిద్విషదభ్రసింధు వీ
విపుల జనంబులెల్లఁ గడు ♦ వేడుకఁబొందఁగ నంచుఁ బల్కు న
త్తపసి కభీష్టసూచనవి♦ధాయకవాక్యము నభ్రవాణియున్. 120

శా. శంకాతంకముమాని మానియు సహ♦ర్షస్వాంతుఁడై చంద్రమో
లంకారుఁ, జగదేకనాయకు, మహా ♦ శ్లాఘావరస్థాను, మీ
నాంకధ్వంసకు, నీశ్వరుఁ, హృదయపీ♦ఠాసీనుఁ గావించి సా
యంకాలానలమూర్తియై తపముసే♦యం జొచ్చె ధైర్యంబునన్. 121

సీ. దూరీకృతస్తన♦భారకంచుకవధూ,జనము మానవకరాం♦చద్వ్యజనము
గంధసారాచల♦గంధవాహారిరంసు, జన్య ముష్ణీకృత♦శ్వాసచయము
విక్షిప్తజలసమా♦విర్భూతబాష్పభూ,తల మధ్వగాయాస ♦ దాయకంబు
ప్రాణేశ్వరీపరీ♦రంభణప్రత్యూహ,కారి ఘర్మోదకో♦ద్గమనకర్త

తే. యంబరాంతరవిశ్వంభ♦రాంబుపూర, సంచరిష్ణుపరస్పర ♦ స్థలవిహార
సమభిలాషప్రవర్ధిష్ణు♦చటులతాప, మంత నేతెంచె దారుణో♦ష్ణాగమంబు. 122

ఉ. ఎండఁ గొలంకులెల్లను, మ♦హీధరముల్ దవవహ్నికీలలన్
మండె, ధరాతలం బినుప♦మంగలముంబలె నుండెఁ గాలి, యా
యెండల నేమి సెప్పఁ బర♦మేశ్వర యావరణాంబురాశిలే
కుండిన నాఁడె పొక్కనడ ♦ కుండునె పద్మభవాండభాండముల్. 123

సీ. దేవతాచక్రవ♦ర్తిత్వంబునొందిన, నహుషుఁ గోపించెఁ బ♦న్నగముగాఁగ
నూర్ధ్వాండకర్పరం ♦ బొరయు వింధ్యాద్రికూ, టంబులు నేలమ♦ట్టంబు సేసె
బడబాగ్ని వడికి లో♦బడని పాథోరాశి, భోరునఁ గొనియె నా♦పోశనముగ
ఖలుల వాతాపి ని ♦ ల్వలుని లోకైకదు, ర్మదులనునహామన్ను ♦ మనుచుఁగొనియె

తే. నితని తెరు వేలపో నని ♦ యినుఁడు వెఱచి, తన్నుఁజెనకఁడో యాతప♦ స్తంభనంబు
నేర్చెనో కాని యమ్ముని ♦ నిష్కళంక, చిత్తుఁడై నిండు వేసవిఁ♦జేసెఁదపము. 124

శా. ఆతీవ్రాతపవేళఁ బంచశిఖ మ♦ధ్యక్షోణిఁ గూర్చుండి ఖ
ద్యోతన్యస్తనిరీక్షణుం డగుచుఁ ద♦ద్ద్యోతప్రతాపప్రభా
స్ఫీతుండై తప మాచరింపఁగ దిశా♦బృందారకాధీశ్వరుల్
భీతిం బొందిరి స్వాధికారగరిమల్ ♦ పేడెత్తునం చాత్మలోన్. 125

శా. అంతం బూర్వ ఘవైరముం దలఁచి విం♦ధ్యగ్రావకూటంబు ల
భ్రాంతం బంతయుఁ గప్పెనో, జలధి యా♦త్మారాతిపైఁ బోయి ని
ర్జింతుం గాకని యెత్తివచ్చెనో, తనుం ♦ జెండాడు భాస్వంతు మా
యింతుం గాకని నిల్చెనో యిరులు, నా ♦ నేతెంచెఁ గాలాభ్రముల్. 126

తే. మొగులుమొగులున మెఱుఁగులు ♦ నిగుడఁ దొడఁగె
మెఱుఁగుమెఱుఁగున నుఱుములు ♦ మెండుకొనియె
నుఱుమ నుఱుమంగఁ బిడుగులు ♦ నుప్పతిల్లె
నింతకంతెను వర్షంబు ♦ నెక్కుడయ్యె. 127

సీ. ప్రళయవేళాసము♦ద్భవ పుష్కలావర్త, కాది పయోదవ♦ర్షాంబు వనఁగ
నూర్ధ్వాండకర్పరం ♦ బుఱుములచే వ్రక్క, లై కాఱు నావర♦ణాంభ మనఁగ
జండాంశుకరములు ♦ జలరూపమైధరా, భువనంబు నొక్కటఁ ♦ బొదివె ననఁగ
ధరణిపైఁ బాఱంగ ♦ సురలు దీర్చిన యభ్ర,గంగాప్రవాహంపుఁ♦గాల్వ లనఁగ
తే. వాయువును మిన్ను తేజంబు♦వసుమతియును, జీవనాకారముగను వ♦ర్షింపఁదొడఁగె
నీరు నేలయు మెఱుఁగును♦నింగి గాన్పుఁ, దానయై ముని యోడక♦తపము సేసె.

మ. తెలుపుం దేజము నంత నంతటఁ దటి♦త్తీవ్రప్రభాపుంజమై
తలచూపుం ధర మేదినీధరశిఖా♦దంభంబునన్, గర్జగా
నెలుఁగిచ్చున్ గగనంబు, వర్షసఖుఁడై ♦ యేతెంచు గాడ్పున్, దముం
జలదాసార మణంచెనో యని జను ♦ ల్శంకింపకుండ న్మదిన్. 129

ఉ. ఆతరువాత జంతునివ♦హంబు వడంక నణంకువేది యో
షాతతి ప్రాణవల్లభుల ♦ సంతతముం బరిరంభణంబులన్
బ్రీతులఁ జేయ సూర్యశశి♦బింబ మటంచుఁ జకోరదంపతుల్
భీతిఁ దొఱంగ వచ్చె నతి♦భీకరశైత్యము శీతకాలమున్. 130

ఉ. నిండుమనంబుతో విజిత♦నీరధి గుత్తుకబంటినీటిలో
నుండి తదుగ్రశైత్యమున ♦ కోర్చి తపం బొనరింప వంత నా
ఖండలముఖ్యు లవ్విధికి ♦ గ్రక్కునఁ జెప్పిరి, వారిఁ గూడి యా
తండునుఁ బోయి శంకరు స♦దాశివు సోమునిఁ గాంచె భక్తితోన్. 131

శా. క్రోడాకారముఁ దాల్చి పోత్రమున వై♦కుంఠుండు భూభేదన
క్రీడాలంపటుఁ డయ్యు మీపదము వీ♦క్షింపంగ లేఁడయ్యె, నేఁ
జూడం గంటి, ఫలించె నాతప మటం♦చున్ మ్రొక్కి కన్నీరు దో
డ్తోడన్ జెప్పలఁ జిప్పిలంగఁ బునరు♦క్తుల్ గాఁగఁ బ్రార్థించుచున్. 132

శా. ఓదేవోత్తమ! భక్తవత్సల! యగ♦స్త్యుం డుగ్రవృత్తిం దపం
బేదేవాధిపతిత్వముం బడయనో ♦ యేకాంతియై చేయ నిం
ద్రాదుల్ నా కెఱిఁగింప విన్నపము సే♦యన్ వచ్చితిన్, మాకుఁ జిం
తాదుఃఖంబులు దీఱ నమ్మునికిఁ జే♦తఃప్రీతిఁ గావింపవే. 133

చ. అనవుడు శంకరుండు దర♦హాసము మోమున నంకురింప న
వ్వనజభవాదిదేవతల♦వంకఁ గనుంగొని మీకు భీతిఁ బొం
దను బనిలే, దగస్త్యముని ♦ దక్షిణరౌప్యధరాధరంబుదా
వున నది లేనిదుఃఖమునఁ ♦ బూనె మహాతప మాచరింపఁగన్. 134

క. ఇది నే నెఱుఁగుదు నమ్ముని, మది నుండినయట్ల నాదు♦మనమున నుంచున్
జదలే ఱనిపెద నీబడి, నది యాతని కొసఁగి మరలు ♦ డంబుజగర్భా! 135

ఉ. ఏమిటి కింతమాత్రమున ♦ కే నరుగన్ జని నీవు సంయమి
గ్రామణితోడ నే ననుపఁ♦గాఁ జనుదెంచితి నంచుఁ బల్కి త
త్కామితవస్తు విమ్ము చిర♦కాలకృతోగ్రతపస్సమాధిని
ష్ఠామితఖేద మెల్ల నిమి♦షార్ధములో నుడివోవ గ్రక్కునన్. 136

వ. అని కృపారసతరంగితాంతరంగుండై మహాదేవుం డనుపుటయును. 137

సీ. దేవతాపతి శచీ♦దేవిఁ గూడఁ దలంచె, హవ్య మాహరింప ♦ నగ్ని గోరె
జముఁడు ధర్మాధర్మ♦సరణి విచారించె, నరభోజనాపేక్షఁ ♦ బొరలె నసుర
దేశకాలము లెన్నఁ ♦ దివిరె నంభోభర్త, కరువలి తనయిచ్చఁ ♦ దిరుగఁ దొడఁగె
ధనపతి సంతత♦త్యాగ మీఁ దలపెట్టె, నీశానుఁ డీశభూతి ♦ కేన యనియె

తే. నఖిలలోకైకనాథుని♦యాజ్ఞవలన, నిరుపమానంద విహరణ♦గరిమ మెఱయ
వారియుల్లాసమునకు భా♦వమునఁ బొంగి, యజుఁ డగస్త్యునియెదుటఁ బ్ర♦త్యక్ష మగుచు

ఉ. ఏ నజుఁడన్ మునీంద్ర! పర♦మేశుఁడు నీకు నభీప్సితంబు న
న్నీ నియమించి పంచె, వర♦మెయ్యది వేఁడు మటన్న నభ్రగం
గానదిఁ దెచ్చి యిచ్చుట న♦ఖండగతిం బ్రవహింపఁ జేయవే
దాన మనోరథంబు ఫలి♦తం బగు నాకుఁ బయోజసంభవా. 139

ఉ. నావుడుఁ దమ్మిచూలి గగ♦నంబుఁ గనుంగొనఁగా సువర్ణశో
భావిభవంబుతో బహుళ♦భంగ మహాముఖరత్వ సంపదన్

దేవనదీఝరంబు నను దెంచినఁ గాంచి విరించి తద్గుణ
శ్రీ వెలయన్ సువర్ణముఖరీప్రథ దానికిఁ గల్గఁజేయుచున్. 140

శా. అంతర్ధానముసేసె; సంయమికులాధ్యక్షుండు సంతోషిత
స్వాంతుం డయ్యె; వహించె నగ్గిరి యగస్త్యగ్రావవిఖ్యాతి; నా
శాంతంబుల్ పగులంగ మ్రోయుచు నభంబాద్యంతమున్ శీకరా
క్రాంతంబై మెఱయన్ సువర్ణముఖరీగంగానదీరత్నమున్ 141

వ. పవనాశనభవనభువనం బొరయుచుం బ్రవహింపం దొడంగె; నప్పుడు హరినఖరముఖ
వినిర్దళిత కుంభికుంభగళిత ముక్తాఫలంబులు నిజగర్భ శుక్తిముక్తముక్తాఫలంబులుఁ
గాలపరిపక్వ సమాగతమగణచమరీమృగా నీలవాలంబులు శైవాలంబులు వళక్ష
చామరజాలంబులు డిండీరికాధవళితకల్లోలంబులుఁ గుసుమశరపరితాప పరవశవశా
నిమిత్త మత్తవేదండభండన క్రీడాఖండిత దండకాండంబులు బిసకాండంబులుఁ
బ్రవాహవేగంబునం గూలి తేలు పుష్పితరసాలసాలశాఖాకదంబంబును గాదం
బాడంబరంబునుం గలిగి కరిగిరివజ్రపాతమహానినదంబునం బెకలిపడు కొండల
చప్పుళ్లకు నప్పటప్పటికిఁ బెదరి యుప్పరం బెగయు జలపక్షుల పక్షవిక్షేపంబులం
బరఁగు తుంపరలపరంపరల నిలింపదంపతులకు రతిలంపటంబున మోములు చెమ
రింపకుండ నింపుసేసి పూర్వదుర్వాసనాసక్తులై ముక్తులుగాక లోకంబులవారు
రారోయని చీరుతెఱంగున నభంగభంగ పరంపరా ఘోషంబున నుద్రేకించి యరుణ
ధరణీభాగ యోగంబున శోణభద్రాకారంబును శ్వేతభూతల సమేత స్రోతంబుల
వలన క్షీరతరంగిణీ శృంగారంబును నీలక్షోణీతల ప్రవాహశ్రేణివలనఁ గృష్ణవేణీ
విలాసంబును నడ్డంబుగ నుండుకొండలఁ దాఁకి తిరిగితిరిగి యరుగుదెంచుటం జేసి
పునఃపునః ప్రవాహమోహనంబునుం దనరఁ దనయందు నివి మొదలయిన తీర్థం
బులు గలవని యవనీజనంబులకుఁ దెలుపు మెలపున వెలుఁగుచు యోగీశ్వరభావ
స్వభావంబునుంబోలె యమంద బిందుసముదయంబును నిరంతర నాదప్రసాద మేదుర
హృదయంబును సంసారవారాకర తరణకారణకళాప్రకాశంబును లంఘితాలంఘ్య
విషయప్రదేశంబును యథేచ్ఛవ్యాపార జీవనంబును లోకైకపావనంబును నై
వాసుదేవ లీలావిలాసంబునుంబోలె మత్స్యకచ్ఛపాద్యవతారవిహారంబును శంఖ
చక్రశోభితాకారంబును బర్వతోత్పాటన పాటవాటోపంబును వినిర్మాలితపలాశ
కలాపంబును నపారగోరక్షణ హేతుభూతంబును విదళితనరకసంజాతజనఖేదన
సన్నిపాతంబును నై మహాదేవ విభ్రమవిహారంబునుంబోలె నిరవశేషీకృతార్జున
శరసమూహంబును మథితమన్మథ సముత్సాహంబును గగనతరంగిణీ సంగతస
ముత్తుంగ పురభంగురప్రభావంబును నిజాశ్లేషనిమగ్న శివాభాగంబునునై భిల్లవల్ల
భులపల్లియలపై వెల్లివొడిచినం దల్లడపడి వెడలునెడ నిఱుపేదనడుములకు నొడరు

వ్రాడమునను వసువునఁ బుడమి నడుగిడ నోడుపడంతుల వెఱపుసువు నెపంబున నుపనాథులెత్తుకొని గుత్తంపుంజనుగుబ్బల యొత్తునఁ జిత్తంబులు చిత్తజాయత్తంబులై తత్తఱపడఁ గొండనెత్తంబుల కెక్కిన మక్కువలం గలసి మెలసి వినోదించుటకు నిధానంబగుచు రాజహంస రథాంగ సంకులంబునకుఁ బ్రతిఘటించు నుభయతటాటవికరిఘట బృంహితంబు లసహ్యంబు లగుటయు గహ్వరంబులనుండి మ్రోయు సింహనాదంబులం బ్రోదిసేయు తరంగతురంగ గళగళారావంబు నొండొండ రోదసీకుహరంబులు నిండం జండతరంబులైన దురితంబులపై దండు వెడలు చందంబునఁ గనుపట్టుచు వేంకటాచలాలంకారంబై పరశురామేశ్వర క్రీడారంగంబునకు రంగవల్లికయై కాళహస్తిపుర లక్ష్మీబాలికామణికి మణిమాలికయై యోంకారపుటభేదన భాగ్యదేవతాలలామంబై పరస్పరవీచీకరోత్క్షిప్త శీకరమౌక్తిక జాలంబుల వారాకరవరుం బరిణయంబయ్యె. ఘటసూతియుఁ దత్తటినీతటంబుల శివలింగప్రతిష్ఠలు సేయుచు దక్షిణకైలాసంబుఁ జేరం జనుదెంచి 142

శా. లోపాముద్రయుఁ దాను హేమముఖరీలోలోర్మిడోలాంతర
వ్యాపారంబులఁ దేలి భూతియును రుద్రాక్షంబులుం బూని వి
ద్యాపుంరూపములో యనంగ నతిశాంతాకారులై దివ్యలిం
గోపాంతంబున నిల్చి తాపసజనం బోహో యనన్ భక్తితోన్. 143

క. పంచేంద్రియపథముల వర్తించుమనోధ్వగుని శివుని తెలివునఁ బో బో
ధించిరి వంచించిరి ప్రా,పంచకసౌఖ్యములఁ బరమపరవశులగుచున్. 144

తే. ఎట్టకేలకుఁ జూపు బహిర్గతంబు, గాఁగ నిట్లని వినుతించెఁ గలశభవుఁడు
దేహ ముప్పొంగ వాక్యప్రవాహసరణి, దివ్యమును లెల్ల నిది యుపదేశ మనఁగ.

దండకము. శ్రీమన్మహాదేవ! దేవాదిదేవా! నిమగ్నీకృతాజాండభాండప్రకాశా! మహేశా! మహాయోగిపుంయోగ నిద్రాసమున్నిద్రితానందరూపా! భవార్ణోనిధానాంతరాపన్నరత్నాంతరీపా! జగద్దీప! నిర్లేప! బ్రహ్మాండపిండాండ బాహ్యాంతరాళంబులం బూర్ణమై సూక్ష్మసూక్ష్మార్థమై స్వార్థమై యున్న నిన్నున్ మహామాయచే జీవునిం జేసి మహ్యాదితత్త్వాత్మకంబైన దేహంబు గేహంబుగా నిల్పితే గుణ్యముల్ గణ్యముల్ బుద్ధ్యహంకారచిత్తంబులున్ జ్ఞానకర్మేంద్రియంబుల్ షడంతర్విరోధుల్ ఘనక్లేశముల్ పాశముల్ కోశముల్ జన్మనాశాద్యవస్థల్ వృథా నీకుఁ గల్పించి సత్కర్మ దుష్కర్మబంధంబులం జిక్కి తా మైహికాముష్మికానందదుఃఖంబులం బొంది నిన్నాత్మ భావించుచో నిన్నియున్ లేమి యూహింపఁగా లేక లోకుల్ దమోంధీకృతాలోకులై పోవఁ బోవం గృపామూర్తివై కాలదిగ్భాగ కైలాస శైలంబునన్ దివ్యలింగాకృతిన్ భూమిఁ బ్రత్యక్షమై వేదవేదాంత విద్యాదితర్కోక్తులం గంతశోషంబుగా వాదముల్ సేయుచున్ బుద్ధివైదగ్ధినే

దర్శనం బిచ్చుచున్ వచ్చు దానిం బ్రతిష్ఠించుచున్ మంత్రశాస్త్రార్థ చింతాపరి
శ్రాంతిమైఁ గొంతకాలంబు నానావిధారాధనల్ సేయుచున్ సిద్ధ నీరేజకూర్మాసనా
భ్యాస నాడీసదాశోధనా యాసముంబొంది యాధానజాలంధరోడ్డీన బంధంబులం
బట్టుచుం గుండలీశక్తివక్త్రం బవక్రంబుగాఁజేసి షట్చక్రికావీథిఁ జేతస్సమేతంబుగా
వాయువున్ గ్రోలుచుం, దన్మనోగంధవాహంబులన్ బ్రహ్మరంధ్రోపరివ్యాపకం
బైనసంవిన్మయాకాశదేశాంతరోద్యత్పరబ్రహ్మచంద్రోదయజ్యోత్స్నఁ దాదాత్మ్య
ముం బొందఁగాఁజేయుచుంబుత్రపుత్రీకళత్రంబులన్ శత్రుమిత్రంబులన్ శీతవాతా
తపాది వ్యవస్థాదిభేదంబు ఖేదంబు మోదంబు కృత్యం బకృత్యంబు హేయం బహే
యంబునున్ లేక లోకంబు లెల్లం బరబ్రహ్మరూపంబుగాఁ జూచుచున్ స్వేచ్ఛఁ
గ్రీడించువారల్ దుదింబొందు లాభంబు నీవై హరిబ్రహ్మకీటాంతజంతువ్రజంబుల్
వినోదంబుగా మిమ్ము దర్శించినన్ ముక్తులంజేయుచున్ సత్యమై నిత్యమై జ్ఞానమై
జ్ఞేయమై జ్ఞాతవై యున్ననిన్నుం బ్రశంసింప నేనెంతవాఁడన్ మదీయాపరాధంబు
లేపట్టునన్ బట్టకే పూర్ణకారుణ్యదృష్టిన్ ననుం జూడవే భక్తవత్సానుగచ్ఛన్నరు
నైచికీ! భక్తలీలావనీకల్పకా! భక్తసంతానచింతామణీ! భక్తసంతోషవారాశి
చంద్రోదయా! భక్తకోటీవిపద్గోత్రవజ్రాయుధా! భక్తసందోహసంతాపహా!
భక్తసంకల్పసంసిద్ధిరూపా! నమస్తే నమస్తే నమః 146

మ. అని కీర్తించి తపస్వికేసరి యఖం♦డానందదుగ్ధార్ణవం
బునఁ గ్రీడించుచు ఫాలభాగమున మో♦డ్పుం గేలు గీలించి యం
గనయుం దాను బ్రదక్షిణంబులు నమ♦స్కారంబులుం బెక్కు లీ
శునకుం జేసి సువర్ణపర్వతధను♦శ్శుద్ధాంతకాంతామణిన్ 147

క. జ్ఞానప్రసూనకలికన్, మానస మత్యంతభ♦క్తిమగ్నంబుగఁ గ
న్గోనల బాష్పోదకములు, సోనలుగాఁ గురియఁ గుంభ♦జుఁడు దర్శించెన్. 148

క. అపిమ్మట నక్కడఁ గల, తాపసబృందంబుతోడ♦ దంపతు లాశై
లోపాంత హేమముఖరీ, ద్వీపవతీతటశిలాప్ర♦దేశమునందున్. 149

క. కూర్చుండి మునుల కభవునిఁ, గూర్చి తపం బాచరింపఁ♦ గోరిక లవుడీ
డేర్చిన విధంబు వీనులఁ, జేర్చి వినఁగ వినయగరిమఁ♦ జెప్పఁగ వారున్. 150

సీ. నీ వీశుమహిమంబు♦ నిశ్చయింపఁగ నిశ్చ, యించు నీమహిమ మీ♦ హేమవర్ణ
నీవు శంకరపాద♦ నీరేజములఁ గొల్వఁ, గొలుచు నీపదము లీ♦ కులవధూటి
నీవు సరేశ్వరు♦ నిత్యంబు భావింప, భావించు నిన్ను నీ♦ పరమసాధ్వి
నీవు శివైక్యంబు♦ నిర్వహింపఁగ నిర్వ, హించు నీయైక్య మీ♦ యిందువదన

తే. శైవచూడామణివి నీవు♦ నీవెలంది, ప్రథమగణనీయ యగుఁ బతి♦వ్రతలలోనఁ
గాన మీకు నసాధ్యము♦ ల్గలవె జగతి, మావశం బయ్యె మీయను♦భావ మెన్న.

క. నీతపము కల్పధరణీ,జాతము తత్ఫలము నీదు♦సాధ్వీవిలస
త్పాతివ్రత్యము లోక,వ్రాతమునకు మిమ్ముఁ బొగ♦డ వశమే మాకున్? 152

క. శితికంఠుఁ డద్రికన్యా,పతియై సుఖియయ్యె భువన♦భవనంబులఁ ద
త్ప్రతిగా లోపాముద్రా, పతివై సుఖివైతి వీవు ♦ పరమమునీంద్రా. 153

క. మీకిరువురకే దొరయుం, గాక భవత్సదృశు లెన్నఁ♦గలరే నానా
లోకంబుల? మీమహిమము, మీకే తెలియు న్వశంబె♦మిమ్ముం బొగడన్. 154

చ. అన విని కుంభజుండు విన♦యంబున నిట్లను మీరనుగ్రహిం
చినఁ దృణమైన మేరువగుఁ ♦ జిత్తము వేఱొకరీతి నున్న న
య్యనిమిషశైలమైనఁ దృణ♦ మౌ నటుగాన ఫలించె నాతపం
బనఘచరిత్రులార! నను ♦ నాదరణంబున మీరు గన్గొనన్. 155

క. అది యట్లుండఁగ నిండీ, నదియిక్కడ నుత్తరంబు♦నకు నభిముఖమై
నదియును శివునకుఁ గృహమై, నదియుం దలపోయ నిదియ♦ యవిముక్తంబున్. 156

క. కీటం బయినను నీనది, నీటం దొరఁగుటయుఁ గాల♦నియతి మృతంబై
యాటవికాధిపు పుక్కిటి,నీటం దోఁచును బురాణ♦ నిశ్చయ మెందున్. 157

ఉ. ఏమని చెప్ప నిచ్చటియ♦హీనమహత్త్వము దోమ చచ్చినన్
సామజపూజఁ గాంచు,మఱి♦సామజ మీల్గిన సామజారియై
సేమముఁబొందుఁ, గాముకుఁడు♦ చెల్వకుఁగా మరుచేతఁ జచ్చినన్
గామునిఁ జంపుఁ దా మగుడఁ ♦ గామినితో నొడఁగూడి యుండియున్. 158

క. ఇటువంటిచోట నెప్పుడు, నుటజంబుల నధివసించి♦యుండెడు మీయు
త్కటభాగ్యం బేమని చె,ప్పఁట దేవుం డెఱుఁగు మౌని♦పుంగవులారా! 159

తే. పోయి వచ్చెద దక్షిణ♦ పుణ్యతీర్థ,రాజములు చూడ నన్నను♦గ్రహము సేసి
యనుపుఁ డనుటయువారలు♦ననుపఁదపసి,యిందువదనయుఁదాను ని♦జేచ్ఛఁజనియె.

మ. అనఁగా వీరనృసింహ యాదవుఁడు మా♦ యాజంగమాకారభ
ర్గునకుం గ్రమ్మఱ మ్రొక్కి భక్తనిధి! నా♦కుం జెప్పవే విశ్వనా
థునియారాధన సేసి యగ్గిరిని జం♦ తుశ్రేణిలో మున్ను గో
రినయర్థంబులు గాంచి రెవ్వరన గౌ♦ రీనాథుఁడుర్ రాజుతోన్. 161

శా. పాశక్లేశగుణేషణేంద్రియ తను♦ప్రత్యర్థితాపోర్మికా
కోశాదివ్యతిరిక్తమూర్తి! త్రిజగ♦త్కూలంకషాకార! మా
యాశృంగారవతీవిలాసవిభవ♦ వ్యావిద్ధముగ్ధాంత వే
ళాశర్మావహ! తారకాక్షరమహా♦ లాపోపదేశప్రదా. 162

క. శాంతాకార యిదంతా, హంతాచింతావిదూర ♦ యపవర్గరమా
కాంతాకాంత దిగంతా, భ్రాంతాభ్రాంతాంతతాండ♦వాభినయకరా. 163

పంచచామరము. అపారతా గభీరతా మృ♦తాదిహేతుభూతతా
తపస్విసంగృహీతతా వి♦ధాతృముఖ్యదేవతా
ధిప పరిమథ్యమానతా స♦దీమహానుజీవన
ప్రపాతజాతమగ్నతాభి♦రామచిత్పయోనిధీ. 164

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణ
సింగమరమానారాయణ జక్కయ నారాయణ తనూ
భవ భవపరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతంబైన
శ్రీకాళహస్తిమాహాత్మ్యంబునందుఁ
ప్రథమాశ్వాసము.



శ్రీరామార్పణమస్తు.

శ్రీరామాయనమః

# శ్రీకాళహస్తిమాహాత్మ్యము.



## ద్వితీయాశ్వాసము.



ఖండాచలమారుత
లేఖాస్పర్శాది విషయ ♦ సిద్ధాన్కృద్వి
ద్యాఖని మునిజనకల్పక
శాఖీ శ్రీకాళహస్తి ♦ సదన మహేశా!

ఆ. అవధరింపుఁ డిట్లు ♦ భవదీయకథ విన్న, వింతు భక్తజనుల ♦ వీను లలర
మీరు యాదవునకుఁ ♦ గారుణ్యరసపూరి, తేక్షణముల నాన ♦ తిచ్చినట్లు. 2

### బ్రహ్మకు సరస్వతివలనఁ గుమారు లుద్భవిల్లుట.

వ. తదనంతరం బొక్కనాఁడు 3

సీ. అఖిలవిద్యారహ♦స్యములశంకలు దీర్ప, సరస నుండెడు మునీ♦శ్వరులు నాగ
స్వస్తికహస్తులై ♦ సమ్ముఖంబున బరా, బరిగాఁగ సర్వసు♦పర్వు లుండఁ
గరతలయుగళి వ♦క్త్రములు గప్పక విన్న, పంబులకొఱకు ది♦క్పతులు సేరఁ
బూర్వదేవతలు కిం♦కుర్వాణులై తన, కనుసన్న వలసిన ♦ పనులు సేయ

తే. గరుడ గంధర్వభుజగ కిం♦న్నర పిశాచ, భటులు చావడి ముంగటి♦బట్టబయలఁ
జటులతరవృత్తిఁ గోటుల♦సంఖ్య లెసఁగ, నబ్జగర్భుండు గొలువున్న ♦ యవసరమున. 4

మ. నవలావణ్యరసాలయంబు గుణర♦త్నస్థాన మాస్యక్షపా
ధవబింబోదయ మున్నతస్తనగిరీం♦ద్రవ్యక్తి వాచాసుధా
భవదేశంబు వళీతరంగము తనూ♦భద్రప్రభా ఫేనదీ
ప్తివిలాసం బగుతత్కళత్రము సుధా♦బ్ధింబోలి సద్భక్తితోన్. 5

మ. చెలికత్తె ల్గయిదండఁ బట్టఁగ సుర♦స్త్రీ లెందఱైన న్గెలం
కుల సేవింపఁగ వజ్రనిర్మితతులా♦కోటిద్వయంబుం ఝుళం
ఝుళనాదంబుల నీన మానికపుఁగెం♦జాయ ల్దువాళించు పా
వలు పాదంబుల మెట్టి ప్రాణవిభుఁ గొ♦ల్వం గొల్వ మోసాలకున్ 6

సీ. బ్రహ్మకుఁ బట్టంపు♦రాణివాసం బయ్యు, రాజసక్రీడాభి♦రతులఁ బోక
జగదేకసౌందర్య♦సౌభాగ్య యయ్యును, నణుమాత్రమును గర్వ♦గుణము లేక
సంపూర్ణ యౌవన♦సంపద గలిగియు, మదవికారస్ఫూర్తి♦పొదలనీక
వ్యాహారసింహాస♦నారూఢ యయ్యును, బహువిధవ్యావృత్తిఁ♦బ్రౌఢ గాక
తే. మగనిముందఱఁ దన మహా♦మహిమ లెల్లఁ, గానఁబడకుండ నడఁకువ♦గలిగి కించి
దవనతాననయై పొలు♦పారఁ గన్ను,గంటిమీలకు నిలుకడఁ ♦ గఱపి కదియ. 7

క. ఏతెంచునపుడు పాదుక, లాతలికతూర్యాంతరమున ♦ నటు విడిచి కరా
నీత విపంచీ మదశుక,పోత స్ఫటికాక్షసూత్ర ♦ పుస్తక యగుచున్. 8

క. పరిజనుల ననిపి నాథుని, పరిసరమున కేగి యతని♦పంపున మణిపిం
జరిత ధగద్ధగితం బగు, సరిగద్దియ నుండునట్టి♦సమయమునందున్. 9

సీ. మోముపున్నమచంద♦మామ వెన్నెలఁ గాయ, డెందంపుఁగెందమ్మి♦గ్రిందుపడునొ
వాలుఁజూపనిమెఱు♦వేలుపుఱేని కై, దువచాయగట్టుగ♦ట్టవియఁబడునొ
కొప్పునుచీఁకటి♦గుంపు గప్పంగొనంగఁ, దలఁపు తెర్వరిత్రోవఁ♦దప్పి పడునొ
రాయంచనడపుల♦రాయిడిఁ దాల్మితా,మరతూఁడు దునురుగా ♦ మరలఁబడునొ
తే. నలువ తనుఁగొల్వ వచ్చిన♦పలుకుఁజెలువ, చెలువమరయుచు వలరాజు♦చిలుకుములికిఁ
దలఁకి మిన్నక యొకకొంత♦తడవునిలిచె, మునులుదమతమమొగములు♦గనుఁగొనంగ

తే. అదియుఁ దాఁగాంచి సభ్యులా♦హ్లాదమందఁ, దగవుఁ దలపోసి చిత్తంబు♦బిగియఁబట్టి
స్వస్వరూప వికారైక♦సౌఖ్యదృష్టి, మఱుఁగు వెట్టుచు నొకకొన్ని♦మాటలాడి. 11

తే. సరస సల్లాపములఁ బ్రొద్దు♦చాలఁబోవె, ననుచు వేల్పుల మునుల నె♦య్యమున ననిపి
తాను వాణియు లోని సౌ♦ధంబుమీఁది, కరిగి యచ్చట నిట్లని ♦ యానతిచ్చె. 12

శా. వాచాగోచర మప్రతర్క్యము విని♦ర్ద్వంద్వం బసాధారణం
బాచోద్యం బఖిలోక మప్రతిమమప♦ర్యాయంబు వర్ణింపఁగా
నీచెల్వం బిది నిక్క మట్లయినఁ గా♦నీ నాకు నీవంక వాం
ఛాచాపల్యము దీరనేరదు మనో♦జక్రీడలం గోమలీ. 13

క. నాకోరిక లీడేరఁగఁ, గైకొనవలె నీవు ప్రేమద♦గౌరవకృతభా
షాకృతులు నాఁటి నటువలెఁ, గైకొంటివ యేని చెప్పఁ♦గలదే మనినన్. 14

క. తనపాతివ్రత్యమునకు, ననుకూలముగాఁగ మగని♦యాజ్ఞకు లోనై
కనుపట్టె వాణి శతవా,గ్వనజానన లగుచు నలువ♦వడి దేరంగన్. 15

ఉ. అందున కెంతయుం బ్రమద♦మందుచుఁ బుష్పితవల్లులందు నిం
దిందిరశాబకంబు పువు♦దేనియఁ గ్రోలెడు రీతి నూర్వరఁ
బొంది సుధాధరగ్రహణ♦భూరి సుఖంబుల నొందుచున్ శతా
నందుఁ డనంగ నొప్పెసఁగె ♦ నాఁడు మొదల్ కథల న్విధాతయున్. 16

శా. ఆరామంబులఁ గేళిశైలముల సౌ♦ధాగ్రంబులన్ స్వర్ణదీ
తీరోపాంత నికుంజ పుంజములలో ♦ దేశంబుఁ గాలంబు నా
చారంబు న్వివరింపఁగా మఱచి హృ♦జ్జాతాంధకారాంధుఁడై
నీరేజాసనుఁ డిచ్చ నుండె శతవా♦ణీభోగ నిర్మగ్నతన్. 17

సీ. మ్రొక్కిన నొకలేమ♦మోమెత్తఁగాఁ జేయుఁ, దిట్టుఁ గూరిమి నొక్క ♦ తీఁగఁబోఁడి
తలపట్టుకొను నొక్క ♦ తరుణీలలామంబు, హుమ్మని యదలించు ♦ నొక్కయింతి
పట్టకు మని యూన♦ పెట్టు నొక్క వధూటి, యేడుచు నొక్క పూ♦ర్ణేందువదన
ముసుఁగు వెట్టుచు నొక్క ♦ ముద్దియ పసళించు, సిగ్గులేదను నీకుఁ♦జెలువ యొకతె

తే. మఱియుఁ గోపించి వలసిన ♦ మానినులను, వారిజాక్షులఁ దగినట్లు ♦ గారవించి
రతిసుఖంబులఁ జొక్కనో♦రంతప్రొద్దు, నజుఁడు మన్మథ రాజ్యసిం♦హాసనమున. 18

క. తరుణీశతకము బింబా,ధరమాధుర్యంబు గాను♦తఱిఁ దమలోనన్
బరమేష్ఠి నాల్గుమోములు, వరుసలు వెట్టుకొనుఁ జెప్ప♦ వశమే కూర్మిన్. 19

సీ. అధరపల్లవ మాన♦ నంగంబు మఱచుదం,తక్షతంబునఁ గొంత ♦ తలఁపు గలుగుఁ
బరిరంభణంబునఁ ♦ బరవశుఁడగు నఖం,బులు నాటఁ జెనకినఁ ♦ దెలివినొందు
బహుబంధరతికి లో♦బడిచొక్కు గళరవ, శ్రవణంబుచేత నె♦చ్చరికనొందు
సురతాంత సుఖమున♦సోలుఁ దాంబూలంబు, సేయింప నించుక ♦ సేదదేఱు

తే. జలకమాడును దివ్యవ♦స్త్రములు గట్టు, దివ్యగంధంబు లలఁదును ♦ దివ్యపుష్ప
మాలికలు దాల్చు నమృతంబు♦గ్రోలు మగుడ, వాలికాసంగ సౌఖ్యాబ్ధి♦నోలలాడు.

ఉ. తోరపుఁగోరిక, ల్మిగవు♦ తోడిమొగంబును జిక్కువడ్డ శృం
గారపుఁ గొప్ప, క్రొంజెమట♦ గాఱెడు గండము, సందడించు ని
ట్టూరుపు గాడ్పు, వేడుకల♦ నుబ్బెడు దేహము, సోలఁ జూపు, నొ
ప్పారుట గాని నల్వ కొక♦యప్పుడు నూరట లేదు కూటమిన్. 21

క. ఈమాడ్కి నిదియు పనిగాఁ, గామాంధుం డగుచు నున్న♦కార్యము లెల్లన్
బోమొత్తి పుణ్యపాపము, లేమియుఁ దలఁపక సుఖించు♦నెడ వారలకున్. 22

శా. క్రూరు ల్ధూర్తులు దోషకారులు జగ♦ద్ద్రోహు ల్మహాభీషణా
కారు ల్ధర్మవిరోధు లన్యరమణీ♦ కామాంధకారాంధు లా
చారభ్రష్టులు లోకకంటకులు శ♦స్త్రవ్యగ్రబాహు ల్కృపా
దూరు ల్మప్పదివే లరక్కసులు దో♦డ్తోఁ బుట్టుచుం దంద్రతోన్. 23

—— బ్రహ్మకొడుకులదుష్టచేష్టలు. ——

సీ. చెఱపట్టి తెత్తుమో ♦ శ్రీమహాలక్ష్మిని, బింకి గావింతుమో♦ వెండికొండ
మ్రింగుదుమో పట్టి♦మిహిరమండలమును, ద్రావుదుమో సము♦ద్రంబు లెల్లఁ

బన్నగకులసార్వ♦భౌము నాడింతుమో, పెకలింతుమో ధాత్రిఁ♦బెకలిపడఁగఁ
దన్నుదుమో మృత్యు♦దంష్ట్రిలు విఱుగంగ, సరగునఁ జెఱుతుమో ♦ జమునిఁజ్జ

తే. నేడుకొండలుఁ బెఱికి వేఁ♦టాడి కడిమి, గగనమండల మొరయంగ ♦ నెగరవైచి
బంతులాడి చరింతుమో♦పనుపుమమ్ముఁ, దండ్రి! వలసిన పనికన్నఁ♦దమ్మినాలి.

వ. నెమ్మనంబున నుమ్మలించి కమ్మవిల్తుని యలరమ్ములం జిమ్మచీఁకట్లు గ్రమ్ముటంజేసి దుర్మ్మదులుఁ గ్రూరకర్ములగు కొడుకులం గంటినే యని కటకటంబడి భువనంబులకు వెక్కసులగు రక్కసుల దిక్కుఁ గనుంగొని గగనకర్పర పరివేధి తుంగ శృంగ శృంగాటకంబును నుదీచ్యవాచీ ప్రాచీప్రతీచీ సమీచీన పరిఖీభూత గంగా గౌతమీ సముద్ర ముద్రిత దుర్గంబును నిరర్గళ నానామృగ సంకులమధ్యంబును నగు వింధ్యంబునకుం బొండని నియమించిన. 25

ఉ. మించినవేడ్క రక్కసులు ♦ మీసలు దీటుచు, దిక్కుడుంగముల్
చించుక పాఱ నార్చుచు మ♦షీమలినాంగ వినీలిమ చ్ఛటా
వంచిత భానులై కయిదు♦వల్జళిపించుచు లోకమెల్ల భ
క్షించెద మంచు వింధ్యగిరిఁ ♦ జేరఁగ వచ్చిరి దండ్రి పంపునన్. 26

ఉ. అందొక దుర్గమస్థలము♦నందు నివాసముఁ జేసి జంతురా
శిం దెగటార్చి మ్రింగుచు ఋ♦షిప్రమదావళిఁ బట్టుకొంచు సం
క్రందనముఖ్య దేవనగ♦రంబులఁ గాల్చుచు నాత్మబోధ ని
ష్ఠం దపమాచరించుముని♦సంహతి డెందము గందఁజేయుచున్. 27

మ. పురుషుం డన్న వధించి, కాంత యనిన♦న్భోగించి, యర్థంబులన్
సరగం జేకొని, మత్తచిత్తు లగుచున్ ♦సర్వంబు నేకంబు సే
సిరి వర్ణాశ్రమ ధర్మము, ల్బుధుల గా♦సిం బెట్టి చార్వాకమా
ర్గరతుల్వోలె శరీరసౌఖ్యపరతం ♦ బ్రత్యక్షసిద్ధాంతులై. 28

మ. కులశీలంబులు జాతిభీతులు నను♦క్రోశత్రపాహేయశం
కలు దూరంబులు సేసి యిచ్చల సమ♦గ్రస్ఫూర్తి వర్తించువా
రలమై పోయిరి కాని రక్కసు లసా♦రక్రూరసంసారమో
హలతాబద్ధులు గాక యున్న నపవ♦ర్గానందముం జెందరే. 29

శా. భాండాగారము లెల్ల నన్యధనము ♦ ల్బందీగృహప్రాపితా
చండాలావధికాంత లాత్మకులయో♦షారత్నముల్, సత్క్రియల్
చండక్రీడలు, సర్వజంతువులు భో♦జ్యశ్రేణి, కాదంబరీ
భాండవ్రాతము పేయమై,దనరఁ ♦ బాపస్వాంతులై త్రిమ్మరన్. 30

శా. ఆబాధల్ పడలేక భూరమణి శో♦కాక్రాంతయై మూర్ధ్నవీ
ధీబద్ధారుణపాణిపద్మములతో ♦ దేవా! జగం బెల్ల ర

కాఁబుద్ధిఁ వివరింపు నీసుతులచేఁ ♦ గావింపుమీ యంచు భా
షాబద్ధుం డగు బ్రహ్మదేవుఁగని వి♦జ్ఞాపించె ఘోషించుచున్. 31

క. ఆయార్తనాదమునకుం, దోయజగర్భుండు కరుణ♦తో భూదేవిన్
దాయంగఁ బిలిచి యోడకు,మీ యీనిమిషమున నీకు ♦ మెచ్చొసరింతున్. 32

బ్రహ్మకు నుగ్రుఁ డనుకొడుకు కలుగుట.

క. అని కొడుకులపైఁ బుట్టిన,కినుక సహింపంగలేక ♦ కెరలినఁ గోపం
బున నుగ్రుం డనుతనయుఁడు, జనియించె సమస్తభూత♦జాలము బెగడన్. 33

చ. అతనికి నుగ్రసింహరథ ♦ మస్త్రచయంబును వజ్రకంచుకా
న్వితముగ నిచ్చి నాసుతులు ♦ నీసహజన్ము లటంచుఁ జూడ ను
ద్ధతగతి నందఱుం దునిమి ♦ దైవతకోటులు నింగిఁ బొంగ భూ
సతికిఁ బ్రియం బొసర్పు మని ♦ సారసగర్భుఁడు పంప నాతఁడున్. 34

బ్రహ్మపంపున నుగ్రుఁడు తనయన్నలగురక్కసులఁ జంపుట.

ఉ. కోపన నార్చినం దెసలఁ♦గుంజరము ల్బెదరెం, ధనుర్గుణా
రావమునం గలంగె జల♦రాశి, వడంకె రథాంగతీవ్రసం
రావమునం గులక్షితిధ♦రంబులు,రథ్య మృగేంద్ర సాంద్ర హే
షావలి బ్రక్కలయ్యె హరి♦దంతము, లేమని చెప్ప నత్తఱిన్. 35

తే. తన్ను ధరణికిఁ బొమ్మన్న ♦ ధాత నోటి,మాట నోరనె యుండ భూ♦మండలంబుఁ
జేరఁ జనుదెంచె సింగంపుఁ♦ దేరిజోదు, వింధ్యగిరినున్న రాక్షస♦వితతిమీఁద. 36

శా. ఆఘోరాసురు లంతయుం దెలిసి గం♦ధానేకపానేకవా
హౌఘస్యందన బృందము ల్గొలువఁ జి♦త్రాయత్తమై, కార్ముకా
మోఘాస్త్రంబులు దాల్చి హేమరథము ♦ ల్మోదంబుతో నెక్కఁగం
గౌఘం బెత్తిన ధూళిచే నడుసుగా ♦ నత్యంత గర్వాంధులై 37

క. బలములు దీర్చిరి నడిచిరి, బలవంతుం డైన యుగ్రు♦పై నేచి బలా
బలచింత లేక రాక్షస, బలములు రఘురాము మీఁదఁ♦బైకొనురీతిన్. 38

క. ముందటఁ గాలుబలంబు పి,ఱుందం దురగంబు లాపి♦ఱుందం గరులున్
స్యందనము లందుపిఱుఁదం, గ్రిందుకొనఁగ నిలిపి నడుమఁ♦గా వెఱఁగయ్యెన్. 39

మ. గరళం బుద్ధతి నారగింపఁ జనును♦గ్రవ్యగ్రవిస్ఫూర్తి, సా
గర మాపోశన మెత్తుకుంభజుని రే♦ఖన్ ధ్వాంతసంతాన సు
స్థిరతం దీర్చు దినేంద్రు చందమున, నా♦ సేనం గనుంగొంచు భీ
కర వేగంబునఁ దాఁకె నుగ్రుఁ డపుడు♦గ్రం బైన రూపంబునన్. 40

క. చదిపెం గాలుబలంబులఁ, గదిమెన్ గుఱ్ఱంపు పౌఁజు ♦ గగ్గులకాఁడై
చెదరంగ గంధగజముల, మదమడఁచెం జండవీర♦మండలిఁ దాఁకెన్. 41

క. విడువక పట్టిన మునుమున్, గడదేఱిచి బలము రెండు♦గా నొనరించెన్
వడి నా రెంటికి నడుమన, వెడలెన్ మఱిసోమసూర్య♦వీథులుగాఁగన్ 42

క. చెదరిన సేనల నన్నిటిఁ, గుదురుకొనం దోలి చుట్టు♦కొని వడి నేసెన్
మదకరుల హరుల భటులను, గదనంబున మడిసి చాప♦కట్టుగఁ గూలన్. 43

శా. ఆయోధాగ్రణిచేత నిట్లు తమసై♦న్యంబు ల్పటాపంచలై
పాయల్వాఱియు నేటుపోటుల భయ♦భ్రాంతంబు లయ్యెన్ సమి
ద్వ్యాయుక్తాంగములయ్యుఁ దమ్ము శరణం♦బు ల్వేఁడియుం దూలఁగా
సాయంసూర్య సమాన వక్త్రములతో ♦ సక్రోధులై రక్కసుల్. 44

క. విఱిగిపఱచు సైన్యంబుల, వెఱపెల్లను దీర్చి చటుల♦విక్రమగరిమన్
మెఱయంగ నుగ్రుఁ దాఁకిరి, యురవడి నార్పులును బొబ్బ♦లుఱుములఁ దెగడన్.

క. ఆ తుములమునకుఁ దెమలక, భూతలము దలంక నలువ♦పుత్రుం డెదుగై
యాతెఱఁగున నసురులు నిర్ఘాతసదృశ శరపరంప♦రలు వడిఁ గురియన్. 46

క. ఏసిన శరములు దుమురుగఁ, జేసి యరణ్యంబు దావ♦శిఖి యాదివినయ
ట్లాసుర సైన్యము వీరాగ్రేసరుఁ డుగ్రుండు విశిఖ♦కీలలఁ బొదివెన్. 17

క. తా నేసిన శరములు దా, వానలమునఁ బడ్డమిడుత♦లట్లు శరనిధిన్
సోనలుగా సర్షించిన, వానలక్రియ వారిమీఁద♦ వమ్మై పోవన్. 48

శా. క్రోధాగ్ని ప్రభ రీతి శోణరుచి దృ♦క్కోణంబులం జెందఁగా
వేధోండంబు గలంగ నార్చి శరము ♦ ల్వేవేగ కోదండవి
ద్యాధౌరేయత మీఱ నేసె మనుజా♦హారాఘుదేహాస్త్రధా ? (ప్ర)
రాధాతక్షితిధూళిపాళిగ మృగేం♦ద్రస్యందనుం డుద్ధతిన్. 49

క. కోణపవరు లవ్వీరుని, బాణపరంపరల నొప్పిఁ ♦ బడవైరి కుల
క్షోణీధరములు కుంభద్రోణాసారమునఁ గలఁగి♦తొలఁగని భంగిన్.

వ. మఱియును. 50

శా. దిక్కుల్గిక్కురలంగఁ జక్రగుణసం♦దీప్తధ్వను ల్మ్రోఁగఁగా
రెక్కల్వచ్చిన కాలసర్పముల పే♦ర్మిం గంకపత్రంబులన్
జొక్కంబైన నిశాతబాణముల నా♦జో దేసె బేతాళముల్
గ్రుక్కిళ్ళింగఁగఁ గ్రొత్తనెత్తురు నాఁ♦గు ల్పాఱఁ గ్రవ్యాదులున్. 51

ఉ. ఏసిన నీసువుట్టి యసు♦రేశ్వరు లన్నియు నుగ్గు సేసి యు
జ్జాసనుపుత్రుఁ జూచి భుజ♦నాసలి నెన్నఁడు నిన్నుఁ గాన మ

న్నా? సమరంబు సేయుటకునై నియమించినవార లెవ్వరో
దోసముగాదు రాఁ దొలఁగఁ ద్రోయుచుఁ బోఁజనదంచు నుక్కునన్. 52

శా. అవ్వీరాగ్రణి బాణపాతముల మాంసాహారవీరు ల్వియిం
బువ్వల్ చల్లిన యట్లుగాఁ దలఁచి యార్వుల్ నింగిముట్టంగ నీ
క్రొవ్విళ్లే యడఁగింతు మంచు వడి నుగ్రుం డాఁకి రున్మత్తులై
గువ్వ ల్డేగ నెదిర్చి చేర్చినగతిం గోలాహలం బొప్పఁగన్. 53

క. ఒక్కమొగి నసురు లందఱుఁ, బెక్కుతెఱంగుల నిశాత భీకరశరముల్
గ్రిక్కిఱియనేయ నెత్తుట, నక్కంఠీరవరథాంగ మంతయుఁ దోఁగెన్. 54

ఉ. అప్పుడు నేల పెల్లగిల నార్చి మహోగ్ర నిరీక్షణంబులన్
నిప్పులు రాలఁ గోపమున నిష్ఠురశాతశిలీముఖావళిన్
ముప్పదివేల రక్కసుల ముంచె విరించితనూజుఁ డీశ్వరుం
డప్పురదైత్యవీరనివహమ్ము శరమ్ములఁ గ్రుమ్మరకై నడిన్. 55

ఉ. కప్పిన యంపవానలకుఁ గంపమునొందక మానవాశనుల్
ముప్పిరిగొన్న రోషమున మోమునఁ గంఠమునన్ భుజమ్ములన్
జిప్పిలి వేఁడి నెత్తురులు జేగుఱుటేఱులు కొండనుండి పా
ఱొప్పునఁ గాఱ వీరరస మొలెకెడు చందము దోఁప నుగ్రుఁడై. 56

శా. చెక్కల్సేసె రథంబు, లశ్వములఁ గూలొ్చెన్, ఖండఖండంబులై
టెక్కెంబు ల్వడనేసె, రత్నమయకోటీరంబులుం దూణముల్
వ్రక్కల్గా నొనరించె, ధూళిఁ గలసె న్వర్మంబులన్, సూతులన్
జక్కాడెం, దునుమాడె విండ్లు, నసురుల్ సంక్షోభముం బొందఁగన్. 57

క. అరదములు విడిచి రక్కసు, లరిగిలుఁ బట్టెములుఁ గొనుచు నాకసమునకుం
బోరిఁబోరి నెగయుచుఁ గల్పించిరి కాటుకప్రోవువంటి చీఁకటి సంతన్. 58

శా. ఆమాయాతిమిరంబులోపల నదృశ్యాకారులై పోరు ర
క్షోమాతంగముల న్మృగేంద్రరథుఁ డుగ్రుం బోలి శాతాంధకా
రామిత్రాంబక మేసి చీఁకటులఁ బాయం దోలి యాకాశముం
టామార్గంబున నుండకుండఁ గడికం డల్గాఁగఁ బెల్లేసినన్. 59

శా. తూలం బాఱియు బీరువోక సురనాథు ల్చేవమీఱన్ సమి
త్కేళీలోలతఁ గాలమేఘములు మూఁడ్కిం జూడ్కికిన్గా శిలా
జాలాసారముఁ బైపయిం గురియఁ గోపవ్యాప్తుఁడై తీవ్రవా
తూలాస్త్రంబున నందఱన్ గెడపి శాంతుండయ్యె నవ్వీరుఁడున్. 60

చ. నకులకు గుండెగూడు దిగె నాగకులంబులు నిద్రఁ బోయె, ని
ర్జరులును మిన్నుడన్నిరి, ఖరామరకోటియుఁ దృప్తిఁ బొందె, సు

స్థిరత వహించె ధాత్రియు, ఋషివ్రజ మిచ్చఁ జరించె, రాక్షసో
త్కరము రణంబునన్ హరిరథప్రదరాహతిచేతఁ గూలినన్. 61

వ. అమ్మహారణస్థలంబున వారణంబులయట్టలు కట్టలు వడుటంజేసి తొట్టిన నెత్తురు మడువులం దెట్టువలు గట్టిన యంపకట్టియలం దెప్పలుగట్టుకొని యాడం దలపెట్టు బిడ్డల యెడ్డెతనంబునకు మనంబున ఘనంబగు వేడుక వొడమఁ బెద్దయుంబ్రొద్దు ముద్దాడు శాకినీ ఢాకినుల కలకలంబును, విచ్చలవిడిం బచ్చిపాలసుఁ దిని వెగటుగుటం జేసి తొడవులనెడలి పడిన పద్మరాగంపుఁ గుప్పలు నిప్పులనుచుఁ గండలు బరికట్టి యల నుట్టి కఱుకుట్లు గాలువం బొలువడి తిరుగు భూత బేతాళ బాలికాకులకోలాహలంబును, మిట్టకోలలఁ గులగులలైన కిరీటంబులనుండి రాలిన వజ్ర మౌక్తిక రజోగుణంబు లవణంబు చవి మరగి ముఱుగకుండ నుప్పుకండలు పెట్టఁ జూచు పిశాచ మందగామినుల క్రందును, బదడునం బొదవిన మెదడునుం బ్రదరంబులం జదిసి కదిసిన మాంసంబును బ్రేవులప్రోవులు మొదలుగాఁ గూడఁబెట్టి కట్టలుగట్టి, యేనుఁగు తుండంబులం దూము లమరించి, చెమరించిన మోములతోడం జెఱువులు గట్టుకాడ నిట్టవాడిచిన రక్తంబుల నట్టనడుమ వేసినఁ జెలంగు కూశ్మాండ కుమారోద్దండ హాసవ్యసనంబును, గాకఘూకజంబుక వనశునకంబులు వచ్చి వందఱలాడి యవ్వలవ్వలికి వెడలివచ్చు నేనుఁగు పీనుఁగుల డొక్కలలో డుక్కిడాఁగిలిముచ్చులాడు దయ్యంపుదొయ్యలుల సయ్యాటంపుఁగయ్యంబును, వీరరసావేశంబున విజయాశాపరవశత్వంబును జేసి మునుపడిప్రోవుదప్పక ధరణిం బడియున్న మానవాహారహారశాబక కళేబరంబులం జూచి సజీవశంకాతంకంబునం గొంకి వెనుకపదంబులం గ్రమ్ముకొనం జిమ్మిన దుమ్మునఁ గదలకుండినఁ జెండి పండువు సేయు గోమాయు పరంపరారావంబును, విగతవీరులైన తేరులును, జర్ఝరితాంగంబులైన తురంగంబులును, శరీరప్రోతశరవ్రాతులైన సూతులును, ఖండఖండంబులైన కోదండంబులును, రంధ్రికేతనంబులైన కేతనంబులును, విదళిత సూత్రంబులైన తనుత్రంబులును, రజోజాలంబులైన శూలంబులును, విదారితకూటంబులైన కిరీటంబులును, ఖండితవేణుశలాకంబులైన పుండరీకంబులును, విధ్వంసితముఖంబులైన శిలీముఖంబులును, భంగభంగంబులైన మాతంగంబులును, రుధిరసమాక్రాంతులయిన మావంతులును, యమకింకరాయత్తులయిన రాహుత్తులునుం, గల కలనిఁ గనుంగొని చని వీరాగ్రేసరుండగు నుగ్రుండు పితామహాగ్రభాగంబున నిలిచి గెలిచినవిధంబు విన్నవించిన విని విరించి పుత్రవధవిధాకర్ణన గ్రథితశోకానలదందహ్యమానమానసుండై మండిపడుచుం జూచిన నతండునుం భస్మంబైనం బుత్ర
హత్యాదిదోషంబును బుత్రవిహీనత్వంబును బ్రాప్తంబయ్యెనే యని విచారించి 62

బ్రహ్మ పుత్రహత్యాదిదోషపరిహారార్థము తపంబు సేయుట.

ఉ. ఇంతట దేవదేవుఁ గరు♦ణేక్షణు దక్షిణకాప్యశైలశృం
గాంతరవాసు భక్తజన♦తామరభూజము నద్రికన్యకా
కాంతునిఁ గొల్వకున్న సుత♦ఘుస్మరతా సుతహీనతాఘ దు
ర్గాంతపయోధిపాతమునఁ ♦ దప్పి మనంబు సుఖంబునొందునే? 63

వ. అని వితర్కించుచు 64

ఉ. అంచలుగట్టినట్టి రథ ♦ మాత్మవధూటియుఁ దాను నెక్కి చిం
తించినయంతలోఁ గదలి ♦ తీవ్రత దక్షిణకాప్యశైలముం
గాంచె విరించి ముక్తికల♦కంఠవధూపదవీరసాలముం
బంచముఖానుకూలము వి♦పద్విపినోగ్రదవాగ్నికీలమున్. 65

తే. కాంచి కాంచనమాణిక్య♦ఖచితమైన, యంచకొదమలఁ బూన్చిన ♦ యరదము డిగి
దేవియును దాను మొగలేటఁ♦దీర్థమాడి, యభవుదర్శించి జ్ఞానపు♦ష్పంబఁగొలిచి.

వ. దక్షిణకైలాసగోత్రంబునఁ గూర్చుండి కమలాసనుండు కమలాసనస్థుండై హృదయకమలంబునఁ బరమేశ్వరు చరణకమలంబులు నిలిపి పంచేంద్రియసౌఖ్యంబులు వంచించి

సీ. కందమూలాదిభ♦క్షణములఁ గొన్నిది,నంబులు ఘోరత♦పం బొనర్చి
యంబుకణంబు లా♦హారంబుగాఁ గొన్ని, నెలలు దప్పక భక్తి ♦ నిర్వహించి
పవనాశనంబునఁ ♦ బరితృప్తుఁడై కొన్ని, ఋతువుల నద్భుత♦వ్రతము సలిపి
సతతోపవాసని♦ష్ఠాపరాయణబుద్ధిఁ, గొంతకాలము తపో♦దాంతి నెరపి

తే. భువనభవనభయంకర ♦ పవనవర్ష, శిశిర తీవ్రతర వ్యథఁ ♦ జెదరనీక
హృదయధైర్యంబుమిక్కిలి♦పదిలపఱిచి,నలువయుబ్బంగిఁ బెక్కేండ్లు♦ సలిపెఁదపము.

సీ. గాంగేయముఖరీత♦రంగసంగతసదా,గతి మహాగ్రీష్మదుః♦ఖము హరింప
సతతవాచంయమీ♦శ్వరకృతక్రతుహవి, ర్జ్వాలదగ్నికీలలు ♦ చలి నడంప
నికటద్రుమస్థిత♦నీలకంఠంబులు, పురులొడ్డి వానల♦బెఱుసు మాన్ప
నాగంబు లాభోగ♦భోగంబు లడ్డంబు,పట్టి ఝంఝానిల♦పంక్తి నుడుప

తే. నఖిలభూతాత్మమూర్తియై♦ యతిశయిల్లు,కొడుకుఁబడయంగ సర్వేశుఁ♦గూర్చితపము
సేసె నటుకానఁ బవనాగ్ని♦శిఖిఫణీంద్రు, లాదిగాఁ గూడి విధికి స♦హాయులైరి.

సీ. తల్లిగానని లేడి♦పిల్లకుఁ జన్నిచ్చి, పెంచు బెబ్బులి తన♦బిడ్డయట్ల
దైవికంబున గూఁడు♦దప్పి నేలను బడ్డ, రాచిల్కబోదలఁ ♦ బ్రోచుఁబిల్లి
యెండచేఁ గ్రాఁగిన ♦ కొండకోయిలఁ దెచ్చి, యెలమావినీడల ♦ నిలుపుఁ గ్రోతి
యెడఁబాసి పోయిన ♦ విషియేనుఁగులఁగూర్చి, కరివిరహంబు కే♦సరి హరించు

తే. స్తనితములకెగపడి వచ్చు♦ శరభములను, బట్టి యొయ్యన ధ్రాతిపైఁ♦ బెట్టికాచు
గండభేరుండపక్షులుఁ♦గలిగి యజుని, యాశ్రమము శాంతరసరూప♦మయ్యెనపుడు.

ఉ. ఆడ విధాతకుం జదువులమ్మ సదా పనిపాట సేయఁ జే
తోషుగఁ జెంచెత ల్పలుకుతోషుగ రాజశుకీకదంబముల్
గూడి చరింపఁగా నదియుఁగొంత వినోదము గాఁ దపస్వినీ
క్రీడ వహించె నాత్మపతికిన్ మదిగోర్కి ఫలించు నంతకున్. 71

తే. భారతీదేవియును దానుఁ బద్మభవుఁడు, భువనములకెల్లఁ జోద్యంబు పుట్టునట్లు
లాత్మవిద్యాధురంధరుండైనకొడుకుఁ, బడయఁగాఁ గోరి ఘోరతపంబొనర్చె. 72

మ. కరుణాధారలు నేత్రకోణములవంకం జింద నానందబం
ధురమై మానస ముబ్బఁగాఁ బ్రమథపంక్తుల్గొల్వ గోరాజునె
క్కి గటన్మంగళవాద్యముల్ సెలఁగ లక్ష్మీనాథముఖ్యామరుల్
పరివేష్టించి భజింపఁ బద్మజునకుం బ్రత్యక్షమై యీశుఁడున్. 73

ఈశ్వరుఁడు ప్రత్యక్షమై బ్రహ్మకు వరమిచ్చుట

శా. ఏ నీకేమి యొనర్తుఁ జెప్పుము సురజ్యేష్ఠా! యనన్ భక్తి భా
షానాథుండు ధరిత్రిఁ జాఁగిల నమస్కారంబు లర్పించుచున్
నానారీతుల సన్నుతించి నిటలన్యస్తాంజలిత్వంబునన్
మేనం గంపము రోమహర్షణము సమ్మిశ్రంబుగా నిట్లనున్. 75

తే. దేవ నీవంటి దేవుండు దివ్యతీర్థ, రాజములలోన దక్షిణరజతశిఖరి
వంటి క్షేత్రంబు నావంటి వాంఛితార్థ, సిద్ధుఁడు నరుదు ధర విమర్శించి చూడ.

శా. కాన న్వచ్చియుఁ జూడరాదు భవదాకారంబులో నొక్కమే
నైనం బారముముట్ట నింకెటులు లోకాతీతమై దృష్టికిన్
లోనై యుండని మీచిదాకృతి నుపశ్లోకింపఁగా నేర్చెదన్
నానాభంగుల నూరకుండుటయ ధన్యత్వంబు నాబుద్ధికిన్. 76

సీ. భారతీదేవితోఁ బాయక కాలధర్మము విచారింపక మదనకేళి
దేలంగ ముప్పది వేలరక్కసు లుదయించి వింధ్యాద్రికి నేగి వారు
ప్రజలఁ బీడింప సర్వంసహాదేవత, చెప్పిన నేను రోషించినపుడు
పుట్టె నుగ్రుం డను పుత్రుండు వానిచే, నందఱఁ జంపించి యతనిఁ జంపు

తే. కొంటి నజ్ఞానమునఁ గట్టుకొంటిఁ బుత్త్ర, హత్య సంతానహీనుండ నైతి దేవ!
రెండుదోషంబులనుమాన్చి యిందువేడ్క, నన్ను రక్షింపుమనుచుఁ బ్రసన్నుఁడగుచు.

వ. దక్షిణకైలాసగోత్ర వీక్షణమాత్రంబునం బుత్త్రహత్యాది దోషంబులు వాసె మాఘ
మాసంబున మఘానక్షత్రంబున నుషఃకాలంబున సువర్ణముఖరీస్నానం బాచ
రించి మానంబున నీ మహాలింగంబునకుఁ బ్రదక్షిణంబులుఁ బ్రణామంబులుఁ బం
చాక్షరీమంత్రజపంబును నాటమొనిమిది సేసి ప్రతిమఘానక్షత్రంబున నివ్విధంబున

నొక్కసంవత్సరంబు నడిపిన సుపుత్రుండు గలుగు నీవేకా వెవ్వరివ్రతంబు నడిపిన నిట్ల యౌ నని యానతిచ్చి సర్వేశ్వరుం డంతర్ధానంబు నొందె నరవిందనందనుండు నట్లు సేయం దొడంగిన. 78

## ఋభువునిజననము.

మ. నెలరెణ్ణెల్లకుఁ జీరచిక్కెఁ ద్రిజగ♦న్నిర్మాతయిల్లాలికిన్
జెలఁగెం జిట్టుము, లంకురించె నరుచుల్♦చెక్కుల్ ప్రభా తేందుమం
డలతేజంబున నొప్పెఁ, గౌను బలిసెన్♦ డాసెం గుచాగ్రంబులన్
నలు, పాయాసము దోఁచె నెన్నడ నభి♦న్నంబయ్యె నిట్టూర్పులున్. 79

తే. తెల్ల నగుమేను కుసుమిత♦వల్లిగాఁగ, గురుకుచంబులు పుష్పమం♦జరులుగాఁగ
నందునుండెడి నలుపు నిం♦దిందిరములు, గాఁగఁ జెలువొందె వాగ్దేవి♦గర్భమహిమ.

తే. ఆత్మలోనున్న పుత్రమహా♦త్మ్యాకళంక, మాతృజాభావతాదోష♦మాత్తరూప
మైన పిండంబు గర్భస్థ♦మైనబైట, వెడలె ననఁ జన్ను మొనలందుఁ♦బొడమె నలుపు.

సీ. సౌఖ్యలేశములేని♦సంసారదేహాభి,మానముల్ విడిచి త్రి♦మ్మరఁగఁ గోరు
ముక్తిసామ్రాజ్యాభి♦షిక్తులై విహరించు,యోగసిద్ధులలోన♦నుండఁ గోరు
మౌనముద్రాసక్తి♦మదికి నింపగు చోట, నేకాంతమున వసి♦యింపఁ గోరు
నప్రార్థితప్రాప్త♦మగు పదార్థంబుల, దీపనాదివ్యథ♦దీర్పఁ గోరు

తే. విష్టపవ్యాపకంబు స♦విస్మయంబు, నైనబ్రహ్మంబు పిండమై♦యాత్మగర్భ
గోళముననుండఁ దన్మహా♦గుణములెల్లఁ, దెలుపు మెలపున నంతటఁ♦బలుకు వెలఁది.

ఉ. భారతి గోరుకోర్కులకుఁ♦బద్మభవుం డనుకూలుఁడై మఖా
తారకయందు సువ్రతముఁ♦దప్పక సల్పఁగ నొక్కయేఁటిలో
నీరజవైరిశేఖరుని♦నిత్యకృపం గల పుత్రజన్మముం
జేరువ యయ్యె దంపతుల♦చిత్తమునం బ్రమదం బిగుర్పఁగన్. 83

తే. వాఙ్మయంబైన వేదాంత♦వార్ధియందు, నర్థమయుఁడైన చిద్విధుం♦డవతరింపఁ
దన్ను మఱచిన తెఱఁగునఁ♦దమ్మిచూలి, ప్రమదమునఁజొక్క వాణిగ♦ర్భముననుండి.

మ. ఉదయించెం బరమార్థరూపము మహా♦యోగీశ్వరోత్తంస మీ
శదయావర్ధితదివ్యతేజము సదా♦శాంతస్వరూపంబు దుః
ఖదసంసారవిదూరమానసము లో♦కం బుత్సవక్రీడలన్
బొదలంగా సుతరత్నమంత జననీ♦పుణ్యప్రభావంబునన్. 85

క. పుత్రోదయ మగుటయు శతపత్రజుఁ డానందలహరిఁ♦బరవశుఁ డగుచున్
స్తోత్రంబుసేసె ముక్తికశత్రుని గౌరీశు నిర్మ♦లప్రతిపత్తిన్. 86

వ. ఖండపరశుండును నఖండదయామండితకటాక్షవీక్షణంబులఁ బ్రత్యక్షుండై కమలజత
నూభవునకు ఋభువనియెడునామంబొనరింపన ననుగ్రహించియవగ్రహరహితంబును
గలుషాహితంబునునైన బ్రహ్మోపదేశంబు సేసి యంతర్హితుండయ్యె నంత. 87

శా. కోరెన్ వెండియుఁ గన్నవాఁగలకు సం♦క్షోభింపకే మ్రొక్కి యా
త్మారామత్వమునం జెలంగి యిఁక నే♦యర్థంబు వర్జింపఁగా
లే రాత్మజ్ఞు లనంగ నాఋభువు ద♦ల్లిందండ్రి వీడ్కొంచుఁ బు
ణ్యారణ్యంబులఁ బుణ్యశైలముల బ్ర♦హ్మజ్ఞానియై త్రిమ్మరన్. 88

ఉ. వచ్చి నిదాఘుఁ డాఋభువు♦వంకఁ బరాపరవస్తుదర్శనం
బచ్చుపడంగఁ జేసి సన♦కాదుల కంతయుఁ జెప్పి చూప నా
సచ్చరితుల్ సమస్త ముని♦చంద్రులకుం గరుణార్ద్రచిత్తులై
యిచ్చిరి బ్రహ్మవిద్య, వెల♦యించిరి వారు జగంబు నిండఁగన్. 89

శా. ఈచందమ్మునఁ దమ్మిచూలికథ గౌ♦రీశుండు చెప్పంగ ధా
త్రీచక్రేశుఁడు సొక్కి మ్రొక్కి యనియెన్♦శ్రీకాళహస్తీశ తా
ప్రాచుర్యంబు పురాణసిద్ధముగ నె♦ప్పాటన్ జగన్నాయకుం
డాచంద్రార్కముగా ధరించె నిది నా ♦ కాద్యంతముం జెప్పవే. 90

క. అనవుడుఁ గుహనాజంగమ,తనువు ధరించిన సుధాంశు♦ధరుఁ డిట్లనియెన్
మనుజేశ్వరుతోఁ గరుణా,వననిధియై విను మటంచు ♦ వాచాప్రౌఢిన్. 91

క. తొలియుగమున శ్రీనామముఁ, గలచెలఁదియుఁ ద్రేతయందుఁ♦గాళంబనుపా
ముల ఱేఁడును దానికి నీ,తలియుగమున హస్తియున్ వ్ర♦తంబునఁ గొల్వన్. 92

శా. గౌరీశుండు చెలందిఁ బాము గజముం ♦ గైవల్యసామ్రాజ్యల
క్ష్మీరూపంబగు తన్నుఁ గూర్చుకొనఁగా ♦ శ్రీకాళహస్తీశ్వరుం
డై రాజిల్లెఁ దదీయభక్తిగరిమం ♦ బాద్యంతము న్నీకు వి
స్తారప్రౌఢి వచింతు రాజ! వినుమా ♦ దత్తావధానుండవై. 93

## చెలఁదిపురుగు శివైక్యముఁ బొందుట.

చ. కృతయుగవేళ మర్కటక♦కీటక మొక్కటి పూర్వవాసనా
గతమతి దేవదేవు గర♦కంధరుఁ గొల్వఁ దలంచి కుంభజ
క్షితిధర కన్యకాంబు పరి♦షిక్త శరీరముతోడ నాత్మని
ర్గత బహుతంతుపంక్తి గృహ♦కల్పన శిల్పకళాప్రవీణతన్. 94

సీ. ప్రాకారములు గోపు♦రమ్ములు కొలువుకూ,టములు నర్తనమంది♦రములు కోశ
గేహము ల్వందిళ్ళు ♦ కేళీనివాసంబు,లంతఃప్రదక్షిణా♦యతనవీథి
యుపహారభోగమం♦టపము గర్భగృహంబు,పరిణయహేమవై♦భవనిశాంత
మంతఃపురంబు క♦క్ష్యాంతరంబులు జాల,కంబులు మేడలుఁ♦గరుణతోడ

తే. నిభముఖానలజాతచం♦డీశవుండ, రీకలోచన మాతృకా♦లోకనయన
దక్షిణామూర్తి వటుకాది♦దైవతముల, నిలయములు గట్టెనత్యంత♦నిష్ఠతోడ. 95

శా. ప్రాతఃకాలతుషారశీకరచయ♦ప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగుత♦ద్బిందుచ్ఛటాజాలఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహుర♦త్నోద్దీప్తగేహంబులై
లూతాకల్పితతంతుసద్మములు వా♦ల్భ్యం జెప్పఁ జిత్రంబులై. 96

క. తీరుగ నీగతి నింపులు, తీఱఁగఁ గట్టియును గాలిఁ♦ ద్రెవ్వినపోఁగుల్
జాఱిన పోఁగులు నదుకం, దీరుపనే కాని నిలువఁ♦ దీరక దినమున్. 97

శా. సేవింపంగఁ జెలందినేమముఁ బరీ♦క్షింప న్లలాటాక్షుఁ డా
త్మావాసంబుననున్న దీపశిఖకీ♦లాభీలతీవ్రప్రభా
వ్యావిద్ధాంబరమై తగుల్కొని తదీ♦యాగారముల్ ధూమమై
పోవం జేసిన లేచి కీటకము హృ♦ద్భూతవ్యథాక్రోధమై. 98

క. ఇదిపెక్కేఁడులు పట్టిన్, సదనంబులు గట్ట నాకు♦ శంభునికొఱకున్
దుదిఁ గుమ్మరి కొకయేఁడును, గుదెకొకపెట్టన్న మాట♦కున్ సరివచ్చెన్. 99

చ. కటకట నేఁ బ్రయాసమునఁ♦ గట్టిన యిండ్లను గాల్చె దీప మిం
తటఁ బడి దీని ద్రుంగక వృ♦థా వసియించినఁ గోపమాఱునే
యటమటమైన జీవనము♦నందలి మోహము చాలునంచు ను
త్కటగతి దీపికానలశి♦ఖావిసరంబులఁ ద్రావఁ బోవఁగన్. 100

శా. దేవోత్తంసుఁడు భక్తవత్సలుఁడు చి♦త్తేశస్వభావుండు గౌ
రీవామాంగుఁడు శంకరుండు దయ మూ♦రింబోవఁ గెంగేలునన్
జావ న్వచ్చిన పుర్వుఁ బట్టి తగునీ♦ సద్భక్తికిన్ మెచ్చితిన్
నీ వేయర్థము నన్ను వేఁడెదవు దా♦నిం జెప్పుమా నావుడున్. 101

క. చెలఁదియు నాతప మింతట, ఫలియించె నటంచుఁ బ్రమథ♦పతికిఁ బ్రణామం
బులు పెక్కు సేసి సంభ్రమ, కలితహృదయమగుచు భక్తి♦గడలుకొనఁగన్. 102

శా. దేవా! నిన్ను నుతింపలే, నధమబు♦ద్ధిన్, వేదశాస్త్రంబులున్
రా వేపాటియు, వచ్చినన్ శ్రుతులు శా♦స్త్రంబు ల్నిముం జెప్పఁగా
లే వాద్యంతము లన్నఁ దద్విధులకుం♦ లెక్కింపఁగా శక్యమే
సేవాధర్మము మేలు గాకనుచు మీ♦ శ్రీపాదము ల్గొల్చితిన్. 103

క. నా కీభవదుఃఖంబులు, లేక మహాజ్ఞానరసవి♦లీనుఁడ నగుచున్
లోకం బెన్నఁడు నెఱుఁగని, యాకైవల్యమె యభీష్ట♦ మని ప్రార్థింపన్. 104

చ. అనిమిషకోటి తా మహర♦హంబునొనర్చు శివార్చన ల్మనం
బున నిరసింప, మానులు త♦పోవిభవంబులు రోయ, యోగవా

ననఁబడి పొర్లువారు తమ♦జన్మముఁ దిట్టుకొనంగ, నన్యద
ర్శనరతు లెల్ల మానసమయ♦సంగతి చాలునటంచు, నెంచఁగన్. 105

ఉ. ఎక్కడఁ జూచినన్ సురము♦నీశ్వరదానవమానవాహిపుల్
మ్రొక్కుచు సన్నుతించు రవ♦ముల్ ధ్రువమండలవీథి నిండఁగా
దిక్కులు ముంచుకొన్న తన♦తేజములోపల నూర్ణనాభమున్
గ్రక్కునఁ గూర్చెఁ దన్మయము♦గా శివలింగము భక్తిలోలతన్. 106

క. లూతాధీశ్వరు కథ యిది, వాతాశన హస్తికథలు♦ వాక్రుత్తు మహా
పాతకధాత్రీధరని, ర్ఘాతములై యమృత మొల్కఁ♦గా వీనులకున్. 107

కాలసర్పము నేనుఁగును శివసాయుజ్యము నొందుట.

శా. త్రేతాంతంబున నొక్కకాలఫణి భ♦క్తిన్ దివ్యమాణిక్యముల్
పాతాళంబున నుండి తెచ్చి దినముం♦ బాలేందుచూడార్చనల్
ప్రాతర్వేళలఁ జేయు ద్వాపరయుగ♦ప్రారంభమైన న్గుణా
తీతున్ శంకరుఁ గొల్వ వచ్చె నొకహ♦స్తిశ్రేష్ఠ మచ్చోటికిన్. 108

సీ. వచ్చి కేతకినది♦ వారిలోపల దోఁగి, కానలు గొలఁకులు♦ కలయఁ దిరిగి
మాలూరశాఖలు♦ నాళీకకహ్లార, కుముదపుష్పంబులు♦ గోసి తెచ్చి
ఫణి సమర్పించిన♦ మణులెల్లఁ బోఁద్రోచి, తొండానఁ గ్రోలిన♦తోయములను
దక్షిణకైలాస♦ ధరణీధరావాసు, సద్భక్తితోడ మ♦జ్జనముసేసి

తే. పూజలొనరించి యేనుఁగు♦ పోవుటయును, భవునిదర్శింప మఱునాఁడు♦పాఁపతేఁడు
నిజఫణాగ్రసమగ్రమా♦ణిక్యదీప్తి, తపనునకుఁ దోడుపడఁ గాల♦తమముఁ జెఱుప. 109

ఉ. డగ్గఱి యెవ్వఁడో కటక♦టా శివలింగముమీఁదిరత్నముల్
గగ్గులకాటఁ గప్పి ములు♦కంపలు తీవలు వెట్టె నేఁడు, నా
కెగ్గొనరించి పోయె, నిఁక♦ నేమననేర్తు మదీయ భాగ్య మి
ట్లగ్గిఁబడంగఁ జేసినమ♦దాంధుని నంచు విషాదచిత్తుఁడై 110

క. అల్లన యేనుఁగు వెట్టిన, వెల్లం బోఁద్రోచి యెడఁద♦నీసును భక్తిన్
మల్లాడ మణుల గౌరీ, వల్లభుఁ బూజించి చనియె♦ వాతాశనమున్. 111

ఉ. అంతటఁ గొంత సేపునకు♦ నగ్గజరాజును వచ్చి రత్నసం
క్రాంతశరీరు నీశ్వరునిఁ♦ గన్గొని యెవ్వఁడొ నేఁడునజ్ఞతా
సంతమసంబు గప్పియొక♦పక్కపుఁబూజ లొనర్చెఁ గాక యే
భ్రాంతులు పెక్కువర్ణముల♦ ఱాలు కపర్దికిఁ బెట్టఁ జూతురే. 112

క. అని చింతించుచు నెప్పటి, యనువున శివపూజఁ జేసి♦ యడవికిఁ జనియెన్
దనయిచ్చ దంతి పామున్, బనివడి మఱునాఁడు దాఁ బ్ర♦భాతమునందున్. 113

మ. శివుఁ బూజింపఁగ వచ్చి బిల్వవిటప♦శ్రేణీసనాళాబ్జభే
దవిలీనాంగము దివ్యలింగము సఖే♦దస్వాంతమై చూచి నా
ది వృథాజన్మము గాదె! నాతపము భ♦క్తిం బాడుగా కున్న యే
ల విచారింపఁగ నెల్లియుఁ వ్రతము కొ♦ల్లంబోయినం జూచెదన్. 114

ఉ. ఎక్కడి దుర్మదుండొ తన ♦ కేనొనరించినరత్నపూజనల్
దిక్కులఁ బాఱఁ జల్లి జగ♦తీరుహశాఖలుఁ దమ్మికాఁడలుఁ
బెక్కులు గొంచువచ్చి పయిఁ ♦ బెట్టిన నూరకయుండె శంకరుం
డక్కట యేమి సెప్ప నహ♦హా పగవారినిఁ గూడె దైవమున్. 115

ఉ. కంటక మెట్లునాక సుము♦ఖత్వము నొందితి వయ్య పార్వతీ
కంటకితాంగబాహులతి♦కాయుగసంగతిఁ బోలె దుఃఖకృ
త్కంటకబిల్వకాకము♦కాండము లెత్తిన మోచిమోచి ము
క్కంటి! యెఱుంగవే నొసలి ♦ కంటిమహత్త్వము నీకుఁ గల్గుటన్. 116

మ. అని దుఃఖించుచు నెట్టకేలకు దృఢం♦బై చిత్తమాత్మేశు న
ర్చనసేయం దలపోయ దంతికృతపూ♦జల్ద్రోచి పై దుమ్ము భ
స్మనఁ బోనాఁది యనర్ఘ్యరత్నములఁ జ ♦ క్షుశ్శ్రోత్ర మర్చించి యా
? త్మనివాసంబు తదంతరాయజనితో ♦ న్మాదంబునం దూఱుచున్. 117

సీ. భోగవతీఝురం♦బునఁ జొచ్చి బోటుల,తోడ నాడెను జల♦క్రీడ లుడిగి
పువ్వుఁబోణులుఁ దాను ♦ బొత్తుల భుజియించు, మధురసుధాహారవిధిఁ దొఱంగి
బహువిధతానసం♦పన్నగానంబుల,నిక్కి చొక్కెడు తన♦నేర్పు వదలి
ప్రాణనాయికతోడఁ ♦ బర్యంకసీమల, మసకానఁ బెనఁగుసం♦భ్రమము విడిచి

తే. నిద్రవోయెడు సుఖమెల్ల ♦ నేలఁగలిపి, ప్రతిదినంబును దాఁ జేయు♦రత్నపూజ
శివునిపై నుండకుండినఁ♦జింతనొంది, రాత్రి శివరాత్రిగా జాగ♦రమ్ముఁ జేసె. 118

శా. తా నర్చించి తొలంగినట్టి తరువా♦తన్ శంభుఁ బూజింపఁగా
దానానేకప మేగుదెంచి శివుమీఁ♦దన్ నిన్న మొన్నంబలెన్
నానారత్నముఁ లుండఁ జూచి కడుఁజి♦న్నంబోయి నాతోఁ జలం
బో నేఁ డీశిల విశ్వనాయకునిపైఁ ♦ బొందించినాఁ డెవ్వఁడో. 119

ఉ. అచ్చపునీలవర్ణ దృష♦దావళి నల్లని కల్వలే? కడుం
బచ్చనిరాలు బిల్వనవ♦పత్రములే? యరుణాశ్మభంగముల్
విచ్చిన యెఱ్ఱదామరలె? ♦ విశ్వపతీ! విరసోపలంబు లె
ట్లచ్చుపదలయ్యె? నీకు నవి♦యందున గంధ మృదుత్వ శైత్యముల్? 120

చ. ఉనికి శిలోచ్చయంబు, నిజ♦యోష శిలోచ్చయరాజపుత్రి, నీ
ధనువు శిలోచ్చయంబు, పుర♦దాహా! రథీకృతరత్నగర్భ! నీ

మనమున శ్రీశిలాశకల♦మండన మెట్లు ప్రియంబుఁ జేసె? నే
మనఁగలవాఁడ నిన్ను వ్రత♦హానియొనర్చు దురాత్ముఁ డుండఁగన్. 121

శా. పోనీ నేఁటికి నాయెఁ బోయెఁ గడు దు♦ర్బుద్ధిన్ విచారింప నే
లా నిత్యంబును నీశ్వరుం గొలుచు వే♦ళం గాక రేపాడి రాఁ
గా నర్చావ్రతహంతఁ గన్న నదిభా♦గ్యంబే వివేకింప వాఁ
డౌ నేనా నొకజాడఁ బోయెదము లే♦దా జీవ మింకేటికిన్. 122

ఉ. ప్రాణము లిచ్చువాఁడ నిఁక♦ భర్గున కెల్లియుఁ బూజవోయి పా
షాణము లున్న నిందునకు♦ నందియ మేల విచార మేటికిన్
బ్రాణము మీఁదఁ దీఁపుగల♦ ప్రాణులకున్ బిరుదున్ వ్రతంబు క
ల్యాణకరంబులే యనుచు♦ నర్చన సేసి మదేభరాజమున్. 123

సీ. పిడియేనుఁగుల వెంటఁ♦ బడిపోక యుఁడుగని, వెడవిల్తు వేఁడిమి♦ విడువుఁ జూపఁ
గరమున నుదకంబు♦ కడుఁ జల్లుకొనకున్నఁ, దెమలని మిహిరదా♦హము దొలంగ
సరసునఁ జొచ్చి తా♦మరతూండ్లు మెసఁగక, మానని యాఁకటి♦ మంట లేక
సింహపోతములు ఘో♦షింపఁ బుట్టినభయా,తంకాగ్ని తహతహ♦ గ్రుంకఁబాఱ

తే. నెట్టివెట్టలుఁ దనమీఁద♦ నెక్కలేక, పంచబంగాళమై పోవఁ ♦ బ్రాణలింగ
పూజనావిఘ్నమునయందుఁ ♦ బుట్టినట్టి, చింతయున్ వేఁకి దనలోను♦ చేసికొనియె.

తే. ఏమి సేయుదు ననియాత్మ♦ నీసుమునకుఁ, బోయి తనలోనఁ దలపోఁత♦ బ్రుంగుడయ్యె
నవుడు పడమటికొండపై ♦ నెక్కభానుఁ, డెప్పుడుదయించునేఁ బోదు♦ నెప్పుడనుచు.

వ. అయ్యవసరంబున. 126

సీ. ప్రాగ్వధూమణి చిమ్ముఁ ♦ బళ్ళెమది క్కాంత, పట్టిన చెంగల్వ♦ బంతి యనఁగఁ
గాలవిష్ణుం డంధ♦కారదైత్యుని వ్రేయఁ, జరమాద్రిఁ బడిపోవు♦ చక్ర మనఁగ
దినమహీరుహమునఁ ♦ దేజోమయంబుగాఁ, బండిరాలిన పెద్ద ♦ పం డనంగ
దివినుండి దేవదా♦నవయుద్ధరక్తార్ద్రమై నేలఁ గూలు ర♦థాంగ మనఁగఁ

తే. బద్మినీసంగమశ్రాంతిఁ♦ బరిహరింప, నపరజలనిధి జలకంబు ♦ లాడఁబోవు
కరణి నెఱసంజచందురుఁ♦ గావిపచ్చడంబు ధరఁ బెట్టి భానుబిం♦బంబు గ్రుంకె. 127

శా. తారాలోకమునం బ్రకాశ మొకచం♦దంబై ప్రసాదింప సం
ధ్యారాగావృతమై తమఃపటల సం♦తానంబు గప్పంగ నం
భోరేఖల్ గళదశ్రుధారలగతిం ♦ బొల్పారఁగాఁ బోయెఁ గ
ప్లోరవాప్రితము నవ్వలోకనయనం ♦ బంధీకృతప్రాణిమై. 128

చ. తిమిరపుఁగాలసర్పవిత♦తిన్ గుహ లీఁగి చనంగఁ దోలి య
భ్రము వడి నెక్కి చూచి దిగి ♦ పన్నగలోకముఁ జొచ్చి పోవున

ట్లమరఁ బతంగదేవుఁ డపరాంబుధిఁ గ్రుంకెఁ దదీయసేన తు
త్తుములుగఁ బోరియుఱ్ఱ మగుడఁ ♦ దోడనిధాత్రినిఁగూడముట్టఁగన్. 129

మ. విపులావాలమునిండి శైలగుహలన్ ♦ వేళ్లాఁతి శాఖల్ దిగం
తపదమ్ముల్ పొదువన్ వియత్తలమువీఁ♦దన్ మించి యొప్పారు ద
ట్టపుఁ బెంజీఁకటిచెట్టుఁ జుట్టుకొనియుం♦డం బొల్చెఁ దారల్ తదీ
యపుష్పలాళాంతరదర్శితోర్ధ్వభవనో♦ద్యద్దీప్తిఖండక్రియన్. 130

మ. సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁ డనుటల్ ♦ సత్యంబుగాఁ దెల్పుపో
ల్కిఁ గఁ బెంజీఁకటి నిండఁ దారకలు వొ♦ల్చెన్ నిర్జరాధీశ్వరా
దికు లర్పించిన పువ్వుల ట్లభవుఁ డ♦ద్దేవుండు భేదంబుగా
మికిఁ దెల్లంబుగ నల్పు దెల్పుగ ధరన్ ♦ మించెన్ శశాంకాకృతిన్. 131

మ. ఉదయగ్రావము పానవట్ట మభిషే♦కోదప్రవాహంబు వా
ర్ధి, ధ్వురధ్వాంతము ధూపధూమము, జ్వల♦ద్దీపప్రభారాజి కౌ
ముది, తారానివహంబు లర్చితసుమం♦బుల్ గాఁ, దమోదూరసా
ఖ్యదమై శీతగభస్తిబింబశివలిం♦గం బొప్పెఁ బ్రాచీదిశన్. 132

మ. గగనాహార్యమృగేంద్రశాబకము న♦క్షత్రాంబుజారణ్య మ
ధ్యగహంసంబు నిశావధూకరతలో♦ద్యన్మల్లికాగుచ్ఛ మ
ధ్వగబాధావహచిత్తభూకటకయా♦త్రామౌక్తికచ్ఛత్ర మొ
ప్పగతిం జంద్రుఁడు దోఁచె దంపతుల కిం♦పుల్ మీఱఁగాఁ దొల్దెసన్. 133

మ. గరుడానీతసుధాఘటంబు గొని పోఁ♦గా నిర్జరశ్రేణి వెం
ట రయం బాఱఁగఁ బాఱు నాగముల చూ♦డారత్నసందోహ మం
బరవీథిం బరఁగింపఁ జంద్రుఁ డుదయిం♦పం, దోఁచెఁ దోడ్తో నుడూ
త్కరముం జిందమృతంబుబిందువులశం♦కం గ్రమ్మఁగం జేయుచున్. 134

చ. కుముదవనాళికిన్ బలుపు ♦ కోకములాటకు నిల్పు, దిగ్వధూ
సమితికిఁ బూఁత, మేఁత నవ♦శాబచకోరకరాజి, కిందుకాం
తములకు ద్రావకం, బగుచు♦ దర్పకశాస్త్రనిరూపితౌషధ
క్రమములఁ బండువెన్నెలలు ♦ గాసె ధరాస్థలి మోహనంబుగన్. 135

ఉ. అప్పుడు పాము నేనుఁగు మ♦హావ్రతవిఘ్న విషాద వేదనన్
ముప్పిరిగొన్న చింతఁ గను♦మూయ నెఱుంగక నెమ్మనంబులో
నెప్పుడు తెల్లవాఱును స♦హింపఁగరాని విరోధవహ్ని నే
చొప్పున నార్తుమొక్కొ యను♦చుం దమలోఁ దలపోయుచుండఁగన్. 136

సీ. నిర్నిద్ర పూర్వాద్రి♦నీపప్రసూనాభి,రామాంబురాశి త♦రంగ మనఁగ
భానుభిల్లగభస్తి♦భల్లభగ్నతమోచ్ఛ, భల్లనిర్యద్రక్త♦పంక మనఁగ

రజనీసుధాకర ♦ రతివియోగనిధాన, కామప్రతాపాగ్ని ♦ ధామ మనఁగఁ
సంధ్యాధిదేవతా ♦ చారుపీఠవ్రాత, పద్మరాగప్రభా ♦ పటలఁ మనఁగఁ

తే. గాలరసవాది బ్రహ్మాండ ♦ గోళమెల్లఁ, జిత్రబుద్ధి సువర్ణంబు ♦ సేయఁ దలఁచి
ద్యుమణిశిఖిమీఁదఁ జల్లుసిం ♦ దూరరాజి, యనఁగ నొప్పారె నరుణశో ♦ ణాంశురాజి.

ఆ. పన్నగంబు గజము ♦ బలమునఁ జలమునఁ, బోరుటెట్లొ శివునిఁ ♦ బొందుటెట్లొ
చూడవలయు ననుచు ♦ వేడుకతో వచ్చె, కిరణి నంతఁ దోఁచెఁ ♦ గర్మసాక్షి. 138

వ. అంత. 139

ఉ. భానుఁడు పూర్వపర్వతము ♦ పై నుదయింపక మున్నె లేచి కుం
భీనసవల్లభుండు మదిఁ ♦ బేర్చిన రోషభరంబున న్నిజ
స్థానము నిర్గమించి పగఁ ♦ జంపఁగ వచ్చు కటారుకాని చం
దాన మహేశ్వరుం గదిసి ♦ తా నొనరించిన పూజ లేమికిన్. 140

క. కటకటఁబడి యిఁక నెటువలె, నటు కానీ వానిఁ దీర్తు ♦ నటు కాదేనిన్
నిటలాక్షున కిర్పింతుం, జటులగతిం బ్రాణములు ని ♦ జంబుగ ననుచున్. 141

ఆ. పిన్నరూప మగుచు ♦ బిల్వశాఖాంబుజ, నాళమధ్యసీమఁ ♦ గాళనాగ
మడఁగియుండ దంతి ♦ యతివేగమున వచ్చి, శివునిపూజఁ జూచి ♦ చిత్త మలర. 142

ఉ. ఈసకలేశ్వరుండు కరు ♦ ణేక్షణుఁ డయ్యెనొ విఘ్నకర్త సం
త్రాసము నొందెనో వ్రతము ♦ ధన్యతఁ బొందెనొ పూర్వజన్మ వే
ళాసుకృతంబు పండెనొ క ♦ ళానిధిశేఖరమౌళి నేఁడు నేఁ
జేసినపూజ నిల్చె నని ♦ శీఘ్రమున న్ముదమంది క్రమ్మఱన్. 143

ఆ. డాఁగియున్నపాము ♦ డాయక పోయెఁగా, దాయ యనుచు రోష ♦ దహనశిఖలు
కన్నుఁ గొనలఁ గ్రాలఁ ♦ గా నుండ నాకీడు, గాన కిభవరుండు ♦ గాన కేగి.

వ. నీరేరుహ మాలూర దళభరంబులు కరంబునఁ జుట్టి పట్టుకొని సమీరంబున జడియు
నడలచప్పు డప్పు డినుమడింపఁ గంపించి గుంపు విచ్చిమృగంబులు మొగంబు
లెత్తుకొని పాఱం గారుణ్యరసతరంగం బగు శివలింగంబుఁ జేరం జనుదెంచి డించి
పాపహృదయశల్యం బగు నిర్మాల్యంబుఁ దుడువం దలంచి 145

శా. శుండాలంబు కరంబు సాఁప ఫణిరా ♦ జు న్మెచ్చి నాపూజ భ
ర్గుం డీవేళ ననుగ్రహించె నని ము ♦ క్కుంగ్రోళ్లలో నెక్కి యు
ద్దండక్రీడఁ దదీయకుంభకుహర ♦ స్థానంబునం ద్రిమ్మరన్
గొండ ల్గూలఁగ నెత్తి మొత్తుకొని ది ♦ క్కు ల్మ్రొట్ట గీఁపెట్టుచున్. 146

సీ. మొగలేటి మడుఁగున ♦ మునిఁగి తుండమ్మున, నుదక మాకర్షించి ♦ యూఁది యూఁది
కడుఁగపాలము దాఁకి ♦ కలఁగంగఁ జక్కఁగాఁ, జేసాఁచి జిఱ్ఱునఁ ♦ జీఁదిచీఁది

యిలమీఁదఁ దలదాఁకి ♦ నీప్రక్కనాప్రక్కఁ, బెడమర్లుగాఁ బొడ ♦ పెట్టిపెట్టి
యుసివోని వేదన ♦ నున్నచో నుండక, పనిలేనివరువులు ♦ పాఱిపాఱి

**తే.** పెద్దప్రాఁకులతోఁ గుంభ ♦ పీఠయుగముఁ, దోముకొనుచును జెట్టులు ♦ దూఱితూఱి
సాము సేసిన దుఃఖంబు ♦ సామజంబు, దీర్చుకొను వెర వెఱుఁగక ♦ ధీరబుద్ధి.

**శా.** ఏనా చచ్చుట తప్పదిప్పుడు నుమా ♦ధీశోపకంఠంబునన్
దానుం జావక చంపనోప దురగేం ♦ద్రం బెక్కుడీదుఃఖమే
లా నాకున్ సరి చంపి చచ్చుట జనా ♦హ్లాదంబు గాదా యవా
చీనస్థాణునగంబె వధ్యశిలగా ♦ సేవింతుఁ గా కింతటన్. 148

**మ.** అని మత్తేభము చిత్తజాహితుని ది ♦క్కై క్రమ్మెక్కి యిక్కాళ మే
కనుమం బోవునో యంచుఁ దుండ మిఱియం ♦ గాఁ జుట్టి వక్త్రస్థలం
బునఁ గీలించి పిఱిందికిం జని శిరం ♦బు న్వంచి యకొండ భ
గ్గునఁ దాఁకె న్వడిఁ గుంభము ల్వగులఁ ద ♦త్కూటంబు లూటాడఁగన్. 149

**ఆ.** కొండకొండతోడ ♦ కుంభములుఁగూలంగ, దాఁకినట్లు దోఁచె ♦ దళితకుంభ
సీమయున్న సాము ♦ చిదిసె నేనుంగును, బఱిమె నెత్తురచటఁ ♦ బడియెఁ గట్టి 150

**వ.** తదీయ మరణస్థానంబు నవాచీనకైలాసనికటంబును సువర్ణముఖరీతటంబు నగుటం జేసి కాద్రవేయ భద్రగజంబులు రుద్రగణాకారంబులు దాల్చిరి. అమ్మహాలింగమధ్యంబునం దుండి కొండల ఱేనికూరిమికూఁతుతోడం గూడి చంద్రచూడామణి వృషభవాహనారూఢుండై హృషీకేశ పితామహ ప్రముఖ బర్హిర్ముఖులు గొల్వం బ్రత్యక్షంబై మీకభీష్టంబు లెయ్యవి యని యానతిచ్చుటయు సాష్టాంగదండప్రణామంబులు గావించి యిట్లని సన్నుతించిరి.

**రగడ** జయజయ కలశీసుతగిరికన్యా, శైవలినీతట కల్పమహీరుహ
జయజయ దక్షిణ రజత క్షితిధర, సంయమి సేవిత పాదసరోరుహ
జయజయ పీన జ్ఞానప్రసవా, చలకన్యాకుచ దృఢ పరిరంభణ
జయజయ కృత దుర్గాధరణీధర, సాను వినోద విహార విజృంభణ
జయజయ భారద్వాజాశ్రమ వన, సరసిజ కేళీ వన పరితోషిత
జయజయ నీలత్సాధర పుణ్యా, స్థలకాపాలిక భాషితభూషిత
జయజయ మోహన తీర్థాలోకన, సంభ్రమరత భవబంధ విమోచన
జయజయ శిఖితీర్థాశ్రిత యోగీ, శ్వరమానస సంవిత్సుఖ సూచక
జయజయ సహస్రలింగాలయ ద, ర్శనమాత్రస్థిత మోదాపాదక
జయజయ ఘన మార్కండేయమునీ, శ్వరతీర్థనిషిక్తవిపచ్ఛేదక
జయజయ నిర్ఝరనాయక తీర్థ, స్నాతక జనకలుషేంధన పావక
జయజయ కరుణేక్షణ రక్షితనిజ, చరణారుణ పంకేరుహ సేవక

దేవా నిను వర్ణింప రమావా,గ్దేవీ వల్లభు లైనను శక్తులె?
నీవిధ మెఱుఁగక నిఖిలాగమముల, నేర్పరు లైనను జీవన్ముక్తులె?
కొందఱు సోహమ్మని యద్వై,తా, కుంఠితబుద్ధి న్నిను భావింతురు
కొందఱు దాసోహమ్మనిభక్తిని, గుణవంతునిఁ గా నిను సేవింతురు
కొందఱు మంత్రరహస్యము వని నినుఁ, గోరి సదా జపనియతి నుతింతురు
కొందఱు హఠయోగార్థాకృతివని, కుండలిచే మారుతము ధరింతురు
తుది నందఱుఁ దమయిచ్చల నేయే, త్రోవలఁ బోయిన చిద్రూపమ్మును
గదియక గతిలేకుండుట నిజముగఁ, గని చాలింతురు మది సంతాపము
నిను సేవించిన కృతకృత్యుఁడు మఱి, నేరఁడు తక్కిన నీచులఁ గొల్వఁగ
నిను శరణం బని నిలిచిన ధీరుఁడు, నేరఁడు తక్కిన చోటుల నిల్వఁగ
నీ వనియెడునిధిఁ గాంచిన ధన్యుఁడు, నేరఁడు తక్కినయర్థము గోరఁగ
నీవే గతియని యుండెడు పుణ్యుఁడు, నేరఁడు తక్కిన వారలఁ జేరఁగఁ
భవదుర్వాసన పాయదు మీపద, పంకజముల హృదయము వాసింపక
చవులకుఁ గలఁగవు సకలేంద్రియములు, సతతమ్మును మిమ్ము నుపాసింపక
జనన మరణములు ధరలో మిమ్మును, నమ్మతితో సేవింపక పాయవు
మనమునకును మీ చిన్మయరూపము, మరగింపక యణిమాదులు డాయవు
మీమహాత్మ్యము మేమింతంతని, మితిచేయఁగ మది నెంతటివారము
మామీఁదను కృప గల్గి మహేశ్వర, మన్నింపుము మీకు నమస్కారము. 152

శా. ఈసంసారపయోధిలోనఁ బడి మే◆మీఁదీఁది దేహంబుపై
నాస ల్మానక తేలుచు న్మునుఁగుచుం◆బ్రాణప్రయాణోన్ముఖా
యాసంబుల్ శతసంఖ్య లోర్చితిమి దే◆వా మమ్ము రక్షించి మి
థ్యాసౌఖ్యంబులు చాలు నిత్యసుఖ మి◆మ్మా యంచుఁ బ్రార్థించినన్. 153

శా. డాయం బిల్చుచు వారి నిద్దఱ నఖం◆డజ్ఞానరూపంబునన్
వ్యాయామంబు నదృశ్యవస్తువు నమా◆యాకారముం బుష్కర
ప్రాయంబున్ విమలంబునైన తన◆సర్వవ్యాపకజ్యోతిలో
సాయుజ్యం బొనగూర్చె దేవతల కా◆శ్చర్యంబు సంధిల్లఁగన్. 154

క. ఆలిం గూడుచుఁ గ్రమ్మఱ, నాలింగమునందుఁ గలసె ◆ నదిమొదలుగఁ జం
ద్రాలంకారుఁడు జగతీ, పాలక శ్రీకాళహస్తి◆పతి యనఁ బరఁగెన్. 155

క. నావుడు విని యాదవ ధర,ణీవిభుఁ డిఁక నెవ్వ రందు ◆ నీలగ్రీవున్
సేవించి ముక్తికాంతా,జీవేశ్వరు లైరటన్న ◆ శివుఁ డిట్లనియెన్. 156

శా. కామక్రోధ మదాంధకార పటలా◆ఖండప్రచండార్క వే
ధో ముముక్షుయ తాండవ భ్రమణని◆ర్ధూతప్రపంచా పుర

శ్రీ మాహాత్మ్యహార ప్రభావ దశది♦క్చేలప్రభేద స్ఫుర
ద్దామా కాలజయేందిరా మదవతీ♦దాంపత్య నిత్యోదయా 157

క. లుంటీకృతాఘ ముక్తిచి,రంటీ గాఢోపగూఢ♦రత చిద్విద్యా
ఘంటాపథచర తారక,ఘంటారవ హృతమనోమృ♦గవ్యాధేశా. 158

పంచచామరము. దివానిశోదయావసాన ♦ దిగ్విహీనఖండితా
జవంజవాంధకారసత్య♦సంవిదభ్రమండితా
దివాకరాదిక గ్రహాగ్ర♦దీధితి ప్రసాద వా
గ్ధ్వాండభాసకాదితత్త్వ♦తారకత్రుపాధవా. 159

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణ సింగమంమా
నారాయణ జక్కయనారాయణ తనూభవ భవపరాఙ్ముఖ
ధూర్జటిప్రణీతం బైన శ్రీకాళహస్తిమాహా
త్మ్యంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ రామార్పణమస్తు.

శ్రీ రామాయ నమః.

# శ్రీకాళహస్తిమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.




ధరనయనాబ్జసమా
రాధితదివ్యాంఘ్రిశోణ♦రాజీవ! మనో
బాధావహసంసార
వ్యాధివ్రజవైద్య! కాళ♦హస్తీశ! శివా!

ఆ. అవధరింపుఁ డిట్లు♦భవదీయకథ విన్న, వింతు భక్తజనుల♦వీను లలర
మీఱు యాదవునకుఁ♦గారుణ్యరసపూరి, తేక్షణముల నాన♦తిచ్చినట్లు. 2

### కన్నప్పయను తిన్నని జన్మభూమివర్ణనము.

ఉ. పొత్తపినాటిలో విపిన♦భూమిఁ గిరాతుల కాటపట్టు లో
కోత్తరవన్యవస్తు వుడు♦మూరను పక్కణ మొప్పుఁ, దద్ర మో
దాత్త మహత్త్వ మద్భుతర♦సావహ మూహ యొనర్ప మేదినీ
భృత్తట నిర్ఝరాంబురుహ♦బృంద సుగంధ సగంధవాహమై. 3

సీ. స్తబ్ధరోమవిషాణ♦లబ్ధమౌక్తికములఁ, బాటింపుదురు రేఁగు♦పండ్ల పాటి
ముక్తకంచుకమస్త♦ముక్తాఫలంబుల, మందలింతురు కురు♦విందలట్లు
సమద సామజకుంభ♦జములైనముత్తియం, బులఁ జూతు రుసిరికా♦యల విధమున
వేణుజాతములైన♦ మాణిపూసల నెంతు, రూడుగపండ్లకు ♦ నీడుగాఁగ
తే. గంధసారాగురుద్రుమ ♦ కాష్ఠఖండ, చయము దమయింటి వంటక♦ట్టియలుగాఁగఁ
జేయుదురు కాఁపురంబులు♦ సేయునపుడు, చెంచెతలు చెంచులను గూడి♦చిత్రలీల. 4

ఉ. సంకుమదంబునుం బునుఁగుఁ ♦ జాఁదును గస్తురియుం ఘటంబులం
బంకముఁ జేసి యిండ్లలికి ♦ ప్రత్యహము న్వెలివైవ మార్గకూ
లంకష గోమయప్రతతు♦లం బుడిడించుచుఁ నుంచు గుప్పలై
యింకఁ దదీయభూతి నిద♦మిత్థ మటంచు నుతింప శక్యమే? 5

సీ. పట్టుచీరలఁ గట్ట ♦ భాగ్యంబు గల్గియుఁ, బౌఱుటాకులఁ గట్ట ♦ భార మనరు
రాజాన్నభోజన♦ప్రాభవశ్రీ గల్గి, యును పస్యధాన్యంబు ♦ నొల్ల మనరు
మాణిక్యభూషాస♦మాజంబు గల్గియు, నెఱ్ఱని కురువింద ♦ లేటి కనరు
మంచిమెచ్చులతూఁగు♦మంచము ల్గల్గియుఁ, జాలుఁ బూఁదీఁగయు♦య్యాల లనరు

తే. ఎంత సంపద గల్గియు♦నెట్టివారుఁ,దమ కులాగత ధర్మక♦ర్మములు విడువఁ
జాల రటుకానఁ దత్పురీ♦శబరసతులు, మహిమ గలిగియు మానరు♦సహజవృత్తి. 6

మ. అగురుక్ష్మారుహ కాష్ఠఖండముల స♦ర్వాంగంబులం జేసి మై
మృగనాభి న్మసిఁ బూసి, చామరము ధ♦మ్మిల్లంబుగాఁ జుట్టి, యే
నుఁగుకుంభమ్ములలోని ముత్యములఁ గ♦న్గ్రొద్దు ల్వినిర్మించి, భి
ల్లగజేంద్రు ల్వాఁబొమ్మలం దవిఁదచే♦లం జేయుదుర్ గావుగన్.

క. ఏనుఁగుల తలలు కొమ్ముల,తో నారబములకు దృష్టి♦దోషము వాయం
గా నెత్తుదు రెఱుకులు దమ,చేనికిఁ బసరంబుతలల♦చెలువం బెసఁగన్. 8

క. కొండలలోఁ జేసిన తమ, పండినచేలకు వరాహ♦పంక్తులు చొరరా
కుండం దెల్లని చామర,ఖండంబులు ప్రోగుఁదాళ్లఁ♦గట్టుదు రెఱుకుల్. 9

ఉ. మంచెల మీఁద నెక్కి కటి♦మండలిఁ జుట్టిన పాఱుటాకు లిం
చించుక చంచలించి మరు♦నిల్లు బయల్పడఁ జేయఁ బిట్టలర్
జెంచెత లార్చి వ్రేయుదురు♦చిత్రముగా నొడిసెళ్ల బాహుమూ
లాంచిత దీధితు ల్పిఱుత ♦ మైనచనుంగవమీఁదఁ బర్వఁగన్ 10

మ. మదపుంస్కోకిల మాతృజాతికృతస♦మ్యఙ్నాద శంకామతిన్
వదరంగా నలవేఁటలాడెఱుకుగో♦వాళుల్ ప్రసూనాశుగ
ప్రదర ప్రేరిత చిత్తవృత్తులగుచుం ♦ బ్రాంతమ్ములం ద్రిమ్మరన్
బెదరం దోలుదు రార్చి పక్షివితతిన్ ♦ భిల్లాంగనల్ చేలలోన్. 11

తే. శబరకాంతా ఘనస్తన♦శాతకుంభ,కుంభ యుగములఁ గరకరి ♦ కొనలుసాఁగ
మానుపఁగ వచ్చునే చంప♦రాని పగయు, నన్నదమ్ముల పోరాట ♦ మజునకైన. 12

క. గుబ్బచనుంగవ తేనియ,లుబ్బుచు మోవియు మెఱుంగు ♦ లొలికెడుమేనుల్
నిబ్బరపుంగబరీభర, మబ్బురపుంగౌను చంచ♦లాక్షుల కొప్పున్. 13

క. తేనియలు గ్రోలి పిదపన్, మానవతుల యధరమాని ♦ మఱితురు శబరుల్
తేనియ తియ్యఁదనంబు స,మానం బనఁ దగునె యధర♦మధురిమ కెందున్. 14

సీ. కఱకుజుంజుఱువెండ్రు♦కలకొప్పు గాఢత,రంబుగా నెమలి పిం♦ఛంబుఁ జుట్టి
తట్టుపున్గున వన్నె♦పెట్టినట్టి లలాట,పట్టిక జేగుఱు♦బొట్టు వెట్టి
కురువింద పేర్లకుం ♦ దెరుపీని పాలిండ్లఁ,బాఱుటాకులు గూర్చి♦పైఁటఁ దీర్చి
జమలి యొడ్డాణంబు♦సందున నిఱియంగ,బర్హాంబరముఁ గటిఁ ♦ బదిలపఱిచి

ఆ. వీఁకఁగల కుఱుచగనుప్రుల♦ వెదరువింటఁ, జాఁగఁ బురిఁ దాల్చి నారిగా♦సంతరించి
గసికకోలలు గొని భిల్ల♦బిసరుహాక్షు,లడవిఁదిరుగుదు రాత్మనా♦యకులఁ గూడి. 15

మ. తమ యిల్లాండ్ర మనోహరావయవ సౌం♦దర్యంబుతో సామ్యవ
ర్గము పాటింపఁగనో కిరాతులు నిజా♦గారంబులం గట్టి సిం

హా మయూరీ హరిణేభ శాబముల నాహా! పెంతు రాశంకఁ ద
ద్రమణీ మధ్య కచేక్షణ స్తనము లుత్పాదింపఁ గాకుండునే. 16

వ. ఇట్లఖిల విభవాభిరామంబున కాలవాలంబగు నప్పక్కణంబున కధీశ్వరుండు 17

సీ. తన విక్రమక్రమదర్పంబు హర్యక్ష, శిక్షావిచక్షణాక్షీణగరిమ
తన బాహుబలము కాంతారదంతావళ, దయితా నవీన వైధవ్యకరము
తన జవనంబు కురంగదంపతీపుంజా జ, వంజవ భంజనాఖంజయశము
తన ప్రతాపము మృగాదనసార్వభౌమదు, ర్వార గర్వాపహాదారుణంబు
తే. గాఁగ నానా మృగప్రాణగంధవాహ, దందశూకేంద్ర నారాచబృందవర్ష
కంధరోద్దండ కోదండకరుఁడు మించె, నాథనాథుం డరణ్యభూనాథుఁ డగుచు.

తే. ఎఱుకుఱేఁడైన సర్వలోకేశుఁ గూడి, చెంచుపూఁబోఁడియై సంచరించుగౌరి
చందమున నాథనాథపులిందవిభుని, మందగామిని చెలువొందెఁ దందె యనఁగ

## తిన్ననిజననము.

క. ఆనాథనాథకానన, భూనాథుఁడు తందెచిగురుఁబోఁడియు సురతే
చ్ఛానందము గిరికంధర, సానువనీనిర్ఝరముల సలుపఁగఁ బ్రీతిన్. 20

క. తందెకు మందస్మితజిత, కుందకుఁ బ్రాణేశ్వరోపగూహనరచితా
నందకు వచనామృతని, ష్యందకు నెల మసలె శైలజాధిపుకరుణన్. 21

సీ. భసితాంగరాగశోభావిలాసంబుతోఁ, బ్రతివచ్చు నాననపాండుగరిమ
కంఠహాలాహలకాళిమచ్ఛవితోడ, నెనవచ్చు గుబ్బచన్మొనలనలుపు
పరశివాకృతితోడ సరివచ్చు నణుతరం, బనఁజాలి ఘనతరం బైననడుము
స్వస్వరూపవిచారసంప్రాప్తశాంతితో, మార్పడుఁ జిత్తైధమానజడిమ
తే. సరధసానంగసంక్రీడ జరుగనీక, దౌహృదము గర్భముననున్న తనయుఁ డీశుఁ
డై ప్రకాశింపఁ గలఁ డని యపుడు తెలుపు, కరణిఁ బెంపొందె నమ్మందగామినికిని.

తే. గంధగజకుంభ కాఠిన్యగర్భరేఖ, చారుమృగరాజ మధ్యశృంగారగరిమ
చెఱుపఁగలఁ డల్లశిశు వని చెప్పునట్లు, సుదతిచన్నులు నడుమును సొబగు దప్పె.

సీ. పంచాననానేకపవ్యాఘ్రకోలాది, మృగములఁ జంపఁ గామించె లేమ
శైలోపకంఠనిర్ఝరసైకతస్థలి, శివుని దర్శింపఁ గాంక్షించె నబల
ఖండేందుశేఖరు గండూషితాంబుధా, రల మజ్జనము సేయఁ దలఁచె నింతి
చవియైన ఘోణిమాంసమ్ము దొప్పలఁ బెట్టి, యభవున కర్పింప నతివ గోరె
తే. నేత్రనీలోత్పలంబుల నీలగళుని, యర్చనము సేయఁ జింతించె నంబుజాక్షి
గర్భగోళమునందున్న యర్భకునకుఁ, గలగుణంబులఁ దెలిపెడు కరణి నపుడు.

ఉ. ప్రొద్దులు చొచ్చె నంత పువుఁ♦బోఁడికిఁ బెంపుడుచిల్కపిల్లకున్
సుద్దులు చెప్ప, వస్త్రములు♦సొమ్ములు దాల్ప, నిజేశుపాన్పుపై
నొద్దిక నుండ, నిత్యము గృ♦హోచితకృత్యము లాచరింప, మైఁ
బెద్దయు శ్రాంతి గాఁ దొడఁగె ♦ బిడ్డఁగనన్ సమయం బగావునన్. 25

చ. చెలువకు బిడ్డకుట్లు విల♦సిల్లఁగ భిల్లపురంధ్రు లంతలోఁ
బిలువరె మంత్రసానిఁ దల♦పెట్టరె కాయముఁగూర్ప లేమకున్
జలకముఁ గాఁచరే కొలను ♦ చయ్యనఁ ద్రవ్వరె మందగామినిన్
నిలువఁగనీకురే యనుచు♦నేర్పరులై కడు సంభ్రమింపఁగన్. 26

సీ. శుభముహూర్తంబున ♦ నిభరాజగామిని, శివభక్తి మునుపైన♦శిశువుఁ గనియె
సంసారమోహపా♦శముఁ గోసినటువలె, బొడ్డు గోసిరి పిన్న♦బిడ్డనికిని
సర్వేశు భక్తిల♦క్షణముఁ దెల్పెడు రీతిఁ, బెట్టిరి భూతితోఁ♦ బట్టిపట్టిఁ
బాపకదంబజం♦బాలంబుఁ గడిగెడు, పగిది నీళ్ళార్చిరి ♦ పాపనికిని
తే. యంతరంగమలాపహం ♦ బైనచిత్సు, ధారసము వోనిచిట్టాము♦దంబు దెచ్చి
బాలకు కడుపునఁ బెట్టి♦పద్మముఖులు, పవ్వళింపఁగఁ జేసిరి ♦ పాన్పుమీఁద. 27

క. జ్ఞానప్రసూనకళికా,జాని పదధ్యానపరమ♦సౌఖ్యసుషుప్తిం
డైనగతిఁ గన్నుదెఱవం,గా నేరకయుండి కొన్ని♦ఘస్రంబులకున్. 28

క. ఈలోకవ్యాపారం, బేలాగో యనుచుఁ జూడ♦నింపైనగతిన్
బాలకుఁడు దెఱచెఁగన్నులు, లాలితముగఁ దల్లిదండ్రు♦లకు ముద మొదవన్. 29

సీ. శివభక్తిరహితమై♦చెడియె జగం బని, నవ్వినట్లొయ్యన ♦ నవ్వసాగె
ధృతి మోహబంధంబు♦ దెగఁ దన్నుగతి ముద్దు, టడుగులెత్తి విదుల్చు♦కాఁడఁజొచ్చె
భవపరాఙ్ముఖుఁడైన♦పగిది సత్త్వముఁగూడి, పొత్తులపాన్పుపైఁ♦బోరలఁబడియె
శ్రేయోమహారాజ్య♦సింహాసనంబున, నుండుచందమునఁ గూ♦ర్చుండఁదొడఁగెఁ
తే. దడవియాడె వసుంధరా♦స్థలమునందు, విశ్వపతి తత్త్వ మనుమణి♦వెదకురీతి
దర్పకారి జగత్పూర్ణుఁ♦డాఁకుభీతి, నడుగు వెట్టెడుగతిఁ దప్ప♦టడుగు వెట్టె. 30

వ. ఇట్లు ప్రతిదిన ప్రవర్ధమానంబులగునతనిగుణంబులకు శివభక్తిలక్షణోపమానంబులు
సమానంబులై చెలువొందఁ దండెయుఁ బుళిందబృందారకుండును నందను తిన్న
దనంబున కానందకందళితహృదయారవిందులై తిన్నఁడని పేరువెట్టిన నప్పుడవ్యక్త
మధురకల్యంబగు బాల్యంబున. 31

మ. జలకంబార్చి, విభూతిఁ బెట్టి, కటిగుం♦జాబీజసంకీర్ణమే
ఖల బంధించి మయూరపక్షలతికా♦కాండంబులం జేసి సం
దులదండ ల్పవరించి కన్నుఁగవ కాం♦తు ల్కాటుకం దీర్చి మం
దులతాయెత్తులు గట్టినన్ శబరపు♦త్రుల్ గూడి యాడం బురిన్. 32

సీ. చిట్లబొట్ల కాయ♦సిరిసింగణావత్తి, గుటుగుడుగుంచాలు ♦ కుందెనగుడి
డాఁగిలిముచ్చులా♦టలు గ్రచ్చకాయలు, వెన్నెలకుప్పలు♦తన్నుబిల్ల
తూరనతుంకాలు♦గీరనగింజలు, పిల్లదీపాలంకి♦బిల్లగోడు
చిడుగుడువ్వలపోటి♦చెండుగట్టినబోది, యల్లియుప్పనఁబట్టె♦లప్పళాలు
తే. చిక్కనాబిల్లలోటిల్లు♦చిందఱాది, యైన శైశవక్రీడావి♦హారసరణిఁ
జెంచుకొమరులతోడ ను♦ద్దించుకాడుఁ, దిన్నఁడభినవబాల్యసం♦పన్నుఁడగుచు. 33

## తిన్నఁడు విలువిద్య నభ్యసించుట.

ఉ. కొంచెపువింటిబ్రద్ద బరి♦గోలలు గైకొని చాపవిద్య సా
ధించునెడన్ సలంఘునగ♦తిం జను లేడిని నింగి నిచ్చ వ
ర్తించు ఖగంబు నేయఁగని ♦ తిన్నఁడు దేవునిపాలుగాక సి
ద్ధించునె తల్లిదండ్రులకు♦దృష్టిగుణంబున నంద్రు లుబ్ధకుల్. 34

తే. విల్లుపట్టిన నెలపది♦నాళ్ళలోన, వీఁక కలిగిన తడవిల్లు♦వెదురువిల్లు
సెలసువిల్లును మొదలైన♦చేఁగవిండ్లు, చులుకగాఁదీసి శబరేంద్ర♦సూనుఁడేయు. 35

వ. ఆసమయంబున నవయౌవనం బాసన్నం బగుటయుఁ దిన్ననికి బహువిధమృగయా
విహారంబుల తెఱంగెఱుకపఱుపవలయునని వనచరు లెఱుకు జేనికిన్ విన్నవింప
నింపెసలార నాతం డాటవిక పుటభేదనంబునం గాటిఱేనిజాతరకుం జాటం బనుపనను
పమేంద్రనీలనీలకుటిలకుంతలజాలఫాలపట్టికలఁ జిగురుఁబోండ్లు మంజరీమంజుళస్తనభా
రంబులు, బిసకాండమండితదోర్దండంబులు, నెమలిపురిదండలు, కర్ణంబుల నవతంసీ
భూత మయూరపర్ణంబులు, ఘనంబులగు జఘనంబుల మీఁదఁ బొఱుటాకుల చీరలు,
కొప్పులఁ గురువకప్రసవగుళుచ్ఛంబులు, నచ్ఛంబులైన యరుణచరణకమలపక్షభా
గంబుల లాక్షారసంబులును, సాటువలేని లేడిచూపులం దుటారించు కటారిమిటారి
చూపులుగల కనుఁదమ్ముల మరునమ్ములం జమరుబాసటంబువోసి కాటుకయుఁబునుఁ
గును బచ్చకస్తూరియు జవ్వాదియు వాసించి పరిమళించు నడవిపసువు నునుఁబూఁత
యుం దనర వనచరవనరుహానయనలు తిరుగం జాటిన మఱునాటి మంగళవారంబున
నివ్వరిబియ్యంబునఁ బువ్వులవలె నుండ వండివార్చిన యుపహారభాండంబులు చమరీ
మృగంబులపాలకు ననుకూలంబైనగునుకుంబ్రాలపాయసంబులకుండలు కీచకతండులం
బులం బిండిగొట్టి కొట్రఁబోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించినకుడుముల బానలు
కాళింగిభంగసంగతలశునవాసనాపిశితంబులగు పిండికూరల చట్లును బచ్చగందనీక పరి
పాకంబులుచేసిన వనీశాకంబుల వెసళ్లును నానావిధమాంసంబులయటికలు గుడాగు
డగుడపుష్పతాలహింతాలతండులజనితాసవకలశంబులును గంపలను గావిళ్లను బెట్టి
బలి వెట్టుటకై వనక్రోడ తామ్రచూడ మహిషాజావిశప్రముఖాటవికమృగంబులం
బట్టుకొని బంతికట్టుకొని కాటేరిగుడికి నడుచునప్పుడు తప్పెటలచప్పుళ్లును వెట్టి

సారకాయల బుఱ్ఱలం గట్టిన సరకట్లకిన్నరలు మెఱయ మొరయించు మ్లేచ్ఛులపాటల
తానమానంబులును గుమ్మెటల చటులరవమును గొమ్ముల నిమ్మును జెలంగ నయ్య
వసరంబున. 36

తే. ఒక్కప్రొద్దుండి సెలయేట♦నుదకమాడి, నాథనాథుండు తండెయు♦నైజమైన
చతురలంకారములు దాల్చి♦సహజభక్తి, నాత్మజునిఁ జూచి కైసేయు♦మన్న నతఁడు 37

మ. జలకం బాడి విభూతి పెట్టుకొని ర♦త్నామూలికామాలికా
వలయంబు ల్దొడి దట్టి గట్టుక శిరో♦వర్ధిష్ణునీలాలకం
బుల లేఁదీఁగను జుట్టి కేల విలున♦మ్ము ల్బూని కాటేరి నిపూ
జలు సేయన్ వెడలెం గుమారుఁడు పితృ♦స్వాంతంబు లుప్పొంగఁగన్. 38

చ. చని మృగయాధిదైవతము♦సన్నిధి బాణశరాసనాదిసా
ధనములు నిల్పి యెఱ్ఱవిరి♦దండల నివ్వరిప్రాల రక్తచం
దనమున గుగ్గిలంపుఁబొగఁ♦దట్టుపునుంగున నెత్తుజోతులన్
ఘనవివిధోపచారములఁ♦గానుకలన్ శబరాళి గొల్వఁగన్. 39

తే. తల్లిదండ్రులుఁ దాను న♦ద్దైవమునకుఁ, బ్రణతు లొనరించి వేఁటలు♦పట్టి పిదపఁ
బక్కణములోని శబరదం♦పతులతోడ, నన్నపానాదు లొనరించు♦నవసరమున. 40

సీ. మాటలాడఁదలంచి♦మఱచిపోయెడువారు, నడవఁబోవుచుఁ దొట్రి♦పడెడువారు
నూరకుండెదమని♦యుండనోపనివారు, లేచెదమని లేవ♦లేనివారుఁ
బనిలేని పనిబట్టి♦బయలువిట్టించువారుఁ, బాడనేరకయును♦బాడువారు
నెదురైనవారికి♦నెల్ల మ్రొక్కెడువారు, వ్రీడావిహీనులై♦యాడువారుఁ
తే. జాలఁ ద్రావియు మగుడఁ జే♦సాఁచువారుఁ, దొడరియుపదంశభాండము♦ల్దొడుకువారు
నైరి మృగయాధిదైవత♦యాత్రయందుఁ, బానములు చేసి శబరదం♦పతులు రతుల

ఉ. నాతియొకర్తు చిత్తము ప♦నాథునిపై నిడి సారెసారె మో
హాతిశయానఁ బోలె నధి♦కాసవ మిచ్చి నిజేశుఁ గూర్చి య
ల్లాతని నాథుపేరనె ప్రి♦యంబునఁ బిల్చుచుఁ గౌఁగిలించి హా
లాతురతాత్మికాగతి వి♦లాసము చూపుచుఁ గూడె వేడుకన్. 42

చ. పుడిసెఁడు గాని లే దిపుడు♦పుచ్చుక త్రాగిన మద్య మింతలో
నొడఁ దెలుఁగం డటంచు నొక♦యుగ్మలి నాథునిఁ దిట్టి యన్యునిన్
జడియఁడు చూడు మంచు సర♦సంబున మెచ్చుతెఱంగు దోఁప న
వ్వడు బిగికౌఁగిటం గఠిన♦పుంజనుగుబ్బల నొత్తె మక్కువన్. 43

ఉ. ఉత్తమనాథుఁ డీతఁ డెదు♦రుత్తరమీఁ డొకనాఁ డదేమొకో
యుత్తటి రేఁగిరేఁగి తన♦యిచ్చకువచ్చిన వెల్ల నాడెడిన్

గ్రొత్తలుగావె యీమధువు♦కుండల మాటలు నూటిపోసి రో
యత్త యటంచు నొక్క-శబ♦రాంగన వల్లభు దూఱె సారెకున్. 44

ఉ. మంకెనపువ్వులో విడిసి♦మత్తిలియుండెడు తేఁటిరీతి మీ
నాంకసరోజరాగకలి♦తాభరణాంతరనీలలీల హా
లాంకురితారుణచ్ఛవిస♦మంచిత లోచన తారకద్యుతుల్
బింకముఁ జూపఁ బానముల♦పెక్కువఁ జొక్కిరి భిల్లదంపతుల్. 45

తిన్నఁడు పరిజనంబులతోడఁ గూడి వేఁటకు వెడలుట.

వ. ఇవ్విధంబున మధుర మధురసాస్వాదనామోద మేదుర వినోదంబులం గేలిసలిపి నిషాదమిథునంబులు సదనంబులకుం జనునప్పు డయ్యాటవికాధిపతనయుం డాఖేటకంబునకుం గాటితేని పాటియగుంగాక! యని యొనరించు దీవనలుల్లసిల్లఁ బల్లియం బ్రవేశించి చెంచుతేఁడు మఱునాఁడు రేపకడఁ గొనుకుం గూర్పఁదగిన వారలం గూర్చి వేఁజకుం జను మనవుడుఁ దెరచీరకట్టలు ప్రోఁగుచుట్టలు దొడ్డివల లేటివలకుం దేటివల పందివల సవదండవల మకరివల యెలికవల మొదలుగా వలయు వలలును, సివ్వంగులుఁ గుక్కలుఁ గృష్ణకురంగంబులు ముంగిసలు నెద్దులు మొదలుగా వేఁటకు దిద్దిన జంతువులు, నోరణంబులు సెలకట్టెలు సాళువంబులు గిద్దలు వేసడంబులు మున్నుగా విడివేఁటకు నెన్నందగిన విహంగంబులును, బూరేడు కారుకోడి కేరజంబు కొంజు కక్కెరచిండ లాదిగాఁగల పాదివేఁటకుం బ్రోది చేసిన పతంగంబులు, నురులు నురికోలలు బోనులుఁ జిక్కంబులు జిగురుఁగండెలుఁ దీవుఁద్రాళ్ళు నొడిత్రాళ్ళుఁ దలముళ్ళును గొని శరశరాసనప్రభృతిసాధనంబులతోడ నడవి కేతెంచి నిశ్శంక సకలమృగసంకుల సంకలితంబగు వేంకటాచలంబువంకం డెంకి వెట్టుకొని. 46

సీ. ఒకనాఁడు తెరవేఁట ♦ నుగ్రసత్త్వంబులఁ, బుడమిపైఁ బడఁ గాళ్ళ♦పడ వధించి
యొకసారి సారమే♦యోద్ధతి నుద్ధుర, స్తబ్ధరోమంబుల ♦ సంహరించి
యొకమరి దీమంబు ♦ లొడ్డి పాదులుదీర్చి, బహువిహంగంబులఁ ♦ బట్టి తెచ్చి
యొకవేళ డేగవేఁ♦టకుఁ జని మొగజోపి, నానాండజముల ప్రా♦ణములు గడపి

తే. ముంగివేఁ టేదువేఁట సి♦వంగివేఁట, యుఱ్ఱివేఁటయు గంటవేఁ♦ టెద్దువేఁట
మొదలుగాఁగల వేఁటల♦యదనెఱింగి, తిన్నఁ డొక్కొక్కతూకువ♦ ర్తింపఁ దొడఁగె.

చ. పులులు కురంగము ల్కరటి♦పోతము లేదులు మన్నుబిళ్లు దు
ప్పులు కణఁతు ల్కిటు ల్చెవుల♦పోతులు కొర్నవగండ్లు భల్లుకం
బులు చమరీమృగంబు లెను♦పోతులు కస్తురిపిల్లు లాదిగాఁ
గలమృగరాజిఁ బెక్కువిహ♦గంబులఁ గానుక లంపెఁ దండ్రికిన్. 48

ఆ. మునుపు వడిన మెకముఁ♦గొనివచ్చి మిడిగుడ్లు, ♦పొడిచి నీట శిరము♦దడిపి తోఁకఁ
గోసి ధూప మిచ్చి♦ మీసంబుఁ బెకలించి, కానుకిచ్చి కాటి♦ జేనిఁ గొలిచి.

ఉ. క్రొవ్విన యేకలంబులను ♦ గొన్నిటిఁ గూల్చి కమర్చి పెంచులం
జివ్వుచు నెజ్జిమ న్నలఁది ♦ చివ్వున నీరివురంగ నేర్చి నో
ళ్లువ్విళులూరఁ బ్రేల్చి చము♦రుట్టిపడం గఱుకుట్లు గాల్చి క
ల్జువ్వలనీడ నొక్క పరి♦శుద్ధ శిలాతల భూమి నందఱున్. 50

క. అట్టు కఱుకుట్లు గాల్చిన, పిట్టల నింజెట్ల మఱియుఁ ♦ బెర తేనియలం
బెట్టుక మెసఁగుచు నాథుని, పట్టికి నింపెసఁగ నిట్లు ♦ ప్రతిదివసంబున్ 51

ఉ. ఆవనవీథిలోఁ గలమృ♦గావళిఁ బత్తుల సంహరించి పూ
ర్వావనిభృత్తటాటవుల ♦ నాటవికుల్ మృగయావిహారముల్
చేవ దలిర్పఁ జేయుటకు ♦ శీఘ్రమ పాళియ మెత్తి కుంభజ
గ్రావసుతాప్రతీర గిరి♦కాననమధ్యమున న్వసించుచున్. 52

ఆ. అంజినాటికొండ♦లందు సదాశివు,కొండ జమునిదిక్కు ♦ వెండికొండఁ
జండసత్త్వ చండ♦సంహార తాండవం, బాడఁ గోరి వేఁట♦లాడు నపుడు. 53

క. ఒకవేళఁ దిన్నఁ డాఖే,టక ఖేలా వ్యసన రతుల ♦ డస్సినవాఁడై
వికచప్రసూనవకుళ,ప్రకరంబుల నీడ నొంటిఁ ♦ బడి నిద్రింపన్. 54

స్వప్నముచేతను వేఁటమిషను నీశ్వరుఁడు తిన్నని వశీకృతుం జేసికొనుట.

మ. ఒడలం దెల్ల విభూతిపూఁత పులితో ♦ లొడ్డాణ మల్లాడు కెం
జడ లాత్తైకవిచార నిశ్చలదృగ♦బ్జాతంబు లచ్చైచ్చన క
చ్ఛడ మంసంబున రుండమాల గళదే♦శస్థాణువుం గ్రాలఁగా
నొడయం డొక్కరుఁ డక్కుమారుకలలో ♦ నుద్యత్కృపామూర్తియై. 55

క. బాలక! యిచట శిలావట,మూలంబునఁ గొండదండ ♦ మొగలేటి దరిన్
శైలసుతాపతి భక్తుల,పాలిటి పెన్నిధి వసించు ♦ భక్తిం గొలుమీ. 56

క. అని యంతర్ధానము సే,సినఁ దిన్నం డదరిపడుచు ♦ శీఘ్రంబున మే
ల్కని నలుదిక్కులు వెదకుచు, మనమున నాశ్చర్యరసని♦మగ్నుం డగుచున్. 57

శా. ఈల ల్పీఁకెలు దిక్కులం జెలఁగఁ దా ♦ మెచ్చో మృగశ్రేణిపై
గాలిం బోవక సన్న దప్పటయు రో♦కారొక్కముల్ దిట్టి శా
ర్దూలక్రోడ మృగాదుల న్వలలకుం ♦ దోలంగఁ దిన్నండు త
త్కేళీలోల రవంబు దన్నుపుడు బో♦ధింపంగ నేతెంచినన్. 58

మ. వలకుం జేగక ప్రోఁగులుం దెరలు ద్రె♦వ్వం ద్రొక్కి యాఖేటక
స్థల ముల్లంఘన సేసి లుబ్ధకుల య♦త్నం బెల్ల వారించి ది
క్కులు దఘ్ఘుర్ఘుర ఘుర్ఘుర ధ్వనులచే ♦ ఘూర్ణిల్లఁగా నొక్క యే
కల మేగం గని తిన్నఁ డప్పుడు ధనుః♦కాండోల్లసత్పాణియై. 59

మ. జవ మొప్ప న్శ్వాను వెంట నంటి తఱుమన్ ♦ సంవర్ధితశ్రాంతి ను
ద్దవిడిం బాఱఁగలేని చందమునఁ జెం♦తం జేరఁగా నిల్చి యే
య విచారించిన దూఁటి దాఁటుకొని త♦న్నాశాళలం ద్రిప్పి పా
శవిముక్తుం డగు యోగిభావన యదృ♦చ్ఛావృత్తి వర్తించుచున్. 60

క. అలయించుచుఁ దిన్నఁడు దన, కలలోపలఁ గన్న శివునిఁ ♦ గనఁగొనుదాఁకన్
జలమునఁ గొని చని య య్యే,కల మప్పు డదృశ్యమైనఁ ♦ గడుఁజోద్యమునన్. 61

క. కలలోఁ జెప్పిన యొడయం, డెలయించుక వచ్చినట్టి♦యేకలము హిమా
చలతనయాధిపమాయా,విలసనములు గాఁగ నపుడు ♦ వివరించి మదిన్. 62

శా. సంతోషంబునఁ గాంచెఁ దిన్నఁడు సమ♦స్తవ్యాపకానంత వే
దాంత స్థాపిత చిన్మయాంగము నవి♦ద్యాధ్వాంత సంతాన సం
క్రాంత స్వాంత నిశాంత జంతు సుఖమా♦ర్గప్రాపకాభంగరు
క్కాంతాపాంగము దివ్యలింగము వివి♦క్తధ్యేయ నిర్లింగమున్. 63

తే. కాంచి రోమాంచకంచుకో♦దంచితాంగుఁ, డగుచు నానందబాష్పంబు♦లతిశయిల్ల
నమ్మహాలింగమునకు సా♦ష్టాంగనతులు, సేసి ముకుళితహస్తుఁడై ♦ చేరఁబోయి. 64

తిన్నఁడు శివలింగమునకు సేవఁజేయుట.

శా. ఓసామీ! యిటువంటి కొండదరిలో ♦ నొంటిం బులుల్ సింగముల్
గాసిం బెట్టెడు కుట్రనట్టడవిలోఁ ♦ గల్జువ్విక్రీనీడ నే
యాసం గట్టితి వేటిగడ్డ నిలు? నీ♦ వాఁకొన్నచోఁ గూడు నీ
ళ్ళేసుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీ ♦ కిం దేటికే లింగమా? 65

ఉ. కొండలఁ గానలం దిరిగి ♦ క్రొవ్విన పందుల లేళ్ళ దుప్పులన్
జెండినఁ బెక్కుచందములఁ ♦ జిన్నక పెద్దక గారుకమ్మఁగా
వండుదు రట్ల పిట్టలను ♦ వండుదు రిచ్చట నుండనేల? నా
కొండొక టానతీక యుడు♦మూరికి రాఁగదవయ్య లింగమా! 66

క. ఓలింగమ! విను నివ్వరి,ప్రాలును నోడిపిల్లు గునుకుఁ♦బ్రాలును వెదురుం
బ్రాలును సవరపుమెకముఁ, పాలును గల వచట నీకుఁ ♦ బాయసమునకున్. 67

తే. పుట్టతేనియ పెరతేనె ♦ పుట్టజున్ను, తొఱ్ఱతేనియ గలవందుఁ♦దోఁచితోఁచి
కాలి దులమలనై పిండి♦పోలెరాలు, నట్టి నింజెట్లు గలవు నీ♦ కారగింప. 68

సీ. నేరేడుపండులు ♦ నెలయూటిపండులుఁ,గొండమామిడిపండ్లు ♦ దొండపండ్లుఁ
బాలపండులు నెమ్మి♦పండులు బరివంక, పండులుఁ జిటిముటి♦పండ్లుఁ గలివె
పండులుఁ దొడివెంద♦పండ్లుఁ దుమ్మికిపండ్లు, జానపండులు గంగ♦రేనుపండ్లు
వెలగపండులు పుల్ల♦వెలగపండులు మోవి, పండ్లు నంకెనపండ్లు♦బలుసుపండ్లు

తే. బీరపండ్లును బిచ్చుక♦బీరపండ్లు, గొమ్మిపం డ్లీతపండ్లును♦గొంజిపండ్లు
మేడిపండ్లును మొదలుగాఁ♦గూడిమాడి, చెంచెతలు దెత్తు రిత్తువి♦చేయవయ్య.

శా. ఇల్లో ముంగిలియో యనుంగుఁజెలులో ♦ యీడైన చుట్టంబులో
యిల్లాలో కొడుకో తరింపవశమే ♦ యేపోఁడును ల్లేక ? మా
పల్లెం గోరినవెల్లనుం గలవు తెప్ప ల్గాఁగ నీకిచ్చెదన్
జెల్లంబో యిట నొంటినుండ కటు వి♦చ్చేయంగదే లింగమా ! 70

తే. చఱుకుఁజూపునఁ గాలిన♦కొఱత నుఱుకు, నుఱుకుఁజూపులఁబుట్టించు♦నెఱుకువారి
యిఱుకువలిగుబ్బపాలిండ్ల♦యిగురుఁబోండ్ల, సేవకిచ్చెద నీకు వి♦చ్చేయవయ్య. 71

మ. నను మన్నించెదవేని నీ విపుడు రా ♦ నావెంట, రాకుండినన్
నిను నేఁ బాసి చనంగ నోప, నిచట ♦ న్నీతోడిదే లోకమై
మనువాఁడం, గనువాఁడ నీకరుణ, నీ♦మానంబు చిత్తంబు వ
చ్చినచో మానుదుగాని నిన్నిపుడు క♦ స్తింబెట్ట నాకేటికిన్. 72

వ. అని యమ్మహాదేవు నుడుమూరికి రమ్మనుచుం బ్రార్థించినం బలుకకుండినం దదీయభ
క్తిపరవశుండై సంపెఁగతావి బ్రుంగిన భృంగంబుతెఱంగున నున్న యవసరంబునం
దిన్నం డొంటిపంది వెంటందగిలి యొంటి నెక్కడఁ బోయెనో యని బోయలు చో
ప్పరయం దివిరి యడుగుల వెంబడిం బడితప్పక చనుదెంచి కాంచి యిట్లనిరి. 73

—తిన్ననిఁ గని బోయలు దుఃఖించుట.—

శా. అన్నా! నిన్నలయించి తెచ్చిన వరా♦హం బెందుఁ బోయె? న్నమున్
గన్న న్నన్నఁ జూడవేటికి? వడిన్♦గన్నీరు గాఱంగ నే
మన్నన్ బల్క వదేమి కారణమొ? వేఁ♦టాడంగ నేతెంచి యి
ట్లున్నం దల్లియుఁ దండ్రియు న్నఱుఁగరే ♦ యుల్లంబులో నక్కటా ? 74

తే. నీడు గాలికిఁ బసివట్టి ♦నిట్టనీల్గి, పట్టెడల బిగఁబట్టిన♦మట్టువడక
నిలువకే తెంచి వేఁటకు♦క్కలు కుమార, చుట్టుక గునిసియాడంగఁ ♦ జూడవేమి.

సీ. వలలునుఁ దెరలుఁ బ్రోఁ♦గులఁ జుట్టఁగా లేదు, పోటుకో లొకటియుఁ♦బుచ్చ లేదు
తెగిన మొకంబులఁ ♦ దేలేదు విడివేఁట, పిట్టలకును మేఁత♦పెట్టలేదు
చెంచు లేరికి నేమి ♦ సేద దేఱఁగ లేదు, చెడకుండ మొకములఁ♦ జేయలేదు
కుక్క లిట్టులు సివం♦గులు మేపుఁగొనలేదు, బలివెట్టి కాట్రేనిఁ♦గొలువలేదు
తే. వేఁటలాడంగ వచ్చిన♦వేడుకెల్ల, నక్కటా తండ్రి కెఱిఁగింప ♦నంపలేదు
బ్రమానుపడియుండ నేటికి♦మేనుమఱచి, యేల మాజాలి మాన్పవే♦యెఱుకపతిచి.

శా. ఓతండ్రీ! నిను డించి పో మనసు మా♦ కొక్కింత గానేర్చునే ?
మీ తోఁబుట్టులుఁ దల్లిదండ్రులు చెలు♦ ల్మీరెల్ల నేతేరఁగా

మా తిన్నం డిపు డెందుఁ బోయె ననిన ♦ న్మాప్రాణము లోవె ? రా
వే తిట్టింపక పల్లెలోన మనుము, దే♦వే వన్నెయు న్వాసియున్. 77

తే. ఎంత యలమటఁబడిన మ♦మ్మేలచూడ, వింతయు నెఱుకు తేనికి ♦ నెఱుకపఱుపఁ
బోయెదము చెప్పవలసిన♦బుద్ధి చెప్పి, యనుపుమని పాదములు పట్టు♦ కొనిన నతఁడు.

వ. ఎట్టకేలకు శివలింగసంగతాభంగురహృదయాంతరంగుఁడగుశబరపుంగవుండు కృపా
పాంగుండై చిఱునవ్వు నవ్వి యవ్వనచరుల కిట్లనియె. 79

క. ఈలింగములోఁ బ్రాణము, కాలముగడదాఁక నోడఁ ♦గట్టినదూలం
బై లంకె నుండఁ జేసితి, నేలా తుందుడుకు? పల్లె♦ కేగుఁడు మీరల్. 80

క. నావెంట నితఁడు వచ్చిన, నే వచ్చెద మిమ్ముఁ గూడి ♦ యిప్పుడు లేదా
యేవంక నభవుఁ డుండిన, నావంక నె తోడునీడ ♦ యై వసియింతున్. 81

శా. నాకుం జుట్టముఁ దల్లిదండ్రులుఁ జెలు ♦ ల్నాథుండు నీవై వమే
మీ కిచ్చోఁ బనిలేదు కస్తిపడఁగా ♦ మీపల్లెకుం బొండు, కా
రాకూరంబులు చేసినం గదలి నే♦రా, నిచ్చటం బ్రాణముల్
పోకార్తుం మది నాదు వేలుపునకై ♦ బొంక న్నిజం బింతయున్. 82

క. అని శివుఁ గ్రమ్మఱఁ దిన్నఁడు, మనమున నిలుపుకొని తనువు♦ మఱచిన బుద్ధిన్
మునుపటి తెఱఁగున నుండిన, వనరుచు వనచరులు చనిరి ♦ వలసిన రీతిన్. 83

వ. తదనంతరంబ. 84

తిన్నఁడు శివుని కనుదినంబు నాహారం బొసంగుట.

క. ఎన్నేండ్లనుండియో పస్తున్నాఁ డీయడవిలోన ♦ నొంటి మహేశుం
డిన్నిగులు మాన్ప వలదా, కన్నారం గనినబంటు♦ గలఫల మనుచున్. 85

శా. తిన్నం డంతట దేవదేవునకు భ♦క్తిం దృప్తిఁ గావింప నా
సన్నగ్రావ మహాటవుల్ దిరిగి దం♦ష్ట్రాగ్రటంక కోటీ పుట
చ్ఛిన్నక్ష్మాజ వరాహము న్గడపి కా♦ల్చె న్వ్రేల్చెఁ బ్రేల్చెం జవిన్
జెన్నై యుండెడు మాంసఖండముల ని♦చ్చెం దొప్పలం జొప్పడన్. 86

ఉ. విల్లో కచంక నంపపొది♦ వీఁపున దొప్పలు కేలుదోయి పు
క్కిళ్ల పవిత్ర కాంచనము♦ ఖీజల మొప్పఁగ వచ్చి భక్తిరా
జిల్లఁ దదంబుమజ్జనము♦ సేయుచు దొప్పలనంజు డద్రిరా
జల్లుని నారగింపు మన ♦ నాపరమేశ్వరుఁ డూరకుండినన్. 87

క. కాలవో క్రొవ్వవో మాఁడం, గాలెనో చవిగావో♦ కమ్మగావో నీకుఁ
జాలవో యలవడవో తిన, వేలా కఱుకుట్లు పార్వ♦తీశ్వర! చెపుమా? 88

క. ఆఁకలిగాదో భక్తిం, దేకువ గలవాఁడఁగానొ ♦ తినవేల కృపన్
సాఁకఁగ దే నన్నిపుడ, త్రాఁకలఁ బెట్టక పలాశ♦నాసక్తుఁడవై. 89

క. నెప మొకటి గలదె నాపై, నుపవాసముతోడ బడలి • యుండఁగ? నీకే
యపరాధము సేయంగదె, కృపతోఁ గఱుకుట్టు లారగింపం గదవే. 90

క. నీ వారగింపకుండిన, జీవన మేమిటికి నాకు • శివ! నీ పదరా
జీవముల మీఁదఁ బ్రాణము, తే విడుతు నటంచు వ్రాలి • యేడ్వం దొడఁగెన్. 91

క. తిన్నని భక్తికి శివుఁడు ప్ర,సన్నుండై యేను పుడిపి • సరగునఁ గఱుకు
ట్లన్నా! తినియెద లేలె, మ్మన్న న్ముదమంది లేచి • యవధానమునన్ 92

క. అందియ్య శివుఁడు తగ నా,నందించుచు నారగించి•న న్ముదమున మి
న్నంది పుళిందేంద్రుఁడు కా,నం దిరుగుచు నిట్లు దినదినంబును గొల్వన్. 93

శివబ్రాహ్మణుఁ డాలయమందలి రోఁతలఁ గని చింతించుట.

సీ. పంచాక్షరీ పూత•భసిత త్రిపుండ్రాంకి,తాంకభాగములు స్నా•నార్ద్రశిఖయుఁ
గ్రమకృతగ్రంథిసూ•త్రవ్రాత రుద్రాక్ష,భూషణంబులు శైవ•భూషణములు
నాగుల్బలంబమా•నాంబుశోణం బైన,తోత్రంబు నుపవీత•సూత్రములును
గరగృహీతాభిషే•కక్షీరసంపూర్ణ,భాండంబుఁ బుష్పక•రండకంబుఁ

తే. గుండబొజ్జయు నొకపాటి•గుజ్జునాపు, నుత్తరీయంబుఁ దనరంగ • యోగిహృదయ
గోచరునిఁ గొల్వ శివచిహ్న•గోచరాంకుఁ,డొకఁడువచ్చె శివబ్రాహ్మ•ణోత్తముండు.

తే. వచ్చి గుడిచొచ్చి యీశ్వరే•శ్వరుని నిర్మ,లాంగ మేటికిఁ జాతిక•లయ్యె నకట
యిచటి కెంగిలి పుల్లియ•లేల వచ్చె,నొక్కొ యీదుఃఖ మెటువలె•నోర్చువాఁడ.

మ. కులదైవం బని యల్కి పూసి • గుడి ముగ్గుల్పెట్టి కైసేయ లో
పలి కెంగిలి మంగలంబులగు దో•ప్పల్ రాఁ గతం బేమి? ని
ర్మల తోయ స్నపనం బొనర్చిన శరీ•రం బేటికి స్నీరువ
ట్టులు గట్టం భవదాత్మశుద్ధి కిది గూ•డుంగా మహాహేయముల్. 96

క. దేవా! యీకుసుమాలము, దేవెడు కేల్దోయి నీదు• దేహం బంటన్
గా వెఱపయ్యెడు నెంగిలి, కీ వెట్లోర్చితివి పార్వ•తీశ్వర చెపుమా? 97

క. నేఁడేడు దినములయ్యెన్, బోఁడిమి చెడసాగి నీదు•బూటకమో యె
వ్వాఁడై నను జేసెనో యిది, వేఁడెద సత్యంబుఁ జెప్పు•వే కరుణాబ్ధీ. 98

ఉ. నీసఖుఁడో సుతుండొ తరు•ణీమణియో నిజసేవకుండొ నీ
వో సకలేశ శుద్ధమగు•చున్న నిజాలయసీమ రోఁతగాఁ
జేసిన వారు నీకెఱుకసేయక• సేయ సమర్థులెవ్వ రీ
దోసముఁ జెప్పవే కరుణ•తో మదిఁ దుందుడుకెల్లఁ దీఱఁగన్. 99

ఉ. ప్రాఁతలు మీఁదఁగప్పినఁ గృ•పామతి నోర్చితి, నీచుపొత్తునన్
బ్రాఁతి మెసంగి తీవు, మను•భక్తుఁడు కుంటెనఁ బంపఁ బోతి, మై

పూఁత యొనర్చుకొంటి శివ♦భూతిఁ, గపాలమునం భుజించి తీ
రోఁతలు పెక్కులుండ నిట♦ రోయుదువే యిఁక భక్తవత్సలా. 100

క. నీకిష్టం బిదిగానీ, నా కాపాపాత్ముఁ జెప్పి♦నం బదిలతుల్
లేకున్న విడుతుఁ బ్రాణము, నీకై కూ డుగ్గఁబట్టి ♦ నీలగ్రీవా. 101

క. అని తా నూరక యుండినఁ, గని తారాధిపకళాశి♦ఖామణి చేతో
జనితాదరమున నతనికి, విని తాత్పర్యంబు సంభ♦వింపఁగ ననియెన్. 102

శివుఁడు తిన్నని భక్తిని శివబ్రాహ్మణునకుఁ జూపుట.

క. శవశవపడ నేటికి మది, శివగోచర! నీకు నన్నుఁ♦ జెంచొకఁడు శ్రుతి
వ్యవహారేతరమతమునఁ, దవిలి మహాభక్తిఁ గొలున♦ దయ పుట్టుటయున్. 103

తే. ఆకిరాతుని పూజ నంగీకరించి, నాఁడఁ దద్భక్తి నీవును♦ నేఁడు చూతు
గాని నా వెన్కదిక్కునఁ♦ గానకుండ, నడఁగియుండుము తడయక♦యతఁడు వచ్చు.

మ. అన మోదించి హరద్విజుం డొదుగఁ జెం♦చవ్వేళ నేతెంచి పా
వననిర్మాల్యముఁ జెప్పుఁ గాలఁ గొని పో♦వంద్రోచి గండూషజీ
వనసేకం బొనరించి పత్త్రిరిడి త్రో♦వ గ్లాచి తా నేసి కా
ల్చిన కోలామిషఖండముల్ దనకు భ♦క్షింపంగ నందిచ్చినన్. 105

క. తినకున్న నేమొకో యని, యనుమానముఁ బొంద నభవుఁ♦ డంతటిలోనన్
గనుదమ్మి గ్రమ్మి పొటపొటఁ, జినికె న్గన్నీరు శబరు♦చిత్తం బదరన్. 106

క. ఒకమరి కొకమరి కించి, ద్వికచారుణపద్మ పత్ర♦ వీథివిగళ
న్మకరంద ధారగతిఁ దన, ముకుళిత నేత్రమున బాష్ప♦ములు ఘనమైనన్. 107

క. అంటునకుఁ దంటెనందనుఁ, డాందోళము నొంది కంటి♦నంటిన నొప్పిన్
బందికలుకుట్లు దినఁ డేఁక, సందియ మేమిటికి మందు♦ సమకూర్పఁదగున్. 108

వ. అని తిన్నం డెన్నఁడు లేని హానిం బూనినవాని తెఱంగున నంతరంగంబునం దరంగం
బులైన దుఃఖంబునం గరంగుచు. 109

తిన్నఁడు పరమేశ్వరు నేత్రరోగమునకుఁ జికిత్సలం జేయుట.

సీ. కోకపొట్లం బావిఁ♦ గొననూఁది యొత్తుచుఁ, గవణోష్ణ కరభభా♦గమునఁ గాఁచి
నత్తితం గేడాకు♦మెత్తి రేచకి నిమ్మ, వంటిపుల్పున నూఱి♦ పట్టువెట్టి
తెల్ల దింటెనపువ్వుఁ♦ దెచ్చి తద్రసమిడి, కలివెపువ్వులు గోసి♦నిలిచి పిడిచి
పేరిన నెయి వెట్టి♦ పెరుఁగువత్తులు వైచి, చనుఁబాలతో రాచి♦ సంకు చమిరి

తే. పిస్లుమందులు తానరి♦ కన్నమందు, లడిగి తెచ్చిన మందులు♦ నడవిమందు
లెన్ని చేసిన మానక♦ యిందుమౌళి, కన్నుతోడిఁబడి నెత్తురు♦గాఱుటయును.



తిన్నఁడు శివునికిఁ దనకన్ను పెకలించి యిచ్చుట.

తే. మాటిమాటికిఁ జేసిన ♦ మందు లెల్లఁ, జెల్లెఁబో వెల్లిఁ గలిపిన ♦ చింతపండు —
నీటవ్రాసిన వ్రాలు నై ♦ నెరయ వఱదఁ, బోవుఁ గాకేమి నెత్తురు ♦ పుట్టనేల. 111

క. పట్టపుదేవిన్ హిమగిరి, పట్టి న్నామ్మయమ్మఁ జూచి ♦ పదరినకతనన్
నెట్టవిసెనో? నేమందుఁ, మట్టెయుఁగనో? కంటికిం బ్ర♦మాదం బొదవెన్. 112

క. కామునిఁ జంపి మనంబున, నే మోహము లేని వేల్పు ♦ నిటువలె నన్నున్
స్వామిద్రోహము గాదే, యేమిటి కిట్లంటిఁ గంటి ♦ కిఁక నెటువలెనో. 113

ఆ. వేఁకివెచ్చనైన ♦ వెచ్చని మందులఁ, గాదె మాను నట్లు ♦ గంటి కింకఁ
గంటికంటె మందు ♦ గలదె ముక్కంటికిఁ, గంటి ననుచుఁ బోయ ♦ గదియఁ బోయి. 114

ఉ. ప్రాణము వోవునో తనువు ♦ భంగము వొందునొ నాకతూణికా
బాణము జిఱ్ఱునం దిగిచి ♦ భల్లముఖాగ్రము రక్తపద్మదృ
క్కోణముఁ జేర్చి గ్రుచ్చి యొక ♦ గ్రుడ్డు వడిం బెకలించి శోణిత
ద్రోణికయైన దైవతశి ♦ రోమణి కంట నమర్చె నంతటన్. 115

ఉ. మున్నిటికంటికంటెఁ గడు ♦ మోహనమై తనకన్ను వచ్చినన్
మన్ననఁ జూచి మెచ్చక యు ♦ మాపతి రెండవ కంట శోణిత
క్లిన్నతఁ జూపిన న్నగి పు ♦ ళిందుఁడు నీకృపచేతఁ గన్న మం
దున్నది దీనికి న్వెఱవ ♦ నొక్కటి నావ్రత మింక శంకరా! 116

క. లాఁగాటలోచనంబునఁ, గీలాలము దొరఁగనేని ♦ కేవలభక్తిన్
గీలించి మనోదృష్టికి, మూలంబగు నాదుప్రాణ ♦ ములు నీ కిత్తున్. 117

క. అని చెప్పఁగాల నిటలా, క్షునికన్నోనఁ దన్నిపట్టి ♦ సునిశితబాణం
బునఁ దన రెండవ కనుగ్రు, డ్డును బెకలింపంగఁ బూను ♦ డుసు సదయుండై 118

ఆ. కన్నుఁ దివియఁ బూను ♦ కన్నప్పతీవ్రత, కన్న మున్న గాఁగ ♦ ఖండపరశు
వాశుగంబుఁ జేత ♦ నంటంగఁ బట్టుక, నిలుపు నిలుపు మనెను ♦ నెలుఁగుతోడ. 119

శివుఁడు తిన్ననికిఁ బ్రత్యక్షమగుట.

చ. హరి యరవిందసూతి మును ♦ లష్టదిశాపతు లాదిగా వియ
చ్చరు లిరువంకల న్గొలువ ♦ సత్వరత న్నిజలింగ నిర్మలాం
తరముననుండి శీతవసు ♦ ధాధరకన్యక ముద్దుఁ గేలుఁ దా
మరకడవ్రేలు వట్టుకొని ♦ మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁడై. 120

క. శివగోచర! యీభక్తుని, యవిరళతరభక్తిమహిమ ♦ యాద్యంతము గం
టివి గద సద్భక్తుం డితఁ, డవుఁ గద నీమనసు వచ్చె ♦ నా యిఁక ననుచున్. 121

క. దరహాసము నెరపుచుఁ దన, పరిసరమున కాటవికుని ♦ బ్రాహ్మణభక్తున్
గరుణాం బిల్చుక మీ కే, వర మింపన వారు కృత్తి ♦ వాసుని యోడన్. 122

శా. మీపూర్ణం బగు దివ్యతేజము జగ♦న్మిథ్యాత్మకత్వ ప్రతి
ష్ఠాపారీణతఁ జూపి మమ్ముఁ బొదవం ♦ జాంచల్యదూరంబులై
చూపుం జిత్తము మిన్నకున్న యవి యి ♦ చ్చోఁ బాసె దేహంబుపైఁ
దీవుం జీఁకటి యింతకంటె వరమే♦దీ యిట్లు మన్నింపవే. 123

చ. జగములు నంతరాత్మయును ♦ సాక్షియు నీ వనుచు న్నిజంబుగా
నిగమము లాడఁగా వినియు ♦ నేఁ డితరంబుగ మాకభీప్సితం
బగువర మెట్లు వేఁడఁగలమయ్య ♦ భవన్మయమైన పూర్ణచి
ద్గగనములో మముం గలిపి ♦ క్రమ్మఱఁ బుట్టెడు బాధ మాన్పవే. 124

క. ఇతఁడు కిరాతుం డేదు,స్మృతి మమ్మడిగియె మహేశ ♦ మన్నించి ప్రస
న్నతఁ జూపితి రీతెఱఁగున, హితలీల భవప్రయాస ♦ మెడలింపఁగదే. 125

క. మీతలఁపుకన్న నధికమె, మాతలఁ పిట్లునుగ నేల ♦ మను మీచిత్తం
బే తెఱఁగున వెలుఁగొందెడు, నా తెఱఁగున నుండఁజేయు ♦ మదిగాక శివా. 126

క. ఆనందామృతవారిని,ధానంబున మనము మగ్న♦తం బొందె వరం
బీనమరినఁ దాదాత్మ్యం, బో నిరుపాధికదయాస♦ముజ్జ్వల! యీవే. 127

మ. అని శైవద్విజుఁడుం గిరాతుఁడును సా♦ష్టాంగ ప్రణామంబు లీ
శునకుం జెక్కు లొనర్చి తద్విమలతే ♦ జోధ్యాననిర్మగ్నభా
వనులై యుండఁ బ్రపంచబుద్ధి మగుడ ♦ న్స్ఫూర్తింపఁగా నీక వా
రి ననంతం బగునాత్మరూపమునఁ గూ♦ర్చెం దీర్చె బంధంబులన్. 128

శా. ఓహో! వీరలు భక్తిఁ గన్న యపవ♦ర్గోదగ్రభాగ్యంబు లా
హా! హాలాహలభక్తభోక్తృ నిజభ♦క్తాగణ్యకారుణ్య మం
చా హేరంబ సితాంబుజాంబక విధా♦త్రాశాప యోగీశ హా
హాహూహూప్రభృతు ల్నుతింప నభవుం ♦ డంతర్ధి నొందె న్వడిన్. 129

క. అనవుడు యాదవ భూపతి, పునరభివాదనముఁ జేసి ♦ భూతేశు కృపన్
గని రెవ్వ రింక మోక్షం, బనఘా! యచ్చోట నన్న ♦ నతఁ డిట్లనియెన్. — 130

నక్కీరునికథ, మధురాపురవర్ణన.

సీ. కపటచతుష్షష్టి♦గతుల నాడిన వాల,వాయిదొక్కీశుని♦వాసభూమి
యతని పట్టపుదేవి ♦ యైన మీనేక్షణా,ధరతనూభవకుఁ బ్ర♦ధానగృహము
ద్రవిడభాషాపీఠ♦తలశంఖఫలకంబు, గల కనకాబ్జపు♦ష్కరిణి కిరవు
దక్షిణాంబుధి వధూ♦తామ్రపర్ణి నది, సవతు వైఘుకు నెన్నఁ ♦ జాలు నునికి
తే. నిజదృగబ్జప్రపూజిత ♦ నీలకంఠ, కూడలళఘుయ వైకుంఠ♦కుంఠితాఘ
నిఖిల సంపత్పరంపరా ♦ నిహితకింప,చానుతాపంబు మధురాభి♦ధానపురము. 131

తే. ఏపురంబునఁ జొప్పొందు ♦ నిందుధరుఁడు, పాండ్యభూపాలు నల్లుఁడై ♦ ప్రజలకెల్ల
నుల్లములలోన నుల్లాస♦ముల్లసిల్ల, నట్టి మధురకు సరియె యే♦పట్టనంబు. 132

క. గంగాధరుని మహోగ్రా,పాంగము రతి విధవఁ జేసె ♦ నాలోపల మా
యంగయకన్యాంబ కృపా,పాంగం బంగజుని దేవి ♦ నైదువఁ జేసెన్. 133

సీ. మాణిక్యవల్లియు♦మరకతవల్లియు, నానందవల్లియు♦ నమృతవల్లి
కర్పూరవల్లియుఁ♦ గల్పకవల్లియు, నంగయకన్య య♦నంగ నాది
యైననామంబుల ♦ ననుకూల మగుమోహ, నాకారసౌందర్య ♦ మతిశయిల్లఁ
బొత్తామరనియెడు ♦ నెత్తమ్మికొలనిప, శ్చిమతటనికటకూ ♦ లమునయుండి

తే. లోకమాతృక పాండ్యధా ♦ త్రీకళత్ర, పుత్రికామణి యువతి సం♦పూర్ణచంద్ర
వదన రక్షింప సంపదం ♦ బొదలుమధుర, కితర పురములు సరిసేయ ♦ నెట్లువచ్చు.

కం. ఇట్టిమహత్త్వంబునఁ గను,పట్టెడు తల్లిఁ గల ప్రజల ♦ భాగ్యం బిల నే
పట్టున నున్నది పురముల, నెట్టు నుతింపంగ వచ్చు ♦ నిందున కెనగాన్. 135

క. తన పేళ్ళుం దనసేవయుఁ, దనదుప్రసాదంబు నొసఁగి ♦ దయ నంగయక
న్య యగజ పెంపఁగఁ బురి మను,వసితల వైభవముఁ బొగడ ♦ వశమే వసుధన్.

శా. ఏమే కల్పకవల్లి రావమృతవ♦ల్లీ పోవ కర్పూరవ
ల్లీ మాణిక్యలతా యిదో మరకతం ♦ బెందుండు నానందవ
ల్లీ మీనాక్షులు రండటంచుఁ దమలో ♦ లేమ ల్నివాభోగవే
ళా మంజూక్తులఁ బిల్చు సంభ్రమ మన♦ల్పం బెప్పుడుం దత్పురిన్. 137

ఉ. ఆపుర మేలు భూవిభుఁ డ♦నంతపరాక్రముఁ డప్రతర్క్యధా
త్రీపరిపాలనప్రథిత♦ధీనిధి వైరినృపప్రతాపసం
జ్ఞాపతి వాసవాధిపయ♦శస్సముదీర్ణుఁ డుదీర్ణదానవి
ద్యాపరకర్ణుఁ డర్ణవస♦మగ్రగభీరుఁ డుదారుఁ డెంతయున్. 138

చ. అళఘుయ చొక్కనాథశివుఁ ♦ డల్లుఁడు మూర్తి హిమప్రభాసము
జ్జ్వలఘనకీర్తి ధైర్యమును ♦ శౌర్యము భూభరణప్రభావముం
దలఁప నశక్యమై వెలయఁ ♦ దత్పురి పాండ్యనృపాలుఁ డేలు ని
చ్చలు మహికామహీంధరము♦ చందమునం గులగోత్రపాత్రుఁడై. 139

వ. తదనంతరంబు. 140

శంఖఫలకముపుట్టిన క్రమము.

సీ. మలయాచలంబునఁ ♦ గలశతనూజుండు, ద్రావిడశబ్దశా♦స్త్రము నిఘంటు
వయ్యలంకారంబు♦ నందుఁ గవిత్వంబుఁ, జెప్పెడు లక్షణ♦స్థితియు మొదల
సృష్టింపఁ దలపోసి ♦ యష్టాదశాక్షర,మాతృక వ్రాసి ని♦ర్మలిన శంఖ
ఫలకంబుఁ గొనివచ్చి♦ పాండ్యభూపతి కిచ్చి, వినుమిది ద్రవిడక♦విత్వసరణి

తే. భారతీదేవి కెనయైన♦వార లెంద, ఱైనఁ జోటిచ్చు నొక్కరుఁ♦డైన నతని
కిచ్చుఁ దగినట్లు కూర్చుండ♦నెడము దీని, వరుస నర్చించి మనుఁడు మీఁ♦తరతరంబు.
క. అని కుంభజుఁ డిచ్చిన వెను,క ననేకులు పాండ్యనృపులు♦ గడచిన పిదపన్
జనియించెఁ గలియుగంబున, జనవల్లభుఁ డొక్కఁ డతని♦ సద్వంశమునన్. 142
క. ఆరాజు పాండ్యధాత్రీ,ధౌరంధర్యప్రమోది♦తగ్రావహారి
ద్వారణభుజంగపతిభూ, దారకమఠపరివృఢప్ర♦థానిధి యగుచున్. 143
క. ద్రావిడభాషాదేవీ,గ్రైవేయక మనఁగ గీర్తిఁ♦ గని తత్కవితా
శ్రీవిపుల శంఖఫలకము,పై వసియింపంగఁ దగు వి♦భాసితమతులన్. 144
శా. నక్కీరాది కవీంద్రులన్ దివిషద♦న్నప్రాయవాగ్గుంభసం
పత్కావ్య ప్రతిపాదక ప్రతిభులం♦బన్నిద్దఱన్ శైవసం
విత్కాసార మరాళరత్నములఁ ద♦ద్విద్వారసాపేక్ష భూ
భృత్కాంక్షీరవుఁ డుంచె సంపదలఁ దృ♦ప్తిం బొందఁగాఁ జేయుచున్. 145
క. ఆసభ మెచ్చఁ గవిత్వం, బేసరసుఁడు చెప్పిన న్మ♦హీశుం డిచ్చున్
జేసేత న్మాడలువే, యేసి దెసలఁ గీర్తిలతిక ♦ లెలమి నహింపన్. 146
చ. అడిగిన దిచ్చు నర్థులకు♦నాప్తుల కిచ్చు మనంబుఁ, గూటమిం
బడఁతుల కిచ్చు సౌఖ్యములు ♦ బంధుజనంబుల కిచ్చు సంపదల్,
పుడమి సమస్తజాతులకు♦బొంకమి నుత్సవ మిచ్చు, శత్రులన్
బొడవడఁగించి సాధుజన♦పుంగవకోటికి నిచ్చు వేడుకల్. 147

## దుర్భిక్ష వర్ణనము.

క. ఆభూవిభుఁ డిబ్భంగిని, భూభాగం బేలుసపుడు ♦ పుట్టెన్ గ్రహవ
క్రాభద్రతామమహా, క్షోభంబు జగంబు వర్ష♦శూన్యము గాఁగన్. 148
సీ. చనుదెంచె శని మీన♦మునకుఁ దూర్పున, ధూమకేతువు దోఁచె♦జీమూతడంబ
రం బేచె మధ్యంది♦నంబుల రేపాడి, చినికెఁ దుషారంబు♦దినదినంబు
రాత్రుల మిన్నుని♦ర్మలభావమును బొందె, వెలిమెండగాసె గ♦ర్వలిదొరంగె
వర్షగర్భము నడ♦వకపోయె విదియలఁ, గుముదాప్తధారణ♦కొమ్ము దఱిగె
తే. కన్య భిన్నంపదయ్యె మ♦ఖాప్రవేశ, కాలమున నుఱుమదయ్యె న♦ఖండగర్జ
లెసఁగె జముదెసఁ దొలకరి♦ నేమిసెప్ప, నెల్లజనములమనములు♦దల్లడిల్ల. 149
వ. మఱియును. 150
తే. గునుకులూదర్లు బరపటల్♦గోళ్ళగొండు,లల్లిబియ్యంబు వెదురుబి♦య్యంబు గొట్టె
చెట్లునింజెట్లు తుంగము♦స్తియలు నీత,గుంజు మొదలుగఁదినదొరఁ♦కొనియోజనము
క. అఱువడు గంటె తవిందియ, లఱువది దినములకుఁ బండు♦ నని బ్రదుకాసన్
దఱచుగ నేతా లెత్తఁగఁ, బఱిపఱియై యవియు మల్లె♦పడి చెడి పోయెన్. 251

ఉ. తోలును నెమ్ములు న్మిగిలి♦ద్రోసినఁ దొంబది పోట్లఁ గూలువా
రాలిని బిడ్డల న్విడిచి♦ యాఁకటిచిచ్చున వెచ్చపోవువా
రేలిక బంటువాసి యొక♦యించుక లేక కృశించువారునై
తూలెజనంబు మీనశని♦దోషము దాఁకి నిరస్తసస్యమై 153

క. నవయుచు నుండియు నొకొ్కక, దివసంబున నశన మబ్బఁ♦ దిని దగ మిగుల౯
భువి నొరగి లేవ నోపక, శివశివ! జనకోటి విడుచు♦ జీవానిలముల్. 154

క. కలవంతంతకు నొత్తఁగఁ, గరవెరుక తినంగనోపఁ♦గలుగక మనుజుల్
సురసుర స్రుక్కిరి కొందఱు, పరదేశంబులకుఁ జనిరి♦ బ్రతుకులకొఱకున్. 155

క. మానిసి మానిసిఁ దినుకఱ,వైనం దరియింపలేక♦ యాపురిమూల
స్థానహరద్విజుఁ డొకఁ డెం, దేనియుఁ బోఁదలఁచిన న్మ♦హేశుఁడు కరుణన్. 156

ఈశ్వరునిపద్యముఁగొని చనిన హరద్విజుని నత్కీరుఁడుతూలనాడుట.

వ. అతనికిఁ బ్రసన్నుండై యన్నగరంబేలుచున్న తేనిమీఁద నడఁచి భాసఁబద్యంబు శృంగార రసానుబద్ధంబుగా నొకటి చెప్పియిచ్చి యిది చదివిన మెచ్చి వేయిమాడలు ముడుపిచ్చు వెచ్చంబునకొదవు నీవు నెవ్వగ నొన్నవ్వక బ్రతుకంగలవాఁడ వంతటఁ గఱవుం దీరు జగంబునఁ గృతహర్షంబగు వర్షంబుఁ గురియంగలదు సస్యంబులు పండుఁ బండు జనంబులకవునని యనుపుటయు నతండును నారాజ సమ్ముఖంబునకుం బోయి శ్రీపరమేశ్వర ప్రణీతంబైన కపిలా చమత్కారంబు పఠించిన నందలియర్థంబు "సింధుర రాజగమనాధమ్మిల్లబంధంబు సహజగంధం" బని యుండుటం జేసి 157

క. దానికి నవ్వుచు నృపసభ,లో నత్కీరుండు పలికె ♦ లోకము నగదే
పూనుకొని సహజగంధము, వేనలికం గలదటన్న♦ వేయు తెఱఁగులన్. 158

ఉ. తప్పిది, చెప్పరాదు, కవి♦ తానసమయంబున గొప్పగాము, నీ
విప్పగది పఠింపఁ దగు♦నే? యన విప్రుఁడు చిన్నవోయి నా
కప్పరమేశ్వరుండు వసు♦ధాధిపుపై రచియించి యిచ్చినాఁ
డొప్పును దప్పు నే నెఱుఁగ♦ నుత్తములార! యటంచుఁ గ్రమ్మఱన్.  159

ఖిన్నుఁడైన బ్రాహ్మణుని శివుఁడూరార్చి నత్కీరునితోవాదునకుఁ గడంగుట.

ఆ. వచ్చి పార్వతీశు♦వంకఁ గనుంగొని,యతని పద్య మతని♦కప్పగించి
నిన్ను నమ్మి పోయి♦ నిందించిన సభ సిగ్గుపడితి నున్న కథలు ♦ చెప్పనేల. 160

క. సర్వజ్ఞత్వము బహుముఖ,నిర్వాహకశక్తిగుణము♦ నీకుఁ గలుగఁగా
శర్వ! నినునమ్మి పౌరుష,గర్వముఁ బోనాడుకొంటిఁ ♦ గడపట సభలోన్. 161

క. తా నెఱిఁగిన విద్య నృపా,స్థానములో నెరపఁ గీర్తి ♦ సమకూరుం గా
కేనరునకుఁ బరవిద్యా,ధీనత భూపాల సభలఁ ♦ దేజము గలదే? 162

క. నీమాట నమ్మి పోయిన, నామోసముఁ జెప్పనేల ♦ నత్కీరునిచే
నేమాట పడ్డ దుఃఖము, తామవ్యథ కొలఁదిగాదు ♦ సద్భక్తనిధీ! 163

వ. అని మఱియు నిట్లనియె. 164

శా. నాభాగ్యం బిటు లుండఁగాఁ దుది నిను ♦ న్నత్కీరునిం దూఱఁగా
నేభావ్యం బికఁజాలు; నిక్కఱవుచే ♦ నిట్లైతి, నెంధైనఁగా
నీ ఖైతంబునఁ గుక్షిఁబోఁచుకొని దీ ♦ నిం దీర్చి నేపత్తు, దే
వా! భద్రం బగు నీకు నన్ననుపవే ♦ యన్నం గృపామూర్తియై. 165

క. కటకట నన్నత్కీరుం, డఁట కవితయుఁ దప్పువట్టె ♦ నఁట యటు పదమీ
యెటువలెనో తెలిసెద నని, నిటలాక్షుఁడు వచ్చి కుంభి ♦ నీపతి సభలోన్. 166

శా. ఈరాజన్యునిమీఁద నేఁ గవిత సా ♦ హిత్యస్ఫురన్మాధురీ
చారుప్రౌఢిమఁ జెప్పి పంప విని మా ♦ త్సర్యంబు వాటించి న
త్కీరుం డూరకె తప్పువట్టెనఁట యే ♦ దీ లక్షణంబో యలం
కారంబో పదబద్ధమో రసమొ చ ♦ క్కంజెప్పఁడా తప్పనన్. 167

క. అనవుడు నానత్కీరుఁడు, మునుపటివలెఁ దప్పటన్న ♦ ముక్కంటియు నా
తని కనియె న్గిరితనయా, ఘనకచభారంబు సహజ ♦ గంధం బనుచున్. 168

క. అగజకున్నైనం దగు నిల, మగువలకుం దగదు ♦ మాను మత్సర మింకన్
గగనప్రసూనవాదము, జగతిం బ్రత్యక్షమునకు ♦ సరియనఁ దగునే. 169

క. లూలామాలవు మాటలు, చాలు సనిన నలిగి తననిజం బగు రూపం
బాలోనఁ దెలుప వలెనని, నీలగ్రీవుండు నిటల ♦ నేత్రముఁ జూపన్. 170

క. తలచుట్టువాఱఁ గన్నులు, గలిగినఁ బద్యంబు దప్పు ♦ గాదన వశమే?
వల దిచ్చట నీమాయా, విలసనములు పనికిరావు ♦ విడువు మటన్నన్. 171

—శివుఁడు నత్కీరుని శపియించుట.—

క. శపియించెం బ్రతిభాషలఁ, గుపితుండై రుద్రుఁ డతనిఁ ♦ గుష్ఠవ్యాధిం
దపియింపు మనుచు దానికి, నపరిమిత భయంబు నొంది ♦ యతఁడిట్లనియెన్. 172

శా. స్వామీ! ద్రోహముఁ జేసితిం, దెలుపవే ♦ శాపాంత ముద్యత్కృపా
ధామా! నాకనుచుం బదాబ్జముల మీఁ ♦ దం బడ్డ నాథ క్తర
తామందారుఁడు శాంతిఁబొంది యనియెం ♦ గైలాసశైలంబుఁ గం
టే మానుం బదమన్న నందునకుఁ దా ♦ డెందంబునం గుందుచున్. 173

—శివుఁ డిచ్చినశాపమునకు నత్కీరుఁడు దుఃఖించుట.—

ఉ. ఈకవితాభిమానము వ ♦ హించితి నేటికిఁ? శంఖపీఠిపై
నీకవు లున్నయట్లు వసి ♦ యింపక దేవునితోడ నేల చా

ర్వాక కొనర్చితిం? గడుభ♦రంబగు కుష్ఠరుజావిషాదమే
నే కరణిం ధరింతు? నిఁక♦నెన్నఁడు చూచెద వెండిగుబ్బలిన్? 174

ఉ. ఎన్ని మహానదుల్, వనము♦లెన్ని, గిరీంద్రములెన్ని, బోయప
ల్లెన్ని, మృగంబులెన్ని, జన♦హీనములైన పథంబులెన్ని, నే
నిన్నియుఁ దాఁటి యేకరణి♦నీశ్వరు శైలముఁ జూడఁ బోయెదన్?
గన్నదికాదు విన్నయది♦గాని సదాశివ! యేమిసేయుదున్. 175

మ. హరి శార్దూల మదేభ ఖడ్గ శరభ♦వ్యాకీర్ణము లాత్మసో
త్కర సంచార నివాసముల్ హిమపయో♦ధారాళవర్షంబు లు
ద్ధుర సంఘర్షణ బాధకోపలము లా♦త్రోవల్ సనన్ శక్యమే
కరుణాసాగర! భక్తవత్సల! శివా ♦ గౌరీశ! యెట్లో గదే. 176

సీ. తివిరి యంగమ్మునఁ♦దిమ్మిరెత్తకమున్న, యొడలెల్ల మచ్చలఁ♦జెడకమున్న
దళమెక్కి గాత్రంబు♦చెలువుదప్పకమున్న, బుడుపులు మేన నే♦ర్పడకమున్న
యులఁత విగ్రహమున♦నంకురింపకమున్న, కాయంబు వెడసూపు♦గాకమున్న
తనువునఁ జీము ర♦క్తములు గాఱకమున్న, దేహ మీఁగలు మూఁగి♦ తినకమున్న

తే. భైక్షమడుగంగఁ బోయిన♦పట్ల జనులు, చూడ రోయకమున్న కా♦లాడినపుడ
నడవలేఁగాక కైలాస♦నగముఁ జూడ, హరుని వాక్యంబు శక్యమే♦పరిహరింప. 177

నత్కీరుని తీర్థయాత్ర.

తే. అనుచుఁ జింతాపరంపర♦ లనెడు వర్ష, ముడిగి నత్కీరుఁడను మేఘుఁ♦డుత్తరంబు
నడచె సంతోషమున దక్షి♦ణమున నున్న, కవుల ముఖపంకజములు వి♦కాస మొంద.

వ. కతిపయ ప్రయాణంబులు చనిచని ముందట 179

శా. చెవ్వందీశ్వరు నీశ్వరేశ్వరునిఁ గాం♦చెన్ భీషణాంహోజాలతల్
దెవ్వం దీవ్రతరాంగసంభవశర♦శ్రేణీ విదాహవ్యథల్
వివ్వం దీరని భక్తితో హృదయమా♦ విర్భూత మోదంబునన్
నవ్వం దీఁగయుఁబోలెఁ జూడ్కు లొదవ♦ న్నత్కీరుఁ డుత్కంఠతన్. 180

ఉ. చెంగట నుండఁ గాంచెఁ గవి♦సింహము పోయి హిమాచలాత్మజో
త్తుంగకుచోపగూహనవి♦ధూతమనోభవభూతిలేపస
ర్వాంగము, లోచనీకృతసు♦ధాంశుకృశానుపతంగము, న్విని
ర్లింగము, జంబునాథశివ♦లింగము, భక్తమనోబ్జభృంగమున్. 181

చ. చని చని దాఁటె నంతఁ గవి♦చంద్రుఁడు ధన్యఁ గవేరకన్య, జీ
వనశితఖడ్గఖండితభ♦వప్రభవాఘవిరోధిసైన్యఁ, బా
వననిజనామసంస్మరణ♦వారితమానవదైన్య, నిత్యను
జ్జనరతకోటిముక్తిపద♦సౌఖ్యవదాన్యఁ, గృతావగాహుఁడై. 182

వ. ఇట్లు తత్తటినీరత్నంబు నుత్తరించి యుత్తరాభిముఖుండై కొన్ని తీర్థంబులుదర్శించి. 183

చ. అరుణగిరీంద్రకూటముఁ, గృతాఘకపోలచపేటముం, నిరం
తరభవదావపావకవిదాహకృపీటము, పుణ్యకోశమం
దిరవిలసత్కవాటముఁ, బ్రదీపితముక్తివధూకిరీటముం
బరిహృతసంతతభ్రమణభారపదశ్రమభానుఘోటమున్. 184

క. ఉణ్ణాముల జగదంబిక, నణ్ణామల విశ్వనాథు నారాధించెం
మణ్ణాసయుఁబొన్నాసయుఁ, బెణ్ణాసయు లేనివారిఁ బెన్నిధు లగుటన్. 185

క. తదనంతరంబ యక్కడ, కదలి నడిచి యెదుట విష్ణుకాంచనగర్భుల్
మొదలైన దేవకోట్లం, జదివించినయొజ్జఁ గాంచె సజ్జనసురభిన్. 186

మ. తిరువత్తూరి పురాధినాయకు మహాదేవుం శివున్ముక్తివా
రిరుహాక్షీపతి నోదిపిచ్చ నయనాఁ రింగొల్చి యాపిమ్మటం
బరశంభుం బరమార్థమూర్తిఁ గరుణాపాథోనిధానంబు నే
కనసాలేశ్వరుఁ గాంచికారమణు లోకస్వామిఁ దర్శించుచున్. 187

వ. అనర్గళాపవర్గంబగు నప్పురంబు నిర్గమించి కొన్నిప్రయాణంబులు చని విక్రమసింహ
నగరాసన్నయగు పెన్నయుఁ, దీర్ఘయాత్రాపరులకు సురతరువుకొమ్మయగు గుండ్ల
కమ్మయు, సుకృతిభూతపాతకశ్రేణియగు కృష్ణవేణియుఁ, గమలాచలోత్తుంగసంగ
తతరంగయగు గౌతమగంగయుఁ, గుక్కుటేశ్వరపీఠంబగు పీఠికాపురంబును, నం
హోమాతంగసింహం బగు సింహాచలంబును, విదళితోభయకర్మం బగు శ్రీ
కూర్మంబును, గలుషానీక మండూకగోకర్ణంబగుగోకర్ణంబును, తీర్థోత్తమంబగు పుష్క
రోత్తమంబును, గృత్తివాసోనివాసం బగుకృత్తివాసంబును, ముక్తివధూచరణ
కటకం బగుకటకంబును, దుఃఖదహన జలేశ్వరంబగు జలేశ్వరంబును, గృతవందన
నందనేశ్వరంబగు నందనేశ్వరంబును, జిద్గగనేశ్వరంబగు గగనేశ్వరంబును, బిత్రు
ముక్తినివాసంబగు గయాస్థానంబును, సేవించుచు నత్కీరుండు సనునప్పుడు
ముందట. 188

శా. కాంచెం గాంచనపంకజాత విలసద్గంధాంధసారంగ, ఫే
నాంచత్తుంగతరంగ, వారినిధిశీతాగాంతరాభంగ, రో
మాంచస్వేదజలాశ్రుపూరజనకాత్మానందసంపన్మనో
మంచాగ్రస్థితవిశ్వనాథపదసమ్యక్సంగ, గంగానదిన్. 189

వ. కాంచి చేరం జనుదెంచి 190

శా. గంగాస్నానముచేసి విశ్వపతి మోక్షస్వామి దర్శించి పా
పాంగారవ్రజవృష్టినీశ్వరి విశాలాక్షిం శివం గొల్చి భ

త్తిం గాలాంతకుఁ గాలభైరవపతిం♦ గీర్తించి దుండీద్విపా
స్యుం గల్యాణగుణాలయుం దలఁచి యా♦త్రోత్సాహ మొప్పారఁగన్. 191

క. కాశీనగరీ పంచ,క్రోశక్షేత్రంబు విడిచి♦ గుహ్యకనృపా
డాశాగమనాభిముఖుం, డై శంకరశైలదర్శ♦నాశాబుద్ధిన్. 192

సీ. ఒకకొన్ని పయనంబు♦ లొయ్యనొయ్యనఁబోయి, నడువ నోపిక లేక♦నడుమనడుమ
నడుముఁ బట్టుక నిల్వఁ♦బడియుఁగూర్చుండియుఁ,దొంగిదొంగియుఁగొన్ని♦జంగ లరిగి
పొడలు పెట్టుచుఁ దన♦ కడు గామడై యుండఁ, జీము నెత్తురు మేనఁ♦జిప్పిలంగ
నీఁగలు మూఁగియు♦ రేఁగియు ఝుమ్మఝుమ్మనఁగ నుత్తాలశై♦లాంతరంబు

తే. నిర్మనుష్యంబు బహుసత్త్వ♦నిష్ఠురంబు, నైన కానన మధ్యంబు♦నందుఁ జిక్కి
దిక్కుఁ గానక దీనతా♦ధీనహృదయుఁ, డగుచు నక్కీర కవిచంద్రుఁ♦ డగ్రభూమి.

ఉ. తమ్ములు కమ్మఁదెమ్మెరలఁ♦ దల్లడమందఁగ ఝుమ్ముఝుమ్మనన్
దుమ్మెద పిండు పుష్పముల♦తో నెగయం బిసినీలతాంగి కే
శమ్ములు ధూపధూమముల♦ సౌరభము ల్గొలువంగ విచ్చిన
ట్లమ్మొయి నొప్పఁ దమ్మికొల♦ నక్కడ నొక్కటిఁ గాంచె వేడుకన్. 194

తే. హంససంసదభీష్టవి♦హారహేతు, వై బహూదకహృద్యమై♦ యప్రతర్క్య
మగుచు నద్వంద్వమై పంక♦జాకరంబు, పొలిచె బ్రహ్మంబు తెఱఁగున♦ బూర్ణమగుచు.

క. తమ్ముల రజోవికారము, గ్రమ్మెడు వాసనలు దళము♦గా నెసఁగెడుకో
శమ్ములు నూర్పులుఁ జెలఁగఁగఁ, దమ్మికొలను భవముఁబోలెఁ♦దద్దయు నొప్పెన్. 196

చ. దళములలో రథాంగనిన♦దంబు పరాగము రాజహంస సం
కులము శిలీముఖభ్రమణ♦ఘోషము నవ్యకదంబము ల్సము
జ్జ్వలతర పుండరీకములుఁ♦ జాలఁగఁ గల్గి మహాహవస్థితిన్
బోలుపు వహించు నక్కొలని♦ పొంతకు నొయ్యనఁ జేరి యచ్చటన్. 197

## నక్కీరుఁ డొకభూతమునకుఁ జిక్కుట.

సీ. తన పలాశశ్రేణి♦ ధర కంతటికిఁ బచ్చ,పట్టుఁబుట్టంబు మే♦ల్కట్టు గాఁగఁ
దనయూర్ధ్వశాఖావి♦తానంబు సురలకు, మరకతరచితహ♦ర్మ్యములు గాఁగ
దనప్రేలుఁగొమ్మలు♦ మునులకుఁ గల్పిత, పర్ణశాలాకలా♦పములు గాఁగఁ
దన దిశాంతభ్రాంత♦ఘనవిటపచ్ఛాయ, వలయాద్రి హరిణశా♦ద్వలము గాఁగ

తే. వాలఖిల్య మునీశ్వరా♦వాసమైన, రోహణము రీతి పితృముక్తి♦దేహ మగుచు
గయఁ బ్రసిద్ధి వహించు న♦క్షయవటంబు, చందమున నున్నయొక మఱ్ఱి♦క్రింది కేఁగి.

వ. తదీయ శాఖాశైత్యంబున కత్యంతసంతోషంబు నొంది కూర్చుండి తద్వటంబున నుండి రాలిన పండుటాకులు బట్టబయటఁ బడినయవి విహంగంబులు జలంబులం బడినయవి మీనంబులునై పోవ నందొక్క పలాశంబు జలాశయంబున సగమును

నటప్రదేశంబున నగంబును బడి మీనపక్షిత్వంబులఁ గైకొని లోపలికి వెలపలికిం దివియు చమత్కారంబు నత్కీరుండు చూచి యద్భుతరస పరవశుండై యుండె నంత. 199

ఉ. క్రూరనిరీక్షణ ప్రభల ♦ గుజ్జులుఁ గోఱలు నూర్ధ్వకేశముల్
నీరదనీల గాత్రమును ♦ నిష్ఠురవాక్యము లట్టహాసముల్
ఘోరకంఠనిస్వనము ♦ భీకర హేతియు మానవాస్థిహా
రారవము ల్సెలంగ వికటాకృతితో నొకభూత మాతనిన్. 200

క. పట్టికొని తనదు గుహకుం, బెట్టిదముగఁ దెచ్చి మునుపు ♦ పెట్టిన మనుజుల్
నట్టిఁబడిన పురుగులగతి, నిట్టట్టుపడంగ నునిచి ♦ యెంతయు వేడ్కన్. 201

క. వారల నందఱ నేకాహారముగాఁ గొనఁదలంచి ♦ యయ్యద్రిబిల
ద్వారమున రాయి ద్రోచి మహారయమునఁ గొలన నుదక ♦ మాడఁగఁ బోవన్. 202

వ. మునువున్న మనుష్యులు నత్కీరునిం గనుంగొని యిట్లనిరి. 203

ఆ. ఏమి సేయవచ్చు ♦ నింతయు మామీఁదఁ, గరుణ లేక కమల ♦ గర్భుఁ డిపుడు
నిన్నుఁ దెచ్చిపెట్టె ♦ నేఁడింక నందఱఁ, దిను నితండు వీని ♦ తెఱఁగు వినుము. 204

ఉ. నూఱుక తీఱు నీతఁడు క ♦ నుంగొనునంతటిలో మనుష్యులన్
నూఱువురైనఁ గాని తిన ♦ నోటికి నాఁటదటంచుఁ గూర్పఁగా
నూఱువురైరి నేటికి మను ♦ ష్యులు నీవునుఁ గూడ, నింతటన్
నూఱును నిండె నిందఱ, క ♦ నుగ్రహ మీశ్వరుఁ డేమి సేయునో. 205

క. అనవుడు నత్కీరుండును, మనమునఁ దలపోసి దీని ♦ మానుపఁ బురభి
త్తనయుఁడు తారకదమనుఁడు, తనకుం గలుగంగ నింకఁ ♦ దలఁ కేలనుచున్. 206

నత్కీరుని సుబ్రహ్మణ్యస్వామి రక్షించుట.

ఉ. తారకదైత్యభంజనుఁడు ♦ దారుణశక్తిధరుండు పన్నగా
హారహయుండు దీనజన ♦ తామరభూజము షణ్ముఖాట్టహా
సారభటీవిపాటితది ♦ గంతకటాహుఁడు వీనిఁబట్టి సం
హార మొనర్చి యిందఱఁ గృ ♦ పాంబుధియై బ్రతికించుఁ గావుతన్. 207

ఉ. భూతముఁ జంపు చేయఁగదు ♦ భోరనఁ దారకు మన్నిగొన్న వి
ఖ్యాతమహాప్రతాపునకు ♦ నద్రిగుహాలయ మేమిదొడ్డు ని
ర్ఘాతమువంటి శక్తిఁగొని ♦ క్రౌంచముఁ జించిన రౌద్రమూర్తికిన్
భీతిఁ దొలంగఁ జేయు టొక ♦ పెద్దయె వారితదేవతార్తికిన్. 208

వ. అని యనేక ప్రకారంబుల బ్రహ్మణ్యోక్తియుక్తంబుగా నిష్టదేవతావరేణ్యుండును భక్తశరణ్యుండును నగు సుబ్రహ్మణ్యు సన్నుతింప ననుకంపాతరంగితాపాంగుండై యతండు చండతరవేగంబునం బయింబడి భూతంబు భూతలంబుపయిం బడం బెడ

చేతనడిచి బిలద్వారంబునం దోఁచిన రాతిఁ దిగిచి వైచి యందఱ వెడలుండని యనుగ్రహించినం డెందంబుల నానందంబునం బొంగి యిందుశేఖరునందను నందర్శించి వందనంబులు నందడించుచు వారెందేనియుం జనిరి. నక్కీరుండును బునఃప్రణామం బాచరించి నిలుచుటయుఁ బ్రసన్నతాంకురంబులు ముఖపంకేరుహం బునం బ్రభవింప నీ వీమెడకు రాఁ గతంబేమి? యని యడుగుటయు నిట్లని విన్నవించె. 209

క. ఓశరణాగతవత్సల! కాశవనప్రభవ! దీన•కల్పక! యావ
న్నాశకర! దురితగిరిదే, వేశ ననుం గరుణఁ జూడ•వే సుఖ నగుదున్. 210

ఉ. ఏ నొకతప్పుఁ జేసిన మ•హేశుఁడు నన్ను శపించెఁ గుష్ఠరో
గానుపమవ్యథం బడుమ•టంచును దానికి శాపమోక్షమి
ట్లానతి యిచ్చె నాత్మనిల•యంబగు కౌప్యనగంబుఁ జూచినన్
మాను నటంచు నక్కధర•మార్గము దుర్గమ మేమి సేయుదున్. 211

క. ఏలాగున దర్శింతుం, గైలాసం బెవ్వుఁడుగాని•కానర ఖేదో
ల్లోలోర్మిరోగజలనిధి, వేల యనుచు విన్నవింప•విని గుహుఁడు దయన్. 212

శా. కైలాసం బనఁ గాని యుత్తరదిశా•కైలాస మంచాడఁ డా
కాలగ్రీవుఁడు, నీవు దక్షిణదిశా•కైలాసముం జూచినన్
జాలుం గుష్ఠము మాను నంచు మదిలోఁ•జర్చించి యావర్వతం
బాలోకింపఁగ నశ్రమం బగు నుపా•యం బాత్మఁ జింతించుచున్. 213

తే. తనమహత్త్వమ్ము డాఁచి నే•త్రమ్మికొలని, మహిమ వలె నుండ నాకవి•కుండలేంద్రు
నాడు మిందునఁ గైలాస•మాడఁ బోవు, తీర్థ మెదురైనరీతి సి•ద్ధించు ననుడు. 214

నక్కీరుఁడు సాయుజ్యము వడయుట.

శా. సేనానీవచనామృతంబు చెవులం•జిందంగ డెందంబులో
నానందం బుదయింప నక్కొలనిలో•నత్యంత నిష్ఠం గృత
స్నానుండై తలయెత్తఁగా నెదుటఁ గా•నవచ్చె నాలో నవా
చీనస్థానునగంబు హేమముఖరీ•సింధుప్రతీరంబునన్. 215

శా. కుష్ఠవ్యాధియు మానె హేమముఖరీ•కూలస్థకైలాసమున్
నిష్ఠాధీనమనస్కుఁడై కదిసి త•న్నీరంధ్రకల్లోలభూ
యిష్ఠౌఘంబునఁ దీర్థమాడి గిరిజా•ధీశున్ శివున్ దేవతా
శ్రేష్ఠున్ సంస్తుతి నూఱుపద్యములఁ జే•సెన్ ద్రావిడోక్తిం దగన్. 216

క. ఆనూఱుపద్యములకున్, సేనానీజనకుఁ డార్త•చింతామణి వి
ద్యానిధి జ్ఞానప్రసవాం, బానాథుఁడు కాళహస్తి•పతి ప్రీతుండై. 217

శా. ప్రత్యక్షం బగుచుఁ భవద్భవము సా♦ఫల్యంబునుం బొందె సా
హిత్యశ్రీవర! నీకు నింపగు వరం♦బే నిచ్చెదన్ వేఁడు భీ
తిత్యాగం బొనరించినాఁడ నన న♦త్కీరుం డుమాజానికిన్
బ్రత్యగ్జ్యోతికి మ్రొక్కి మ్రొక్కి ప్రమద♦ప్రాయాంతరంగంబుతోన్. 218

క. నిటలంబున నంజలిపుట,ఘటనం బొనరించి ప్రమద♦గద్గదగళ మ
స్ఫుటవర్ణస్తుతి భాషా,ర్భటియును రోమోద్గమంబు ♦ పైపైఁ బఱఁగన్. 219

వ. ఇట్లని విన్నవించె. 220

క. ఈసంసారము దుఃఖా,వాసానందంబు దీని♦ వర్జింపంగా
నేసుఖము గల్గు దయ న, న్నాసుఖమునఁ గూర్పవే కృ♦తార్థుఁడ నగుదున్. 221

మ. అని ప్రార్థింపఁగ భక్తకల్పక మవి♦ద్యాసూత్రదాత్రంబు జీ
వనఖేదాంబరకర్తరీముఖము కై♦వల్యార్థదానామృతా
శనరత్నంబు తుషారశైలతనయా♦జాంపత్యసంపన్న పా
వనగార్హస్థ్యము కాళహస్తిపురదై♦వం బిచ్చె సాయుజ్యమున్. 222

శా. ఈరీతిన్ శివుఁ డానతీయ విని ధా♦త్రీశుండు భక్తి న్నమ
స్కారస్తోత్రము లాచరించి పిదపన్ ♦గౌరీశుఁ బూజించి యె
వ్వారిచ్చో నపవర్గమార్గమునఁ బో♦వం గాంచి రన్న న్మదిన్
గారుణ్యం బుదయింప నిట్లనియె భ♦క్తప్రీతి భూతేశుఁడున్. 223

శా. యోగిస్వాంతశకుంతవాగురిక! స♦ర్వోపాధిశూన్యా! జగ
ద్యోగా యోగవిహీన! భూగగనవా♦యుక్షీరవహ్న్యంతరా
త్మా గణ్యా! గణనీయ మూర్తి! పరమా♦ర్థాకార! స్వాభావ తే
జోగండూషితపద్మజాండభవచ♦క్షుశ్శ్రోత్రపక్షీశ్వరా. 224

క. అష్టాపదగిరిచాపా, యష్టాపదగర్భ కేశ♦వార్చితచరణా
యష్టాపదముఖరిజని,తాష్టాపదకమలవాస♦నాధీనమనా. 225

పంచచామరము. మునీంద్రమానముద్రికాస♦ముక్తముక్తవాసనా
సనాతనాత్మసేవకార్తి ♦ సారసావలీఘనా
ఘనాఘనా ఘనప్రకాశ ♦ కాయజాగ్నిజీవనా
వనాధినాథ నందనేశ ♦ వాగధీశపావనా. 226

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణ సింగమరమా
నారాయణ జక్కయనారాయణతనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటికవిప్రణీతంబైన
శ్రీకాళహస్తి మాహాత్మ్యంబునందుఁ
దృతీయాశ్వాసము.

శ్రీరామాయ నమః

# శ్రీకాళహస్తిమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.



కంఠ కంఠభూషిత,
కాకోదరవర వరాక ♦ ఖండనమత వ్యా
ఖ్యాకోలాహలదూరం చి,
దాకృతి నతకాల కాళ♦హస్తీశ శివా. 1

ఆ. అవధరింపుఁ డిట్లు ♦ భవదీయ కథ విన్న, వింతు భక్తజనుల ♦ వీను లలర
మీరు యాదవునకుఁ ♦ గారుణ్యరసపూరి, తేక్షణముల నాన♦తిచ్చినట్లు. 2

### మధురాపురవర్ణనము.

సీ. రాజులు వీరఘో♦రాజులలో వల, రాజు లౌదురు జయ♦రతికి ననఁగఁ
గొమ్మలగమి కోట♦కొమ్మ లెక్కి నిలింప, కుజముకొమ్మల విరుల్ ♦ గోయు ననఁగ
నాగావళికిఁ జంద♦నాగానిలాస్వాద, నాగమనద్వార ♦ మగడి తనఁగ
శతకోటిరుచిరత్న♦సౌధకోటిప్రభా, కోటిహేళికిఁ బ్రతి♦కోటి యనఁగఁ

తే. బౌరుషౌన్నత్యనిమ్నతా ♦ భావిభూతిఁ, జొక్కమై ప్రజ సంపదఁ ♦ జొక్కి మెఱయ
హరుఁడు చొక్కేశ్వరుండుమీ♦నాక్షిసతియుఁ, గాఁపురంబుండు నమ్మధు♦రాపురంబు

ఉ. శ్రీవనజాక్షికిన్ జనన♦సింధువు తత్పురి, బొమ్మరిండ్లు నా
నావసథంబు, లాత్మసఖు ♦ లంబుజలోచన, లాటపట్లు ధా
త్రీవరమార్గముల్, రథహ♦రిద్విరదాదులు బొమ్మ, లాడుని
చ్చానచనావళుల్ నిగమ♦శాస్త్రము లై విలసిల్లు నెప్పుడున్. 4

చ. ధరణికిఁ గంఠభూషణము ♦ తన్నగరంబు, తదీయమస్తకా
భరణము పార్థివాన్వయము ♦ ప్రాణము దానికి రాజనందనో
త్కరము, తదాత్మకుల్ మదన♦దాహరసప్రదవైశ్యవీథి త
త్సరసిజలోచనల్ గుఱుతు ♦ చక్కఁదనంబున వారిలోపలన్. 5

## మాణిక్యవల్లియను వారవనిత శివభక్తిపారవశ్యలంపటకూఁతుల నిర్వైరం గని పెంచుట.

క. గాణిక్యకలశజలనిధి, మాణిక్యం బగుచు మదనమతిముల కిరవై
మాణిక్యవల్లి యనఁగా, నేణాక్షి యొకర్తు వన్నెకెక్కెను బురిలోన్. 6

శా. ఆ వామేక్షణ దైవయోగమున గర్భాధానముం బొందినన్
వేవిళ్ళయ్యె, నరోచికంబు వొడమెన్ వెల్లందనం బాస్యరా
జీవవ్యాపకమయ్యె, నోపమి జనించెం, జూపులుం గుక్షియున్
లావయ్యెన్, విటకోటిసంగసుఖ మల్పంబయ్యె నాపిమ్మటన్. 7

క. పొద్దులనెల చొచ్చిన న,మ్ముద్దియకు జనించి రపుడు మోహనమూర్తుల్
ముద్దుమొగంబుల కన్యక, లిద్దఱు శివభక్తి తనువులెత్తిన పగిదిన్. 8

క. రాజులకొడుకులు గణికా,రాజకుమారికలఁ గన్న రాజిల్లు మనో
రాజీవము గావున నా,రాజవదన సమ్మదాంబురాశిం దేలెన్. 9

మ. తలఁ బంకించిన నూనె, పుక్కిట సదా తాంబూలము, న్నేత్రక
జ్జలమున్, గంధరఁ గట్టుకొన్న వసపూసల్, గబ్బిపాలుబ్బుగు
బ్బలు, నేకాంగుళికార్పి తాలకలన దృభస్మంబు జిడ్డైనదు
వ్వలువం, జెల్వుగ బిడ్డకాన్పునడిపెన్ వామాక్షి బాలింతయై. 10

సీ. అలఁదు నలుంగు దేహమున వేణ్ణీళ్ళార్చుఁ, దడియొత్తు మెత్తని ధవళవస్త్ర
మునఁ గాలిత్రేలి మన్నునబొట్టు వెట్టుఁ గ,న్గవఁ బెట్టుఁ గాటుక కనుపునకును
బెట్టుఁ బొత్తులమీఁదఁ బెట్టుఁ జన్నిచ్చు జో,కొట్టు జోలలు పాడు ముట్టిపఱచుఁ
దలయంటుఁ జిట్టాముదమున రక్షార్థంబు, మసిఁడికోలలు మంచమునసమర్చుఁ

తే. ద్రాట నులిగాయఁగూర్చి పాదములఁగట్టు, నుప్పువేఁపాకు పైఁజల్లు నిప్పు లతివ
దిప్పియిడు దృష్టిదోషంబు దీర వీథిఁ, బ్రేమ మీఱంగ బిడ్డలఁ బెంచునపుడు.

చ. కనకపుఁబేరు సోయగము గల్గినముత్తెపుఁ గ్రొత్త తొట్లలో
నునిచి యనర్ఘరత్నముల నొప్పగు గుత్తులు మోవ్రిల వ్రేలఁ గ
ట్టిన వెఱఁగంది తెప్పలు సడిల్పక తారకయోగమార్గద
ర్శనరతులట్లఁ గన్గొనఁగ సాగిరి కన్య లనన్యచిత్తలై. 12

ఉ. కోకిలవాణి పాడుఁ దన కూరిమిబిడ్డలఁ దొట్లఁబెట్టి కో
కోకకళావిలాసములకుం గల యర్థము జోలపాటగా
నా కమనీయశైశవము నప్పటినుండియు వారధర్మవి
ద్యాకుశలత్వ మాత్మజల కచ్చుపడన్ వలె నంచు నిచ్చలున్. 13

సీ. రతివధూమదనులు రంభాకుబేరపుత్రకు లూర్వశీపురూరవులు మేన
కాకౌశికులు గోపికాముకుందులు ధాన్యమాలినీరావణుల్ మత్స్యగంధ

నర్వ్యశృంగులు దాశ♦నలినేక్షణాపరా,శరులు తారాని శాక♦రులు గౌత
మాంగనాదేవేంద్రు ♦ లమరవేశ్యాజయం,తులు ద్రౌపదీపాండ♦వులు పృథాబ్జ

తే. హితులు నడిచిన గతులాత్మ♦సుతలఁ బెంచు, నింటి గోడలఁ వ్రాయించు♦నిందువదన
వనితలకు సరసతకల్పి ♦ వావి వరుస, లేమియును లేమి వారల ♦ కెఱుక పఱుప. 14

క. వనిత చతుర్జాతి వయో,వనజాక్షుల బంధవైభ♦వము భద్రుని ద
త్తుని కూచిమారుఁ బాంచా,లుని వ్రాయించెఁ గృహంబు ♦ లోపలిగోడన్. 15

సీ. కూచిమార మనోజ♦ఘోణికాపుత్రాది,కానీత కామసి♦ద్ధాంతములును
నిరుపమ కలనాద ♦ పరివాదినీ వీణ, లాదిగాఁ గల గాన♦యంత్రములును
కీర పారావత ♦ శారికా సారస, హంసాదులైన వి♦హంగములును
దత్తిల భరత మ♦తంగాంజనేయకా,హళ మత ప్రముఖ లా♦స్యాగమములు

తే. సంతరించె గృహంబులో ♦ జలజనేత్ర, రతులఁ జతురత గానధు ♦ రంధరతలఁ
గంఠరవనిపుణతల నాట్య ♦కౌశలములఁ, జిన్నివయసులఁ బ్రౌఢలఁ♦జేయఁదలఁచి.

తే. పెక్కుతెఱఁగుల నీరీతిఁ♦బెంచి విసివి, పంచశరపాట్లఁ బడ్డ నే♦పాటియైనఁ
బణ్యాధర్మంబు మదిలోనఁ ♦ బట్టువడక, శైవధర్మంబె ధర్మంబు♦గా విధించి. 17

దాసికూఁతుల చేష్టలు.

ఉ. ఆపసిబిడ్డ లేమిజన♦నాంతరవాసనయో కనుంగవం
జూపు లిగుర్చుచోఁ శివునిఁ ♦ జూడఁ దలంతురు, పల్కు నేర్చుచోఁ
దాపసమానసాంబుధిసు♦ధాకరు శంకరు రూపవర్ణనా
లాపములాడఁ బోదురు, క♦ళానిధిశేఖర భక్తియుక్తలై. 18

తే. తోడి వెలయాండ్రబిడ్డల♦తోడఁ గూడి, యాడఁబోదురుగాని పో♦రాముతల్లి
మనసురాఁ గోరి కన్యకా♦మణులచిత్త, మానున ర్ధేందుశేఖరు ♦ నందు నెపుడు.

ఉ. కన్యకలెల్లఁ గూడి రతి♦కాముల నోఁచఁగఁ దాము భూమిభృ
త్కన్యక నీశునిం దలఁచి ♦ తత్తదలంకృతు లంబికాశివా
జాన్యఖిలార్చనా విధుల ♦ చందముగా వివరించి లోకసా
మాన్య వివాహగానము లు♦మాగిరిశస్తుతి గాఁగఁ బాడుచున్. 20

చ. కనకశలాకలం దెగడు♦కన్యలు గట్టిన బొమ్మరిల్లు శం
భునికడ, బొమ్మ శంకరుఁడు ♦ బోనము గుజ్జనగూడు, వేడ్కఁజే
సినపను లన్నియున్ శివుని♦సేవ యొనర్పఁగఁ బడ్డపాట్లుగా
మనమున నూహసేయుదురు ♦ మానునె తొల్లిటి జన్మవాసనల్. 21

మ. చదువం బెట్టినఁ బట్ట దాత్మలఁ గులా♦చారప్రధానోల్లస
న్మదనామ్నాయతదంగశాస్త్రములలో♦న న్లేశముం జదివిసా

స్పదశైవాగమ మేకవారమె పఠింపన్వాచ్చుఁ గన్యాద్వయం
బుదయంబైన ముహూర్త మెట్టిదొకొ ధన్యుల్తైచ్చఁగా నిచ్చలున్. 22

సీ. శివపూజనాసక్తిఁ జిన్నిచన్నుల పెక్కు, వయసుఁ బ్రేత్యహంబును నయముఁ జూవ
శైవాగమాంతర జ్ఞానంబుఁ దనులతా, ప్రభయు సంతతంబు నభినవముగఁ
బార్వతీప్రాణేశ భక్తియుఁ గూఁకట్లు, వెలసి నానాఁటికి వృద్ధిఁ బొంద
వారకులాచార వాసనాబాల్యంబు, లోకపూఁట కోకపూఁట కుడిగి పోవ

తే. శాంభవంబైన తేజంబు శైశవాప,
గమవయోగణ్య లావణ్య గౌరవంబు
హృదయమున సంగకంబుల నుదయ మొదవఁ,
జదువఁబోవుదు రిరువురు మదవతులును. 23

వ. ఆసమయంబున నియమంబున శ్రీకాళహస్తీశ్వరునకుఁ గవితాచమత్కారంబు మీఱ నత్కీరుండు చెప్పిన నూఱు పద్యంబులు పాఠంబుచేసి నిత్యవ్రతంబుగాఁ బఠించుచుఁ గఠిన కనకకుచకుంభలు శంభుండే తమకుఁ బరమపురుషుండని యుండఁ బుంద్రేక్షుకోదండ విద్యారూఢ కాంతామతల్లి యగు తల్లి డగ్గఱి కే తెంచి యిట్లనియె. 24

## వేశ్యమాత కూఁతులకు వారధర్మ ముపదేశించుట.

మ. వెలయాండ్రండఱు సన్నుతించిరి నను న్వేనోళ్లఁ గాణాచికిఁ
గలిగెఁ దిక్కని మీరు పుట్టినపుడే గారాము నాకింక ని
ష్ఫలమై పోఁ గులధర్మముల్ వదలఁగా భావ్యంబె యోయక్కలా
ర! లతాంతాస్త్రకళావిధిజ్ఞలగు వారస్త్రీలలో నక్కటా. 25

ఉ. ఎన్నఁడు నేర్తురో నడువ నెన్నఁడు నేర్తురొ మాటలాడఁగా
నెన్నఁడు నేర్తురో చదువ నెన్నఁడు నేర్తురొ యాడఁ బాడఁగా
నెన్నఁడు నేర్తురో కళల నింపుదలిర్ప విటాళిఁ గూడఁగాఁ
గన్నియ లంచుఁ బెంచిన సుఖం బిటు సేయఁగ మీకుఁ బాడియే? 26

క. కళలుఁ బ్రమాణంబులుఁ జూ,పులు జాతులు గతులు బంధములుఁ బరిరంభం
బులు సత్త్వంబు లవస్థలుఁ, దెలిసి విటులఁ గలిసి కులముఁ దెలుపఁగ వలదే 27

తే. జిహ్వ నాలుక, జలము రాజీవదళము, నసుసుఁ గుమ్మరిపురువు దేహంబు, గచ్చ
కాయ బూాకిద, పౌరయని కరణి విటులఁ, గలిసియును గలియకుండంగ వలయు లలన.

చ. జిగురునఁబడ్డ రాచిలుక చల్వైన, సంపెఁగపువ్వు తావికిం
దగిలిన మిండతుమ్మెద విధంబునఁ, దేనియుఁ జిక్కినట్టి యీఁ
గ గతి, విటుండు కూర్మిఁ దన కౌఁగిటి పొందునఁ జిక్కుకున్న న
మ్మగువకు నేలయిచ్చు నస మానధనంబులు రిత్తమాటలన్? 29

సీ. మణిమంత్ర తంత్రము♦ల్మందులు మాయలు,సరసభావలువృథా♦సంభ్రమములఁ
దెచ్చుకోలేడ్పులు ♦ నిచ్చకంబులు వట్టి,యానలుఁ దక్కులు ♦ నలసగతులు
నలుకలుఁ దరితీపు♦లాసలుఁ బ్రియములు,నగవులు బిగువులు♦నయము భయము
బలిమియుఁ జెలిమియు ♦ బాసలు ననుపులుఁ, దిట్టులుఁ గొట్టులు ♦ దిట్టతనముఁ
తే. జాయవాటులు నన్నలు♦గాయకములు,మెచ్చులునుదచ్చనలుపౌర♦పొచ్చెములును
దగవులును వారకాంతావి♦తానములకు, జలజలోచనలార! నై♦సర్గికములు. 30

క. ననుపువిటునిఁ దక్కుచు నా,తనిచెలికానికిఁ బ్రియంబుఁ♦ దగఁజెప్పిన న
వ్వనితపయి న్విఱుగదు మన, మనుమానములేదు ధనము ♦ ననుపుగఁ జేరున్. 31

తే. వేకువలయందు విటునిచే ♦ వీడియంబుఁ, బుచ్చుకొనఁ దగ దింతికిఁ ♦ బుచ్చుకొన్న
నూరనూరంగఁద్రవం♦బుమియ వలయు, వెఱఁదులకు మందుఁ బెట్టెడు♦ వేళ గాన. 32

చ. కలహముచూపుచూపు దొలు♦కారు మెఱుంగులు, తర్జనోక్తి గ
ర్జలు కపటాశ్రువృష్టి బలు♦చాయల మేఘము లావిలాసినీ
తిలకము పల్లవావళి మ♦దిం జనియించిన మోహశాలికం
దళములఁ బ్రోది సేయక వృ♦థా వసియించిన నర్థ మబ్బునే. 33

చ. మగల మనోనివాసముల♦ మానిని దృఙ్మదనాస్త్రపావకుఁ
దగులు కొనంగ రగిల్చి చిఱు♦న వ్వనుగందపుఁగొండగాడ్పుచేఁ
బొగ లెగయించి పల్కు నెయి♦వోయుచు మండఁగ మాయకట్టెచే
నెగసనఁ ద్రోచి యార్పఁ దగు ♦ నించుక యించుక కూర్మి తుంపరన్. 34

సీ. రసికులు మీగాన♦రస మాన వచ్చిరి, పాడరే శివభక్తి♦పాటగాను
జాణలు మీవిలా♦సముఁ జూడ వచ్చిరి, చూడరే శివభక్తి♦ చూఱ వోను
పల్లవుల్ మీతోడ♦ భాషింప వచ్చిరి, పలుకరే శివభక్తి♦ పాటి పోను
పార్థివుల్ సకలసం♦ పదలీయ వచ్చిరి, పిలువరే శివభక్తి♦ పెంపు చెడను
తే. ధనము గలిగిన జంగమా♦ర్చనమొనర్ప, శివున కఖిలోపచారముల్♦ సేయవచ్చు
వనజముఖులార! నాసరి♦వారిలోన, సిరుల మెఱయుచుఁ దలయెత్తి♦ తిరుగవచ్చు.

వ. అని యిత్తెఱంగున మెఱుంగుఁబోఁడులకు వెలయాండ్ర పోణిమిఁ దెలుపఁ దమతలం
వులకుఁ గొలుపకున్న వారును గన్నతల్లి కిట్లనిరి. 36

### వేశ్య లిర్వురును వారధర్మమును రోయుట.

క. శ్రీకాళహస్తిపతిపద,కోకనదారాధనంబె ♦ కులధర్మము త
ల్లోకవ్యాపకచిద్వి,ద్యాకారస్మృతియె కాణ♦యాచి మదంబా. 37

మ. మణిమంత్రౌషధశక్తిచే విటులఁ బ్రే♦మగ్రస్తులం జేసి త
న్మణిభూషాదులు పుచ్చుకోఁ గొలుపద♦మ్మా బుద్ధి; రుద్రాక్షమే

మణి, పంచాక్షరి మంత్ర, మౌషధము భస్మం, బాత్మనాథుండు ద
క్షిణ కైలాసవిభుండు, భక్తి దమకుఁ ♦ శ్రీ, వాద మింకేటికిన్. 38

సీ. శివు నపేక్షించిన♦చిత్తంబు చిత్తజా,యత్తమై విటులపై ♦ నాసపడునె
పరశివ స్తుతికథా♦భాషలు వినువీను, లానునే కుంకెన ♦ లాడుపలుకు
లీశ్వరేశ్వరమూర్తి ♦ నీక్షింపఁగోరెడు, చూపన్యరూపంబుఁ ♦ జూడఁ జను నె
ముక్తివల్లభు ననురక్తిఁ గూడఁ దలంచు,కాయంబు గూడునె ♦ కాముకులను

తే. హరుని భవహరు శ్రీకాళ♦హస్తినిలయు, వినుతి యొనరించు జిహ్వక ♦ మనుజతతికిఁ
బ్రియముఁ జెప్పంగఁ బోవునె♦నయముమీఱ,వారధర్మోపదేశంబు♦వలదు తల్లి.39

ఉ. ఒక్కనిఁ దల్పుమూల మఱి♦ యొక్కనిఁ దల్లిగృహంబులోన వే
ఱొక్కని బోటిగేహమున ♦ నొక్కనిఁ జెల్లెలియింటిలోన నొం
డొక్కనిఁ జుట్టముంబలె యథో♦చితచౌర్యరతిప్రసక్తిమై
నొక్కని నొక్కరుం డెఱుఁగ♦కుండ రమింపఁగ నమ్మ నేరమే? 40

ఉ. దారువనీమునీంద్రకుల♦దారభుజంగుఁడు, భక్తబల్హణ
స్మారమణాంగనామణిభు♦జంగుఁడు, ముక్తివధూభుజంగుఁ, డి
చ్ఛారచితాంగభూషణభు♦జంగుఁడు, మాకు భుజంగుఁడమ్మ ని
స్సారమనుష్యమాత్రుఁడు భు♦జంగుఁడు గాఁడిఁక మాట లేటికిన్. 41

క. మగువకు శరీర మొసఁగిన, మగఁడు చిదంగనకు మగఁడు♦మామాసతికిఁ
మగఁడు మగవేల్పులకుఁ దగు, మగఁడు మగఁడుగాక మాకు♦మనుజుఁడు మగఁడే.42

చ. అమృతము గ్రోలు జిహ్వ చవి♦యంచుఁ దలంచునె తేనె? నింటిలో
నమరమహీరుహం బుదయ♦మైన నరుం డడవీశు వేఁడు నే?
యమిజనభాగ్యరూప మగు♦నాదిమతత్త్వము గాళహస్తిదై
వము భజియించుమానసము♦ వారవధూమదసౌఖ్య మెంచునే? 43

వ. అని తన యుపదేశంబు కర్ణపర్వేశంబుగానీక యున్నఁ గన్నతల్లి చిన్నంబోయి.44

కూఁతులవిరక్తికై వేశ్యమాత చింతించుట.

శా. ఈ కేళీసదనంబు లీమృగమదం♦ బీచంద్ర మీచందనం
బీకాశ్మీరము లీతులాంబరము లీ♦హీరాది రత్నాంకితా
నేకాలంకృతు లీకరండనిచయం♦ బీతూఁగుమంచంబు లే
నీకన్యార్థముగా ఘటించితిని దా ♦ రీక్షింప రింకెట్లొకో. 45

ఉ. కన్నులు చిత్తజాతుఁ డొక♦కాలము నేయని పుష్పబాణముల్
చన్నులు శృంఖలారహిత♦శంబరజిన్మదకుంభికుంభముల్
ప్రన్నని నవ్వు కాఱడవిఁ♦బర్విన వెన్నెల దేహకాంతిసం
పన్నత తప్తహేమరుచి ♦ భామలు పల్లవభోగ్య లౌదురే. 46

ఉ. ముట్టనిచిత్తజాతుశర♦ముల్ దెలిగన్నులు, రాజకీరముల్
ముట్టనిపక్వబింబములు ♦ మోవులు, చన్నులు మిండతుమ్మెదల్
ముట్టని పుష్పమంజరులు ♦ మోములు రాహువు దంష్ట్రికాగ్రముల్
ముట్టని చంద్రు, లింతు లలి♦ ముట్టని లింగము తోట చిత్రమే. 47

మ. పదకంబుల్ గొలనూళ్ళు బాహుపురులున్ ♦ బంగారు డంకంబు లం
గదముల్ ముంగర లుంగరంబులు మణి♦ గ్రైవేయముల్ దెచ్చి యి
చ్చెద మంచున్ నృపనందనుల్ చెలులచేఁ ♦ జెప్పించినం బల్కరీ
సుకతుల్ వారలతోడ సక్కటికటా♦ హామ్మెల్ల నమ్మయ్యెనే. 48

ఉ. ఏ నెఱజాణలైనఁ గమ♦లేక్షణల న్మణిమంత్రతంత్ర వి
ద్యానవచాతురీమహిమ♦నైనను మందులనైన నీశ్వర
జ్ఞానము మాన్పి కామసుఖ♦సక్తులఁ జేసిరయేని యిత్తుఁ గా
నైనను బుచ్చుకోక తమ♦లాస్యల కన్నతికంబు వారికిన్. 49

—ఈశ్వరుఁడు త్రోవలో వేశ్యలం గాపాడుట.—

శా. ఈగీతిం గుమతోక్తులన్ జనని త♦న్మిత్రాండ్రడింప నారాటమున్
బోరాటంబు ఘనంబులైనఁ బరశం♦భుం గాళహస్తీశ్వరున్
జేరంబోవక మానదింక మదిలోఁ ♦ జింతింప నివ్వీట నె
వ్వారు చోటికి నమ్మి నెమ్మిఁ గొనిపో♦వన్ శక్తు లుద్యుక్తులై. 50

క. ఏధన్యులు మము హిమగిరి,జాధవునిం గాళహస్తి♦సర్వేశ్వరునిన్
బోధమయున్ సంసారాం,భోధితరణిఁ గొలువఁ దోడుక♦పోయెద రనుచున్. 51

మ. తలపోయం దమపంచతిన్నియల మీఁ♦దం జంగముల్ వోలె ని
చ్చలు దొంగుండెడు కన్నగాండ్రు విని రా♦జద్వారముల్ సొచ్చి కా
వలికాండ్రం గనుఁబ్రామి చొప్పడఁచి తో♦వల్ దప్పిపో నేల యిం
తుల నమ్మించినఁ గాళహస్తి కని వ♦త్తుర్ దక్కఁ దద్ద్రవ్యముల్. 52

మ. అని యక్కన్యలఁ జేరఁగాఁ బిలిచి యే♦లా తల్లితోఁ బోరఁగాఁ
బనిలే దాతిరు కాళహస్తిపతిఁ జూ♦పన్ మాది భారంబు, మా
వెనువెంటం జనుదెండు, నమ్ముఁడు నిశా♦వేళం బ్రయాణంబు రం
డన భక్తిన్ శరణార్థిఁ జేసి తమసో♦హం బెల్లఁ జెల్లించుచున్. 53

సీ. కుట్టిన చెంగావి♦గుడ్డలమొసికట్టుఁ, బొంకపుఁ దామ్రతా♦టంకములును
వివిధవస్త్రచ్ఛేద♦విరచిత కంథలుఁ, బూత విభూతి త్రి♦పుండ్రకములుఁ
గరమూలముల వ్రేలు♦కప్పెరల్ జోలెలు, భద్ర రుద్రాక్షు♦లైన పథ్యకములు
శివసూత్రబంధభా♦సిత శంభులింగముల్, పెట్టెస కుఱుమాపుఁ♦బుట్టములును

తే. జిగురు డాకేల భసిత భ♦స్త్రికలుఁ దనర, దొంగజంగము లెలయింప♦జంగమాంగ
నావిలాసంబుఁ గైకొని♦నళినముఖులు, కాళహస్తీశు దర్శించు♦కాంక్షఁగదలి. 54

ఉ. ఇద్దఱు కింటిబిడ్డల న♦నేకధనంబుల వారి చేతికిన్
ముద్దియ లిచ్చి యాతపసి ♦ ముచ్చుల నచ్చి గృహంబు పాడుగా
నద్దమరేయిఁ బోయిరి శి♦వా యని పల్కుచు రెండ రామడల్
బొద్దు పొటుక్కునం బొడువ ♦ భూధరకూటము లెక్కి డిగ్గుచున్. 55

వేశ్య లిర్వురును గాళహస్తికిఁ బయనంబగుట.

తే. తప్పు త్రోవల నీరీతిఁ ♦ జొప్పు మార్చి, కుంభకోణంబునకు శాత♦కుంభకుంభ
ఘనపయోధరకుంభలు ♦ గడచి చనిరి, భేశరేఖావతంసుఁ గుం♦భేశుఁ గొలువ.

ఉ. అక్కడనుండి వారు సుఖ ♦ మైన ప్రయాణమునం జిదంబరుల్
ద్రొక్కుల యిక్క తాండవస♦ముద్ధతపాదనిపాతితాంగదుల్
వాక్కమలేశమానసని♦వాసభవుల్ శివకామసుందరిన్
బ్రక్క ననారతంబుఁ బెడఁ♦బాయఁగ నీని జితాంగసంభవున్. 57

క. కలిభంజనదక్షుఁ బతం,జలిమౌని వ్యాఘ్రపాద ♦ సంయమిపూజా
ఫలమూర్తిన్ గనకసభా,నిలయు విలయనటనచటుల ♦ నిటలోగ్రాక్షున్. 58

క. వచ్చి భజియించి రచ్చో, నుచ్చరదంబుచరచంక్ర♦మోగ్రస్వనమై
యుచ్చావచవీచీపా,టచ్చురహ్రుతవియదసితప♦టలమగు నబ్ధిన్. 59

సీ. దరిఁదన్ని తిరిగెడు♦తరఁగలు చనుదెంచు, తరఁగలు నొండొంటిఁ♦దాఁకు రవము
గుములు గూడుక కంధ♦రము లాకసము డిగ్గి, నీరంబుఁ గ్రోలెడు♦నిబిడరవము
మబ్బునఁ గసరెత్తి ♦ యుబ్బి యంతంతకుఁ, బొరలంగఁ బడియెడు♦భూరిరవము
ననుదినపూర్వాప♦రాహ్ణ వేళలఁ బోటు, పొడిచి విచ్చిననీటి♦భోరు రవము

తే. దశదిశాభాగములఁ బ్రతి♦ధ్వనులనీన, వలయుశైలాది గిరిగుహా♦వాససింహ
శరభ శార్దూల హృదయభీ♦కరములగుచుఁ, దనరు నైజంబులుగమించు♦వనధిరాజు.

క. భంగపరస్పరఘట్టన,భంగనముద్భూత బిందు♦పటలంబు మరు
త్పుంగవులకుఁ దానొసఁగు న,భంగుర మౌక్తికవితాన♦భంగిం దనరెన్. 61

క. రత్నము లిభరత్నముఁ దరు,రత్న వధూరత్న ధేను♦రత్నంబులు గ్లౌ
రత్న మమృతరత్నము హరి,రత్నమునుం గలిగి మెఱయు♦రత్నాకరమున్. 62

సీ. తనయందుఁ బవ్వళిం♦చిన నీలవర్ణుని, నీడ నీరం బెల్ల ♦ నిండె ననఁగఁ
హేళికి నోడి తా ♦ నెటకుఁ బాఱఁగ లేక, తనయందుఁ దిమిరంబు ♦ దాఁగె ననఁగఁ
దనయందు బడబాగ్ని ♦ ఘనతరజ్వాలలు, మండఁగ నుదరంబు ♦ మాఁడె ననఁగ
జంబూఫలద్యుతి ♦ నంబరం బంతయుఁ, దనయందుఁ బ్రతిఫలిం♦చినది యనఁగ

తే. సీరదవ్రాత పురుహూత • సీలకజ్జ, లాతసీవుష్ప కస్తూరి•కాళిజాత
సన్నిభచ్ఛాయఁ గనుపట్టు•నాగరేంద్రుఁ, గాంచి రద్దేవు పూర్వభా•గమునవారు
ఉ. అచ్చట బ్రముచ్చులుఁ జలరు•హాక్షులునుం బయనంబుఁ జేసి వే
వచ్చిన నొప్పిఁ దీర్చుకొని • వర్ణమయిం శివకామసుందరిన్
జిచ్చుఁజకంటి కాహుతిగఁ • జిత్తజుఁ జేసిన యొజ్జఁ దాండవం
బిచ్చల నింగి రచ్చ రచి • యించినకర్తకునిన్ భజించుచున్. 64
వ. మూఁడవనాఁ డాపురంబు రేపకడ వెడలి యడవి నడుమ నడచునప్పుడు. 65

దొంగలయత్నంబుల నెల్లఁ బరమశివుఁడు వారించుట.

ఉ. ఇక్కడఁ గూయి చెప్పుటకు • నెంతయు దూరవుఁజొప్పు మార్చిపో
నిక్కడ వైపు నట్టడవి • యిక్కడఁ జేరువ నూరు పల్లె లే
దిక్కడ నెవ్వరుం దిరుగ • రిక్కడ నేఁడిదె ప్రొద్దు దోఁచుకో
నిక్కడ వాట మంచు మది • నెంచఁగ వారికి నక్కడక్కడన్. 66
ఉ. రాజును సేనయుం, శబర • రాజుఁ బుళింద భటాళియుం, వణి
గ్రాజును వైశ్యులుం, దపసి • రాజును శిష్యతతిం, గపాలభృ
ద్రాజును జోగిపిండుఁ, బశు•రక్షకరాజును గొల్లవాండ్రు నై
రాజధరుండు దోఁచు నుకు•రాజముఖీమణి రక్షణార్థమై. 67
శా. ఊరూర న్విడిదిండ్లఁ జంపుటకు ను•ద్యోగింపఁగా జంగమా
కారం బొప్పఁగ వచ్చి పూజఁగొని శ్రీ•కాళద్విపేశుండు యో
పారత్నంబుల కాత్మవిద్య యుపదే•శం బిచ్చు వ్యాజంబునం
గారుణ్యంబున వారినిద్ర యుడుగం•గాఁ జేయు నక్తంబులన్. 68
శా. ఆదొంగల్ దెగి యిట్లకృత్యములు సే•యం జూడఁగా దేవతా
చూడారత్నము వారియత్నముల కెం•చ్చోఁ గూడకుండం సుఖ
క్రీడం గన్యలఁ గొంచుఁ బోఁ గనిరి భ•క్తిం ముందర న్మందర
క్రీడాకృత్తిరుకాళశైలకృదజ • శ్రీభంగశృంగంబులన్.
చ. కనుఁగొని యారణీతటినిఁ • గాయము దోఁచి తదీయ సైకతా
వని నభవుం భజించి యప•వర్గరమావిభు వాలిపూజసే
సిన శివలింగముం గొలిచి • సిద్ధుల కయ్యణిమాదిసిద్ధు లి
చ్చిన పరభైరవుం దలఁచి • చిత్తములోపలఁ దన్మహత్త్వమున్. 70
వ. తెలియఁగోరి యుడుగుటయు నప్పౌరాణజ్ఞు లగుపౌరు లిట్లనిరి. 71

వాలిపూజించిన శివలింగకథ.

ఉ. ఒక్కసరోవరం బచట • నుండఁగఁ దొల్లి తదీయతీరమం
దక్కపిరాజు వాలి రచి•తాసనుఁడై తనసజ్జలింగము

న్నిక్కపు భక్తిఁ బీరమున ♦ నిల్పి భజించుచు నుద్వసింపఁ బో
నక్కడ దేవుఁడుండఁ బ్రియ ♦ మందుచుఁ జేతికి రాక తక్కనన్. 72

క. ఒకచేతఁ బట్టి తివిసిన, నొకయించుతయుఁ గదలకున్న ♦ నొగి మోఁకారిం
చుక బలిమి రెండు చేతులఁ, బెకలింపఁగఁ బూనుటయును ♦ భేదిలకున్నన్. 73

ఉ. గ్రక్కున లేచి వాలమున ♦ గాఢతరంబుగఁ జుట్టి పిక్క లు
క్కెక్కఁగఁ ద్రొక్కి నిల్చి తను ♦ వించుక వంచి కరంబు లూరు లఁ
నొక్కి ముఖాంబుజంబునఁ ♦ గనుంగవఁ గెంపు జనింపఁ జేనమై
నిక్కఁగఁ గ్రుంగెఁ బాదములు ♦ నేలఁ జలింపకు లింగ మేమియున్. 74

క. వాలముబిగువున నతదిగ్వాలుని దేహంబు తఱులు ♦ వడుటయు భీతిఁ
జాలిఁబడి వాలి నేలకు, వ్రాలి ప్రణామంబు లెన్ని ♦ వలసినఁ జేసెన్. 75

క. చేసి మహేశ్వర నీకేఁ, జేసిన యపరాధ మెద్ది ♦ చిత్తంబున నఁ
రోసియొ భుజబల మెనఁగఁగఁ, దీసిన రావైతి వేది ♦ తెలఁగిందులకున్? 76

క. ఒకపూఁటయు మిము దర్శింపక యుండఁగ లేని నన్ను ♦ భక్తమరున్నె
చికి నిమిషములో విడిచితి, వకటా నిష్కారణము కృ♦పాంబుధివయ్యున్. 77

సీ. నాపాలి మూలధ♦నంబవు నాపాలి, భాగ్యదేవతవు నా♦పాలి నిధివి
నాపాలి దేవర♦త్నమవు నాపాలికల్పకపాదపమవు నా♦పాలి మతివి
నాపాలియిహసాధ ♦ నంబవు నాపాలి, పరసాధకుఁడవు నా♦పాలి గతివి
నాపాలి శుభకార♦ణంబవు నాపాలి, పరమపుణ్యమవు నా♦పాలి సిరివి

తే. దేవ నాపాలి దేవతా ♦ ధేనుమణివి, శూలి! నాపాలితంగేటి♦జున్న వీవ
నన్ను విడనాడఁ గతమెద్ది♦నతనిలింప! యేమి యపరాధ మొనరించి♦తీశయనుడు.

చ. పరశివలింగ మింద్రజుఁ గృ♦పామయదృష్టిని జూచి యేటికిఁ
బొరలఁగఁ జత్త మీకొలని ♦ పొంత వసింపఁగ వేడుకైన సు
స్థిరగతి నిల్చినాఁడ విర♦తి న్నినుఁ బాసిన వాఁడఁ గాను ద
త్పరత భజింపు మెప్పటివి♦ధంబున నీ మదిలోన నుండెదన్. 79

చ. అని తనసజ్జలింగము ద♦యాతిశయంబున నానతిచ్చిన
న్నిని యిచట న్వసింతు నను ♦ వేడుక దీఱు సరోవరంబుఁ బూ
డ్చినఁ దనయంత శంకరుఁడు ♦ చేతికి వచ్చునటంచు గోత్రభి
త్తనయుఁడు నిస్సమహానగము ♦ దానిపయి న్వడిఁ దెచ్చి వైచినన్. 80

క. దశదిశలఁ దత్సరోవర,విశదపయఃపూర ముబ్బి ♦ వెడలఁగఁ దొడఁగెఁ
శశిధరునిదండ దక్షిణ, దిశ నిర్ఝరజలము ధరణిఁ ♦ దేలుచుఁ బొడమెన్. 81

మ. ఇది తీర్థోత్తమ మిందు నాఁకిన నరుం ♦ డీఘోరసంసారదుః
ఖదవాగ్నివ్యథఁ బాయుఁ బంకరుహదృ ♦ క్కంజాతగిర్భాదిక \

త్రిదశుల్ గూడి చరింతు రిందు నణిమా♦ద్యష్టప్రియా భైరవా
స్పద మిక్కొండఁ జరించుచుండు నుమతో ♦ సర్వేశ్వరుం డిమ్ములన్. 82

సీ. ఎఱుకు లీగిరి మీఁద♦నిచ్చఁ ద్రిమ్మర నయో,మయసాధనములు హే♦మంబు లగును
శబరులు మృగములఁ ♦ జంపి యిమ్ముల డిగ్గి, వచ్చునాలో సజీ♦వంబు లగును
వ్యాధు లీకొండపై ♦ వన్యాశనంబులు, సేవింపఁగాఁ గాయ♦సిద్ధి యగును
జెంచు లీయద్రి ని♦ద్రించి మేల్కొనువేళఁ, దమవధూటులు తల్ప♦తలము లగును

తే. దృశ్యమగువారి కిందు ని♦ధివ్రజంబు, దృశ్యమగుఁ గూడితమతోడఁ♦దిరుగుజనము
విస్మయముఁ జెప్పనొక్కొక్క♦వేళ దీని,సానుభూములు మహిమాతి♦శయవిధంబు.

క. దానవసుతుఁ డాలింగముఁ, బాసి చనఁగ లేక గాసిఁ ♦ బడియుం దనుఁ దా
రోసియుఁ బలునిట్టూర్పులు, నేసియు నాఁడెల్ల నుపవ♦సించుచుఁ జనియెన్. 84

మ. ఇది యీ తీర్థమహత్త్వ మీ మహిమ వా♦ణీశ ద్విజిహ్వేశులుం
దుదిముట్ట న్వినుతింప లేరు నరమా♦త్రుల్ చెప్పఁగా శక్తులే?
సుదతీ రత్నములార! మీరు పరమే♦శుం గొల్చి యీప్రొద్దు నె
మ్మది నిచ్చోట వసించి పొందనగు రా♦మల్ సంతసం బందుచున్. 85

ఉ. మజ్జన భోజనాదులకు ♦ మాపు శయించుటకున్ వధూమణుల్
సజ్జన గేహమొక్కటి వి♦చారము చేసి యొనర్చి వాలిపెన్
సజ్జఁ దొలంగి యచ్చటఁ బ్ర♦సన్నత నిల్చిన లింగముఁ భవా
పజ్జలరాశికుంభజుని ♦ భక్తి భజింపఁగఁ బోవునంతటన్. 86

## సూర్యాస్తమయాదివర్ణనము.

శా. సాయంకాలరఘుక్షితీశ్వరుఁడు కెం♦జాయ న్ముఖం బొప్పఁగా
డాయ న్వచ్చి తమిస్రసతీవ్రతరకాం♦డధ్వస్తపాదంబుగాఁ
జేయం జక్రవధూధరాసుతకు వి♦శ్లేషవ్యథాపాదియై
మాయా హేమమృగంబునాఁ బడియె న♦మ్మార్తాండుఁ డస్తాద్రిపై 87

క. పంకేరుహ ప్రతిబింబము, గ్రుంకఁగఁ దిమిరం బజాండ♦గోళము నిండెన్
శంకాతమఃపరంపర, శంకరచంద్రహితమాన♦సంబును బోలెన్. 88

తే. తపనుఁ డుదయింపఁ గద్బింబ ♦ దర్శనమున, లోకపాతకపటలంబు ♦ లోఁగిపటిచి
యతఁడు గ్రుంకినఁ జనుదెంచె ♦ ననఁగఁ బర్వి, యంధకారంబు జగమెల్ల♦నాక్రమించె

సీ. వామాంగభామినీ ♦ శ్యామధామాళియుఁ, గంఠహాలాహల♦కాళిమంబు
నాకాశకేశపా ♦ శాసితచ్ఛాయయుఁ, జూళికాసింధుశై ♦వాలరుచియుఁ
గరకృష్ణసారాగ్ని ♦ ఘనధూమనీలిమ, శేషభూషణఫణా♦సీమనలుపుఁ
గటితటకీలిత ♦ కరటిచర్మద్యుతి, మేచకశ్రీలతో♦ భాచయంబు

తే. భువనలోచను పై నెత్తి ♦ పోవునంధ, కారబృందంబునకుఁ దోడు ♦ గాఁగఁగూర్చి
వెనుక నేతెంచుభూతేశు ♦ విధముదనరఁ, జంద్రుఁడుదయాద్రిపై నొప్పె ♦ సాంద్రకాంతి.

చ. తిమిరదినేంద్రజాలములఁ ♦ దెచ్చి యజాండఘటంబునందుఁ బో
సి మరలఁ బశ్చిమాశ యను ♦ చెల్వ వహించిన పద్మరాగకుం
భముగతి సూర్యుఁడుం జనియెఁ ♦ బ్రాక్సతి వెన్నెల వేల్పుటేటితో
యను వడఁ బోయు హేమకల ♦ శాకృతిఁ జంద్రుఁడు నొప్పె నయ్యెడన్. 91

ఉ. కాముకహృద్దధిం గలఁచు ♦ కవ్వము బువ్వము దేవకోటికిన్,
వ్యోమపథంబు తేనె పెర ♦ కొప్పెడు పర్వము మవ్వముత్పల
శ్రీమతికిన్, జకోరమహి ♦ మీమధుపాళికిఁ బ్రోచునన్నమై
యామవతీశబింబ ముద ♦ యాచల మెక్కెఁ బ్రభాళి పెక్కువన్. 92

ఉ. వెన్నెలగుజ్జు నంజుకొని ♦ వెన్నెలప్రోవు భుజించి, నాలిక
న్వెన్నెలగ్రోజ్జుఁ జాలఁగొని ♦ వెన్నెలతేటలఁ ద్రావి వేడుకన్
వెన్నెలక్రాను జుఱ్ఱుకొని ♦ వీథులయందుఁ జకోరదంపతుల్
మిన్నులుముట్టి వెన్నెలలు ♦ మేపుచుఁ బిల్లలుఁ దాము నాడఁగన్. 93

క. వాలీశ్వరభైరవులం, బాలికలు భజించి భూత ♦ పతి నభవుని శ్రీ
కాళద్విపేశు మదిలోఁ, గీలించుచు విడిదియింటి ♦ కిం జని పిదపన్. 94

క. ఆజంగములును దారును, భోజన మొనరించి వాలి ♦ పూజించినయా
రాజకళాధరుచరితము, రాజముఖులు చదువుకొనుచు ♦ రాజిల్లంగన్. 95

శా. తారాప్రోష్ఠులఁ గాలసూతుఁడు వియ ♦ ద్వారాశి వేటాడి ప్రా
ష్ణారంభం బను బుట్టఁ బెట్టి నులివా ♦ యం గుంజి యీఁదాఁటఁ జె
న్నారన్ వైచిన జాలమో యనఁగ శో ♦ భాకించనత్వంబునన్
దారానాయకమండలం బమరె న ♦ స్తగ్రావకూటంబునన్. 96

ఉ. చీఁకటికానచిచ్చు, భవు ♦ చేలకుసుంభము, తూర్పుకొండకున్
గూఁకటి రత్న, ముజ్జరమ ♦ కూరిమిపంట, చకోరరాజిపే
రాఁకటిమంట, శోణకిర ♦ ణావళిగంట, రథాంగకేళికిం
దేఁకువపెంట, మింటఁ జను ♦ దెంచె దినేంద్రుఁడు కాలఘంటయై. 97

క. అంతట భక్తస్వాంతని, శాంతు నుమాకాంతు హరు ని ♦ శాంతసపర్యన్
గాంతలు సేవించుచు నా, శాంతంబున నెండమొలక ♦ లలరఁ బయనమై. 98

దొంగలు విఫలమనోరథులై చనుట.

ఉ. నాఁ డొకపల్లె కేగి మఱు ♦ నాఁ డుదయార్చన సేయఁ గోరి పూఁ
బోఁడులు భూరిసత్త్వకుల ♦ భూత్కృతి ఘాంకృతి ఘుర్ఘురధ్వనుల్

గాఁడి చెవుల్ పగుల్ప ఘన♦కాననమధ్యసరస్తటంబునన్
మూఁడవకంటివేల్పుఁ దమ♦ముందరఁ బెట్టుక నిశ్చలస్థితిన్. 99

శా. ఆరాధింపఁగ దొంగజంగములు నే♦ డజ్ఞాన్యలం జంపి భూ
షారత్నాదిధనంబుఁ బుచ్చుకొని యి♦చ్ఛావృత్తిఁ బోవచ్చుఁ గాం
తారంబుల్ వడి నిర్గమించి యటుగా♦దా మాపటీసందునన్
జేరం బోదురు కాళహస్తి కనుచుం ♦ జింతింపఁగా నంతటన్. 100

శా. అప్పాపాత్ము లరిష్టసాధ్వసము సే♦యం జెల్లియల్ మెల్లనే
యప్పా! చూడు మటన్నఁ గన్నె నగి యో♦యమ్మా! పరాకేటికే
చెప్పం జూపఁగరాని లోకజనకున్♦శ్రీకాళహస్తీశు మా
యప్పయ్యన్ భజియింప నేమయిన నే♦మయ్యె న్మదిం జూడవే. 101

క. నావుడుఁ దదేకనిష్ఠా,పావన భావనసమాధిఁ ♦ బరవశు లగుచున్
సేవింపంగా నంతటఁ, బూవుంబోణులకు వేడ్క♦పుట్టం గరుణన్. 102

సీ. శ్రీకాళహస్తిగౌ♦రీపతి స్తోత్రముల్, పెట్టిన వెలిబూఁది♦ పెండెకట్లు
గళములఁ గుఱుబోడ♦ తలల రుద్రాక్షముల్, గండచలత్తామ్ర♦కుండలములు
ధాతురాగాంగవ♦స్త్రమ్ములు గోఁచులు, నెడమముంజేతుల♦నెసఁగుసజ్జ
లును దీవ్రధావనం♦బునఁ బుట్టు చెమటలుఁ, జెదరి పువ్వులు గోయు♦శీఘ్రగతులు
తే. గలుగు ప్రమథులతోడ శ్రీ♦కాళహస్తి,శివుఁడు సనుదెంచెఁ దనుఁబూజ♦సేయ వలచి
పత్రపుష్పఫలంబులు♦ భక్తిఁ దెచ్చు, ద్రవిళజంగమ వేషంబు ♦ లవధరించి. 103

క. ఆకలకలమునఁ జిత్తం, బాకులతం బొంద దొంగ ♦ లడవులపాలై
కాకుల తెఱఁగునఁ జని రే,కాకు లగుచు నొకరి నొకరు ♦ గానక భీతిన్. 104

### ఇద్దఱుస్త్రీలును సాయుజ్యంబు వడయుట.

క. మదనారియు నాపిమ్మట, సుదతులఁ గదియంగఁ బోయి♦ చూపులఁ గరుణం
బొదలఁ గనుంగొని వారల, నిది యే మిచ్చోటనుండ ♦ నిటువలె నన్నన్. 105

శా. ఆయయ్యన్ గని మ్రొక్కి ధన్య లగుక♦న్యల్ దమ్ము నమ్మించి య
మ్మాయాజంగము లిచ్చఁ దెచ్చుటయు నా♦త్మస్వర్ణభూషాదు ల
న్యాయంబూని హరింపఁ బూనుటయుఁ దా ♦ రచ్చోటి కాలోన వి
చ్చేయం గన్గొని దొంగ లేగినదియుం ♦ జెప్పం గృపామూర్తియై. 106

క. మాయమ్మలార! కరుణా,తోయనిధిం గాళహస్తి♦తుహినాంశుధరున్
శ్రేయోనిధి నారాధన, సేయం గొనిపోయెదము ప్ర♦చింత యుడుగుఁడీ. 107

వ. అని యాదరించి తలోదరుల ముందరఁ బెట్టుక నెట్టుకొని జీవులంగొట్టురట్టునకొడిగట్టువేలువుగట్టివాయిదెస వెండిగట్టు నాయలేక తోకొనిపోవఁ ద్రోవ నావనదేవ

తలు తనకు నర్చనలొనర్చు నేరు పేఱుపడ సమీరకుమారప్రేరితకుసుమితలతాగళితప్ర
సూనంబులుఁ బూఁదేనియ సోనలతానంబులు మధుపవితానానూనతానమానంబు
లు నగురుగుగ్గులు పటీరతరు పరస్పర కషణజనితానలధూపధూమంబులును గభీర నదీ
తీర సదారాధక నీవార ముష్టింపచ శైవభారతీ పరిచయ ధురీణ కీర శారికా వ్యాహార
మంత్రంబులుఁ దృణీకృత గగనమణి దక్షిణరజతగిరి మణిగణ ఘృణి నీరాజనంబులును
సరభసేభ సైరిభ శరభ హరిప్రభృతి మృగ విభు సభా గభీర నినద గిరి దరీభవ
ప్రతిరవఘుమఘుమాకార వాద్యంబులును బనసరసాల సాల హింతాల రంభా
జంబూ జంబీరకపిత్థ భూరుహ పతత్ఫలోపహారంబులును వలసిన యెడల నిరుగడల
నడుమఁ బెడగడలి కుంభసంభవ కుంభినీధర కన్యాంభోరుహాకహ్లారాది సౌరభంబు
లును గంగోత్తమాంగలింగాంగరాగీకృత గంధసార ఘనసార కుంకుమసంకుమద
మృగమదామోదంబును నారామసీమామాకంద మందార కర్ణికార నమేరు దేవదా
రు మాలూర కేసరకుటజ వకుళ మల్లికాది ప్రసూన వాసనారాశి నీసునం దమయుం
దుఁ బెనఁగొనఁగొను శీతలవాతపోతంబులును యాతాయాత భూతేశ్వర పథిప్రయా
సంబు నపనయించుచుఁ జనుదెంచె. చంచత్పంచాస్యంబును నటన్నీలకంఠంబును
విలసితశివంబును నాశ్రితలూతావాతాశమాతంగ కిరాతంబునై యేవంకఁ జూచిన
శంకరాకార స్మరణకారణంబై సమున్నత శిలావిలిఖిత ఖతలంబును జతుర్భుజచతు
ర్ముఖ శతమఖావధి నిర్జరలోచనాగోచరంబును మునిజన భాగధేయంబును ననపాయ
సుఖప్రదాయకంబును బురాణవాణీప్రణీతమహిమంబును గణనాతీత ప్రభావంబునై
యురులింగసముల్లాసంబు ననుకరించు దక్షిణకైలాసంబు కట్టెదుటం బొడగట్టె నట్టి
యెడఁ బడంతులడవి వెడలి యెడపడని సంతోషంబున నొడయనిం గొనియాడిరి.
ద్రవిళజంగమపుంగవుండును సంగడిం జనుదెంచు జంగమలింగంబుతోడం గూడి ప్రస
న్నకాళహస్తి హిమగభస్తిచూడామణి పొంతకు నేతెంచునంత నంతర్ధానం
బవధరించిన. 108

మ. తమలోన న్మధురాపురాంగనలు చో♦ద్యం బంది శ్రీకాళహ
స్తిమహాదేవుఁడు జంగమాకృతివిభూ♦తిఁ భృత్యులం గూడి వ
చ్చి మదీయ వ్యథఁ దీర్చి యాత్మనగరీ♦సీమోపకంఠంబుఁ జే
ర్చి మఱుం గొక్కటి పెట్టి పోయె నిఁక నే♦రీతిం గనుంగొందు మో. 109

సీ. చింతింప లేమైతి ♦ మంతకాంతకుఁ డని, యెఱుఁగమైతిమి పార్వ♦తీశుఁ డనుచుఁ
దెలియమైతిమి మది ♦ దేవదేవుం డని, పట్టమైతిమి ఖండ♦పరశు వనుచుఁ
గానలేమైతిమి ♦ గంగాధరుం డని, భావింపమైతిమి ♦ భర్గుఁ డనుచుఁ
దలఁపలేమైతిమి ♦ దర్పకాహితుఁ డని, యెన్నమైతిమి జగ♦దీశుఁ డనుచు

తే. నేరమైతిమి శివుఁ డని♦ నిశ్చయింప, మొక్కమైతిమి భవుఁడని♦ మోఁకరించి
చూడమైతిమి హరుఁడని♦ చొక్కి చొక్కి, యింక నెన్నఁడు దరిసింతు♦ మిందుధరుని.

సీ. కట్టుఁగొయ్యకుఁ జేరి♦ కామధేనువు దప్పెఁ, గానవచ్చిన పెన్ని♦ధాన మడఁగెఁ
గరతలంబుననున్న♦ సురమణి పడిపోయెఁ, బండినతపము ని♦ష్ఫలతఁ బొందె
మ్రోల వచ్చిన కల్ప♦సాల ముప్పునఁ బోయె, వచ్చిన భాగ్యదే♦వత దొలంగెఁ
బ్రాప్తమయ్యును సిద్ధ♦రసము నీరసమయ్యెఁ, దొరకియు వృథయయ్యెఁ♦ బరుసవేది

తే. యేమి సేయుదు మిట్లు వి♦శ్వేశ్వరుండు, కాళహస్తీశ్వరుఁడు భవ♦గహనదహన
దక్షుఁ డపవర్గవిభుఁడు ప్ర♦త్యక్షమయ్యుఁ, దెలియకుండఁగ వెను వెంట♦ మెలఁగిచనియె

తే. ఫలముఁ గొమ్మని ముందఱఁ♦ బట్టి యాసఁ, గొలిపి శిశువులఁ జేరంగఁ♦ బిలిచినట్లు
తపసులకు జన్మఫలమైన♦ తనమహత్త్వ, మెఱుకపడనీక సర్వేశుఁ♦ డేగె నకట. 112

శా. కానీ యాత్మనివాసదక్షిణదిశా♦ కైలాసముం జూపఁడే
తా నేఁ డందఱు నద్ధుతాత్ము లడవిం♦ దాఁగెన్ సవాత్సల్యపూ
ర్ణానుక్రోశమనీష శంక నతఁ డే♦లా తేలిపోఁ జూచు న
ల్లీనం జాలవె యీపురిన్ మనకుఁ ద♦న్నర్చించు భాగ్యోన్నతుల్. 113

సీ. ఈమూర్తి కాళహ♦స్తీశలింగాకృతి, యీగిలది కుమార♦కాళహస్తి
యీపాటి కేతకీ♦ద్వీపవతీరూప, మీలాగు నీలాచ♦లేంద్రమహిమ
మీదారి దుర్గాధ♦గాధరాగమగాధ, యీతెఱంగుది సహ♦స్రేశతీర్థ
మీప్రభావసమగ్ర♦మింద్రతపస్థలం, బీరీతి ఘనము మ♦యూరతీర్థ

తే. మిట్టి గతి మోహనక్షేత్ర♦ మెన్ననుచుఁ, జెప్ప విని కొల్వ సంకల్ప♦సిద్ధిగాఁగ
నభవుఁ డిందాఁక మన వెంట♦ నరుగుదేఁడె, యిచట సేవింపనీక మోక్ష♦ మేమియరుదు.

మ. శివభక్తాకృతినున్నవారు ప్రమథుల్♦ శ్రీకాళహస్తీశుఁడై
శివుఁ డున్నాఁ డిదె జ్ఞానపుష్పకలికా♦చిహ్నంబుతో నున్నదీ
శ విహారాద్రి యమూశ వెండిమలనా♦ సంజాతమై యున్న దిం
క విచారింపఁగ నేల నేఁడె మనకుం♦ గైవల్యసౌఖ్యం బగున్. 115

శా. రుద్రాక్షస్రగలంకృతుల్ భసితధా♦రుల్ పంచవర్ణానుగో
న్నిద్రస్వాంతులు శాంతు లంగభవభి♦న్నిత్యార్చనాకృత్యలో
లద్రాఘిష్ఠులు మౌనముద్రితముఖు♦ లై వైరాగ్యభాగ్యోదయుల్
భద్రాకారు లటంచుఁ బౌరజనులన్♦ భామల్ విలోకించుచున్. 116

సీ. సతత మేమొగలేట♦ జలకంబు లాడిన, బహుజన్మపాపజం♦బాల మెడలు
నల్ప మేజ్ఞానపు♦ష్పాంబ సేవించినఁ, బరశివజ్ఞాన సం♦పత్తి గలుగు
నన్న మేదుర్గాంబ♦ సందర్శనము సేయ, నష్టపాశక్లేశ♦ మడఁగి పోవు
సులభ మేదక్షిణ♦ కలధౌతగిరిఁ గన్న, సంతతానందంబు♦ సంభవించు

తే. సుకర మే యాదిమధ్యాంత♦శూన్యమూర్తి, భావనాతీతు యోగీంద్ర♦భాగధేయుఁ
గాలసంహారకర్త శ్రీ♦కాళహస్తి, శివునిఁ బూజింప మోక్షంబు ♦ సిద్ధ మనుచు.

చ. ప్రమదలు కుంభసంభవధ♦రాధరకన్యకఁ దీర్థమాడి సి
క్తములగు వస్త్రముల్ విడిచి ♦ ధౌతపటంబులఁ గట్టి కేశపా
శముఁ దడియొత్తికొంచుఁ గటి♦సంధి నటింపఁగఁ గీలుగంటు లం
దముగ నమర్చి సైకతవి♦తర్దికలం గమలాసనస్థలై. 118

ఉ. అక్షరుఁ గాళహస్తిగిరి♦జాధిపు మానసవీథి నిల్పి పం
చాక్షర పూత భూతి విహి♦తాంగములన్ ధరియించి భద్రరు
ద్రాక్షవిభూషితావయవ♦లై శివపూజ యొనర్చి కర్మబం
ధక్షయకారణంబు లగు ♦ తద్గుణకీర్తనముల్ పఠించుచున్. 119

క. ద్రవిళకవిరచితనుతిశత, మవిరళగతిఁ జదువుగొనుచు ♦ నన్యవిచార
వ్యవహారదూరు లగుచున్, భవభవనద్వారమునకు ♦ భామలు గదియున్. 120

సీ. నగవు రాకుండియు ♦ మొగమునెత్తమ్ముల, నగ వంకురించు సో♦యగము నిగుడ
మదము లేకుండియు ♦ నుదితతారుణ్యసం,పదమదం బుదయించు♦నుదుటు దెలుప
మెఱుఁగు పెట్టకయును ♦ మెఱయు నిద్దపుమేని, మెఱుఁగులు తరఁగలై ♦ తుఱఁగలింప
నడవు బిత్తరముగా ♦ నడవనేరకయును, నడవ నొయ్యారంబు ♦ నుడివడంగ

తే. నిర్వికార వికారాత్ముఁ ♦ బార్వతీశుఁ, గలయ నేతెంచెదరు గానఁ ♦ గామినులకుఁ
గలుగకుండునె తద్గుణ♦గౌరవంబు, పతికి సరిగారె హితలైన♦భాగ్యవతులు. 121

చ. భయమను తొల్లికిన్ విమల♦భావవసుంధరఁ బెల్లగించి భ
క్తి యనెడు విత్తుఁబెట్టి వ్రత♦ధీనది సమ్మదవారిఁ జల్లఁగా
నయమున నంకురించుచు న♦నల్ గొనలై యెలమిం జెలంగి త
న్మయముగఁ బ్రాఁకె నంచనఁగ ♦ నాకులమై పులకంబు లేర్పడెన్. 122

క. పులకకళికావితానముఁ, దిలకింపఁగఁ దొరఁగు పువ్వుఁ ♦ దేనియల గతిన్
లలనామణితనులతికా,కలిత ప్రస్వేదవారి♦కణములు పొడమెన్. 123

క. ఆలతకుఁ గొనలుసాఁగు వి,శాలతకుం బొంత నీరు ♦ చాల దనుగతిన్
బాలాచపలాంచితదృ,జ్జాలాంబుద మంబువృష్టి ♦ నిలువక కురిసెన్. 124

క. ఆవానఁ దడిసి వడఁకెడు,కైవడిఁ గంపంబు వొడమెఁ ♦ గామినులు మహా
దేవుని ముక్తివధూటీ,జీవితనాయకుని సేవ ♦ సేయం గదియున్. 125

సీ. తనువు దుర్గతి త్రోవఁ ♦ జనకుండఁ గట్టిన, కట్టుల గతిఁ బెండె♦కట్టు లమర
వెనుకకు నొదిగి యొ♦య్యనజాఱు ఘనతమో, గ్రంథులగతిఁ గీలు♦గంటు లమర
గారాదు మీఁకుఁ గ♦ర్మములార నిలుఁడని, పలికెడు గతి జప ♦ భాష లెసఁగఁ
దమ యాత్మచిన్మయా♦త్మునుగూడఁబోఁ జేష్ట, లుడిగినగతి మౌన ♦ సూరకుండఁ

తే. బుండరీకభవాండక♦రండకుహర, బహిరబహిరహరహఃపూర్ణ♦భావనాది
కప్రకాశాంగు నిరుపాధి♦కప్రభావుఁ, గాళహస్తీశు దర్శింపఁ♦గదియు నవుడు. 126

క. జ్ఞానప్రసూనకళికయుఁ, దానుం గన్యకల జన్మ♦దైన్యం బుడుపన్
బూని యొకదేహమై యెదు, రై నిల్చె శివుండు భాగ్య♦మదిపో తలఁపన్. 127

వ. అప్పు డప్పరమదంపతుల శిరోభాగంబుల మిన్నేటి నీటం బొరలుపొరలై పొరలుచుం దెరలుతెరలై యురలం బొడముచుఁ దడఁబడ నెగసి తునుకలైన చినుకులు హత్తిముత్తియపు సేసల విలాసముఁ జూపె. చూపులకుఁ దదనురూపంబులై యెడమచెఱంగునఁ దెఱఁగొప్పు చున్నకొప్పును నప్పయోదంబున మెఱచి మఱచిపోనెఱుంగని మెఱుపు నొఱపు నెఱపు కేతకీదళంబున దళంబగు పరిమళంబునం గూడి జడియుపుప్పొడియు నెలవంకవంకసుధాలవంబులుం జెలువంబులై పొదలె. చదలేటి కదలికలం దలఁకెడు నిజకరంబు తుద లేటి వెడలుపాటి చూపుల వెఱపు తమకు సరియనఁగలపాటి చుట్టఱికంబు వాటించి మానుపు నానుపుఁగొండరాచూలి వాలికచూపు నివాళికలుదనరె. శంకరి నెలవంక నుదటఁ బంకజమిత్రమండలంబు శంకనంకురింపఁ జేయుఁ గుంకుమ పంకంబునఁ బెట్టిన వట్రువబొట్టు తనభాగంబున నొక్కభాగం బడంగిన కతంబున సైకత నితంబల కామదురితగహన దహనంబొనర్ప నఱ దెఱచిన చుఱుకుఁగంటి మంటవంటి కెంపున సొంపారె. నీలరోలంబజాల నీలిమయుఁ బాటల జటాజూట పాటలత్వంబును గలసిమెలసి దివసావసాన సమయ సంశయంబుల హృదయంబుల నుదయంబుగాఁ జేయ భయంబునఁ బ్రియుంబాసి యుభయతనుప్రభావిభాకరతనయానభోనదీ సంభేద సముద్భవ విశద కుముద సముదయంబులలోఁ దాఁగిన జక్కవలీల విమల దుకూలంబులో నున్న యున్నతస్తనకలశంబు దొడఁగిపట్ట నాసపడు కడ కేలుఁదామర యమరె. అభంగురాలింగనంబున నిజాంగనకుఁ దొరఁగు నానందబాష్ప బిందువులు గనుఁగొని తన తొడవులగు పాముల నిడుదయూరుపులవలన వెడలు విషానలధూమంబులవలనం గావలయునని తదాభరణంబులు నడలింపఁ దలంచు శివుని విలోకించి యొనరించు నగవునం దెలుపగు నగజమొగంబును దనమొగంబును నేఱుపఱుప రాని సొబగునం గనుపట్టె. వామతను సీమంతినీలలామయన్నువ నెన్నడుమున కెనగాక యోడుపడి యున్న యన్నెలవున నదుక మిన్నుం దునకలు సేయవలయు నని యెత్తిన తెఱంగునఁ గెంగేలుగండగొడ్డలి వెలిఁగె. అంగజభంగం బొనరించు చూపునం దుదయంబైన చూపును గంఠనాళ కాలకూటకాలిమయుఁ గంఠసరాంతర పురందరనీల నీలిమయును బ్రచండతాండవఖండిత బ్రహ్మాండపాదంబును యోగీశ్వరోపాస్య లాస్యరహస్యవిలసిత పాదంబును బ్రమోదాపాదకంబు లయ్యె. జననీజనక శరీరంబును విద్యాపురుషసామరస్య సుఖాకారంబును శృంగారశాంతరసమయం

బును ప్రత్యక్షభోగమోక్షప్రదసముదాయంబునునై యొక్కమహాతేజం బెఱుకఱుకట్లఁ గన్నులకు మిఱుమిట్లుగొన నిల్చినం దలంచిన తమతలంపీడేఱెనని వనిత లవనీతలంబున సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యెదుట నుదుట ముకుళిత కరపుటంబు లిడుకొని మిన్నకున్నఁ గన్నియల కన్నెఱింగి తన్ను నెడఁబాయక సేవ సేయం గాయంబునం సగం బొసంగె నని దాక్షాయణి సిగ్గుపడ సాయుజ్యం బిచ్చి యంతర్హితుం డయ్యె. అయ్యవసరంబునఁ గమలాస్యల రాక యాలస్యం బగుటయు సొమ్ములయొద్దం దలవాకిట నుండు నింటిబిడ్డ లిద్దఱుం దమలోన 128

వారకన్యలు ముక్తినందిన వార్తనశరీరి ప్రకటించుట.

శా. దేవస్థానములోనికిం జని పురం♦ధ్రీరత్నముల్ రా రదే
మో విశ్వేశ్వరదర్శనానవసరం♦బో శ్రీమహాదేవ సే
వావాంఛాత్మనొ మమ్ము సొమ్మును బహి♦ర్ద్వారంబునం బెట్టి చే
తోవైకల్యము లేక యింతతడ వెం♦దున్నిల్వ రెట్లో యనన్. 129

ఉ. స్థానమువారు వారి నొకఁ♦జాడఁ జలింపకయుండఁ జేయుచున్
లోనికిఁ బోయి పంకరుహ♦లోచనలన్ గుడియెల్లఁ జూచియున్
గానక సంభ్రమంబు పెరుఁ♦గన్ వెఱఁగందఁగ సందియంబు వో
నానతియిచ్చెఁ దత్క్షణ♦ మంతయు నంబరవాణి గ్రక్కునన్. 130

క. వారు విని వారలలనా,పారాభవభక్తిమహిమ ♦ భక్తులపై గౌ
రీరమణునకుం గలిగిన,కారుణ్యముఁ దెలియ నలవి♦గా దనుకొనుచున్. 131

క. గుడి వెడలివచ్చి తనుయు,న్నెడకుం జేటికలఁ బిలిచి ♦ యింతుల మమతా
జడధీజడధినిమగ్నతఁ, జెడకుండఁగ శివుఁడు మోక్ష♦సింధువుఁ గలిపెన్. 132

మ. శివగేహంబున జ్ఞానపుష్పకళికా♦సీమంబు విఘ్నేశ భై
రవ నారాయణ వాసవుల్ శబరస♦ప్రామ ద్దక్షిణామూర్తి తాం
డవమూర్తి ప్రియధామముల్ వెదకుచో♦టం జెప్పె నాకాశవా
ణి వృషాంకుండు సరోజలోచనలకు ♦ నిశ్శ్రేయసం బిచ్చుటల్. 133

ఉ. ఇందున కింక శంకవల ♦ దింతయు సత్యము కాళహస్తి బా
లేందుకళాధరుం గొలువఁ ♦ డిక్కడ మీరు వసించి మోక్షముం
బొందిన వీరి భక్తిఁ గృత♦పుణ్య లెఱుంగఁ బ్రతిష్ఠ సేయుఁ డీ
శుం దలఁకెల్ల మాని యను♦చుం జని రందఱు వారు నంతటన్. 134

క. తమయేలికసానులపే,ర మహేశ్వరలింగముల ని♦రంతరభక్తిన్
గ్రమమునఁ బ్రతిష్ఠఁ జేసిరి, యమదిక్కైలాసపతిగృ♦హాంగణభూమిన్. 135

ఉ. నావుడు భక్తితో విని మ♦నఃపరిణామముఁ బొంది యాదవ
క్ష్మావరుఁడున్ మహేశునకుఁ ♦ జాఁగిలి మ్రొక్కి మహానుభావ ! నా

భావములోన సందియము ♦ పాటిలె నొక్కటి దీని నానతి
వే వివరంబుగాఁ గరుణ ♦ వేగమ నీకది విన్నవించెదన్. 136

సీ. సకలవేదామృత♦జలధి గండూషించి, దప్పి సంగేతువుల్ ♦ చప్పిచప్పి
నిగమార్థ ధన మాత్మ♦జగతి నిక్షేపించి. న్యాయఫలంబులు ♦ నమలినమలి
ధర్మశాస్త్రమహాశాష♦ధములు నూఱుకత్రావి, బహుళపురాణకూ♦పములు ద్రవ్వి
యోగార్థసాధన♦లుల్లం బుపాసించి, పరమత గాంగేయ♦మొరసి చూచి

తే. తపము లొనరించి పుణ్యతీ♦ర్థములు దిరిగి, వ్రతములన్నియుఁ జేసిన♦వారు శివుని
నెఱుఁగ రీచెలఁదిపాము♦నిభము నెఱుకు, లెఱిఁగి పూజించి ముక్తులై ♦ రెట్లనంగ. 137

ఉ. జంగమలింగ మంగభవ♦శత్రువు యాదవరాజు చిత్తవీ
థిం గల సంశయం బెడలఁ♦దీర్పఁ దొడంగి చెలంది పాము మా
తంగము చెంచు పుట్టినవి♦ధంబు సదాశివభక్తి తన్మతిం
బొంగిన హేతువుం విన న♦పూర్వము లేరికి నంచు నిట్లనున్. 138

## చెలందిపూర్వజన్మమువృత్తాంతము.

చ. సకలముఁ బద్మసూతి నిజ♦శక్తి రచింపఁగ విశ్వకర్మపు
త్రకుఁడగు నూర్ణనాభుఁడు మ♦దంబున నాతని ధిక్కరించి సృ
ష్టికిఁ బ్రతిసృష్టి నేర్పున సృ♦జింపఁగఁ గోపమునన్ శపించెఁ గీ
టకత వహింపు మీవు ప్రక♦టంబగు పేర నటంచు గ్రక్కునన్. 139

క. ఆయూర్ణనాభుఁ డాతురుఁడై యేటికి రాకమాను ♦ నన్యాయవిధిం
జేయఁ దలంచినఁ జనునె య, పాయంబని పద్మజునకుఁ ♦ బ్రణతుం డగుచున్. 140

ఉ. నాయపరాధ మేమియు మ♦నంబున నెన్నక మానిమానస
ధ్యేయ కృపావిధేయ తుది ♦ దీనికి నెయ్యది? యేవనంబునం
బోయి వసింతు నేఁ బురువు♦పుట్టువు దీఱెడు దాఁక? నానతీ
వే యని విన్నవింప విని ♦ వేధ విధూతవిరోధచిత్తుఁడై. 141

మ. జగదుత్పత్తి విధిప్రధాన ధిషణా♦సామర్థ్య గర్వంబునం
దగిలెన్ శాపము, ముక్తి గల్గెడు శివుం ♦ దర్శింప, నందాఁకధా
త్రి గజారణ్యమునందు బిల్వవనవీ♦థీవర్తివై యుండు మా
త్మగుణాపాదితచక్రసంక్రమవినో♦దక్రీడ లూతాకృతిన్. 142

ఉ. మున్నచట న్వసిష్ఠునకు♦ ముక్తిసుఖంబు ఘటింప లింగమూ
ర్తి న్నిలిచెన్ శివుం డతని♦తీరు ఫణాకృతియందు భక్తిసం
పన్నుఁడవు పూజసేయు నొక♦భక్తుఁడు నిత్యము వాని నిష్ఠవం
క న్నగజేశుఁ గొల్చి యెఱు♦కం భజియింతువు గాంతు సౌఖ్యముల్ 143

క. శ్రీనామధేయమున గజ, కాననమధ్యమున బిల్వ♦కద్రుమశాఖా
స్థానంబుల నిజగుణపరి, ధానవిధానప్రవీణ♦తం దిరుగు మిలన్. 144

క. ఈజన్మముకంటెను నీ, కాజన్మమె పావనము గ♦జారణ్యములోఁ
దేజోనిధి సర్వేశ్వరుఁ, బూజింపు తదీయపదము♦ పొందం గలుగున్. 145

క. విడువు విచారము నీ విఁక, నడవిఁ జరింపంగఁ గలుగు♦ టలిగి పఱవుపైఁ
బడినగతి యయ్యెఁ జను మనఁ, దడయక నావిశ్వకర్మ♦తనయుఁడు ప్రీతిన్. 146

శా. లూతాకీటకమై ద్విదంతవనమా♦లూరద్రుశాఖాశిఖా
యాతాయాతవిహారజాతనిజగ♦ర్భావిర్భవత్తంతుచ
క్రాతిప్రీతివసింప నంతటను భ♦క్తాగ్రేసరుం డీశ్వరా
ర్చాతాత్పర్యమునం బ్రసూనఫలప♦త్రవ్రాతముల్ గోయఁగన్. 147

తే. చెలఁది యుండెను మారేడు♦చెట్టుఁజేరి, దర్పకారాతి పూజావి♦ధానవేళ
తప్పకుండఁగఁ బోవుఁదా♦త్పర్య మెసఁగ, సంభ్రమంబునఁ దత్పలా♦శములఁ గోయ.

క. ఆకీటము వేణుశలా, కాకల్పితపుష్పపేటి♦కాపుటి మారే
డాకులతోఁ గూడఁ బడెఁ, శ్రీకంఠాలోకనంబు♦ సేకుఱుకతనన్. 149

ఉ. ఆతఁడు కేతకీతటినియందు ని♦జాంగము దోఁచి తత్పయో
ధౌతసమస్తదేహుఁ గల♦ధౌతమహీధరగేహు నర్చనో
పేతునిఁ జేయఁ బిల్వదళ♦పేటికలోఁ బడియున్న లూతయుఁ
జేతికి వచ్చి శంకరునిఁ♦జేసె విలోకన మంతనుండియున్. 150

వ. నిజజననహేతు రూపంబగు జలజభవుశాపంబుఁ దలంచుకొని యీశ్వరార్చనాజ్ఞా
నశాశ్వతైశ్వర్యంబవార్యంబగుటయునీకుమున్నెఱింగించిన తెఱంగునదక్షిణకైలాస
నివాసుం బూజసేసి సాయుజ్య సామ్రాజ్యంబుఁ గైకొనియె నింకఁ గాళంబు కథఁ
జెప్పెద వినుము. 151

## కాళంబుపూర్వజన్మము కథ.

సీ. గంధర్వకామినీ♦గానంబు విని తల, లెత్తియాడెడు భుజ♦గేంద్రములును
భుజగఫణారత్న♦ములదీధితులఁ బ్రకా, శించు తమస్సమా♦శ్లిష్టగుహలు
గుహల ప్రతిధ్వనుల్♦ఘుమఘుమయనఁ బాఱు, నిర్మలోదకముల♦ నిర్ఝరములు
నిర్ఝరతటముల♦ నిరుపాధికసమాధి, యోగనిద్రారతి♦నుండుమునులు
తే. మునుఁతపములునిర్విఘ్న♦ముగ ఫలింప, భక్తిరక్షించుకొనివచ్చు♦ప్రమథగణముఁ
బ్రమథగణభామినీయుత♦ పార్వతీవి, లాసములుఁ గల్గి దనరుకై♦లాసనగము. 152

చ. ఫణిపతిహార భావభవ♦భస్మ సుధాకర భూషితాళికే
క్షణ ధవళప్రభాకలిత♦ సానుచరద్వృషభాధిపుఁ ఖణీల్

ఖణిలున ఱంకెవేయ కెఱుఁ♦గఁగ సమకూడదు చూడ నన్నగా
గణితరుచిప్రసారము జ♦గత్త్రియగాహకమై వెలుంగఁగన్. 153

చ. ఫలములఁ గాచు నద్రిసుత♦పాణిశుకంబు, వృషంబుఁ గాచు శా
డ్వలములఁ,గాచు దంతిముఖ♦వాహన మశుతరాజిఁ, గాచు జో
గులయిలువేల్పువాజి మదిఁ♦గోరక బోనము, భక్తు లీశ్వరుం
గొలిచిన దాఁకఁ దత్కుధర♦కూటగళత్తటినీతటంబులన్. 154

క. అనవరతఫలితకుసుమిత, వనఫలరసమధునదీప్ర♦వాహంబులు పై
కొని సెలయేఱులఁ గూడఁగ, మునితతి సంభేదశంక♦ మునుఁగుం బ్రీతిన్. 155

ఉ. పారదరాశి చంచలతఁ♦ బాసి వసించెనొ, శైలమై సుధా
నీరధి నిల్చెనో, కుముది♦నీపతికాంతి ఘనీభవించెనో
నా రజతాద్రి ముక్తిలల♦నామణి కేళిసుధాంశుకాంతి రా
జీరచితోరుసౌధగతిఁ♦ జెల్వెసఁగు న్మునిసిద్ధసేవ్యమై. 156

క. శంభుఁ డొకనాఁడు వేడుక, నంభోజభవాండమంది♦రాంతర్వీథీ
శుంభన్నివేశకాంతా, స్తంభం బగుచున్న రజత♦శైలమునందున్. 157

చ. గరుడుఁడు రాజహంసమును♦ గంధగజంబును మేఁకపోఁతు కా
సరము నరుండు నక్రకుల♦చంద్రుఁడు నిఱ్ఱియు గుఱ్ఱ మెద్దు ని
ర్జరులవిమానముల్ మొదటి♦చావడి ముందర సందడింప శ్రీ
హరి విధి వాసవాదులు ని♦జావసరాళ వసించి యుండఁగన్. 158

సీ. తొంగలి తూల శా♦ర్దూలచర్మముఁ గట్టి,భూతిమైఁ దగ నెఱ♦పూఁతఁ బూసి
క్రొన్నెలవిరి జటా♦కోటీరమునఁ దాల్చి,బ్రహ్మకపాలహా♦రములఁ బూని
యురగేంద్రు శేషు ను♦త్తరజందెముగ వేసి,కర్కోటకుని నందె♦గా నొనర్చి
శ్రవములఁ గంబళా♦శ్వతరుల ధరియించి,తుంబురుఁ గరకంక♦ణంబు సేసి

తే.వలయుభూషణవితతిగాఁ♦జిలువకులముఁ,జేయుచోఁబ్రియవధూమణిఁ♦బాయునెడరు
తాళఁజాలక పోయి పా♦తాళసీమ,నున్న కాళంబుఁ గోపించి♦యుగ్రుఁ డపుడు. 159

తే. కొలువునకు వచ్చి నవరత్న♦కోటిఘటిత, పీఠికాసీనుఁడై దైత్య♦భేదికమల
గర్భముఖ్యులు సేవింపఁ♦గాళమనుభు,జంగుఁ బిలిపించి యిట్లని♦శాపమిచ్చె. 160

ఉ. వాసుకి శేషముఖ్యఫణి♦వర్గము నిత్యము సేవసేయ భా
మాసురతప్రసంగసుఖ♦మగ్నుఁడవై ననుఁ గొల్వవైతి వా
దోసమువంక మేదిని న♦ధోభువనంబున నుండు రాకు కై
లాసముఁ జూడ నన్న విక♦లత్వము నొందుచుఁ గాళనాగమున్. 161

క. నాయవివేకంబున ని, ట్లాయెం గైలాసపర్వతారోహణముం
జేయక మిము సేవామతి, డాయక నెట్లుండఁగల దృఢంబగు తాల్మిన్. 162

మ. అని దుఃఖించుచు మ్రొక్కి లేవని ద్విజిహ్వాంబు న్విలోకించి మో
మున మందస్మిత మంకురింప దివిషన్మూర్ధాభిషిక్తుండు లె
మ్మని నావాక్యము దప్పదైన ధరఁ దారాగం బవాచీనమై
తనరు న్నన్ను భజింపు మందు నవరత్నశ్రేణిచే నిత్యమున్. 163

తే. కొంత కాలంబునకు నన్నుఁ గొలువ నొక్క, హస్తి చనుదెంచు దానితో నగువిరోధ
మచట మీకుఁ బరస్పరాహవము గల్గి, చచ్చి మోక్షంబుఁ గాంతురు చను మనంగ.

సీ. తారాచలారోహణారంభమునకుఁ బ్ర, త్యూహరూపములు పయోధరములు
శంకరపదపద్మసందర్శనాంతరా, యనిధానములు కటాక్షాంచలములు
అభవ సామీప్య నిత్యానందవిఘ్న హే, తువు లవియోగసంతోషలీల
లంగజవిమతాంగసంగభంగాదికా, రణములు దృఢపరిరంభణములు

తే. గాన నిహపరసౌఖ్యంబు గలుగుటెట్లు, కామినుల వీడనోపని కాముకులకుఁ
బ్రణయినీమృత్యుయోగంబు ప్రాప్తమైన, హరుని చిత్తంబునకు దూరమైతిఁగాదె

వ. అనుచు నపారవిచారంబున మునుంగుచు గజకాననంబునకుం జనుదెంచి శివలింగార్చ
నాపరుండై యుండు నవసరంబున. 166

### హస్తిపూర్వజన్మకథ

సీ. అన్యోన్య సరసభాషామృతాధీనతఁ, బ్రణయరోషావహప్రార్థనముల
బహువిధాలింగనాభంగురక్రీడల, బింబోష్ఠచుంబనాడంబరముల
బంధసంధానవిభ్రమవిశేషంబులఁ, గేళీపరిశ్రమలాలసములఁ
సరభసరతిఘర్మజలహారాంబరములఁ, దాంబూలచర్వణాదానములను

తే. గనకసౌధంబులోపలఁ గలసి మెలసి, సేవసేయు వయస్యలఁ జేరనీక
యేకతంబున గౌరీమహేశులున్న, యవసరంబున మిగుల మదాంధుఁ డగుచు. 167

ఉ. హస్తి యనంగ నొక్క ప్రమథాగ్రణి వాకిటివారిఁ ద్రోచి చే
తస్తనువృత్తియుం దొరఁగి తద్రతిసమ్మదఖేలనక్రియా
వాస్తువు డగ్గఱం గని భవాని శపించె మదించి వచ్చితే
హస్తివి గమ్మటంచుఁ దను నల్కయు సిగ్గును గప్పఁ బెట్టఁగన్. 168

క. గజగజవడఁకుచు నాతఁడు, గజచర్మాంబరుని గంధగజగమనపదాం
బుజములకు నెరఁగె భువనై, కజనని ' యపరాధి నైతిఁ గావు మటంచున్. 169

క. వెండియు నధికభయంబున, దండనమస్కృతు లొనర్చి దైన్యంబున నో
రెండం బెదవులు దడుపుచు, నొండేమియు ననక మిన్నకున్నం గరుణన్. 170

ఉ. నావచనంబు దప్పదు మ♦నంబున భీతి వహింపనేల త్రే
తావధియందు ముక్తిసుఖ ♦ మబ్బు గజాటవిలోన లింగమై
భావజసంహరుండు ఫణి♦భావమున న్వసియించినాఁడు త
త్సేవ యొనర్పు నీకు నొక ♦ చిల్వకు నర్చన మచ్చరం బగున్. 171

క. నీవాభుజగముచే నీ,చే వాతాశనముఁ జచ్చి ♦ శివపదసుఖల
క్ష్మీవరు లయ్యెద రరుగుము, నా వేగమె హస్తి గంధ♦నాగం బగుచున్. 172

శా. మాలూరచ్ఛద నోత్పలాబ్జసితప♦ద్మశ్రేణిభారంబు శుం
డాలగ్నం బొనరించి హస్తి శశిజూ♦టప్రాంతమం దుంచి త
త్కాలన్యస్తమణుల్ పడం దుడిచి కే♦తక్యాపగం గ్రుంకుచుం
గేల న్నీరముఁ దెచ్చి మైదొడసి భ♦క్తిం బూజనల్ సేయఁగన్. 173

క. ఏ మును చెప్పిన తెఱఁగునఁ, బామునకుఁ గరీంద్రమునకుఁ ♦ బగమై ఫణిచే
సామజ మహిపతి కరటి,గ్రామణిచేఁ జచ్చి భవము ♦ గడతేఱంగన్. 174

క. సామజ మంబర మయ్యెన్, బామును నాభరణమయ్యె ♦ ఫణిమదకరులన్
హైమవతీపతికృపచే, నా మొదటివిరోధ ముడిగి ♦ యభవత్వమునన్. 175

వ. ఇంకఁ గన్నప్ప తెఱం గెఱింగించెదను వినుము. 176

## తిన్ననిపూర్వజన్మవృత్తాంతము.

ఉ. ఈశు జగత్త్రయేశు దివి♦జేశతనూభవుఁ డాత్మ నిల్పి ము
క్తాశనుఁడై సమగ్రనియ♦మాతిశయంబున నింద్రకీలశై
లేశుపయిం దపంబు రచి♦యించె విపక్షకులక్షయార్థమై
పాశుపతాస్త్రముం బడయఁ ♦ బ్రాగ్వరముఖ్యులు చోద్యమందఁగన్. 177

సీ. జడలొప్ప కేకిపిం ♦ ఛపుఁద్రాటిచుట్టగా, బిసరుహాహితరేఖ ♦ పీఁకెగాఁగ
సిగలు చల్లెడు కన్ను ♦ జేగుఱుబొట్టుగా, శ్రుతి ఫణి యాషాఢ♦లతికగాఁగ
మెడను బున్కలపేరు ♦ మేటితామరలుగాఁ, దోలుదుప్పటి యొడ ♦ దోలుగాఁగఁ
జేతిపినాకంబు ♦ సెలవింటిబద్దగా, శూల మేర్చిన యంప♦కోల గాఁగఁ

తే. బ్రమథు లెఱుకులు గా నద్రి♦రాజతనయ, శబరిగా నాల్గువేదముల్ ♦♦ జాగిలములు
గాఁగ మూకాసురునిఁ బంది♦గా నొనర్చి, శబరుఁడై భర్గుఁ డర్జునా♦శ్రమముఁ జొరఁగ.

క. కాకోలాశనకృతమా,యాకోలము సేయఁదొడఁగె ♦ నలజడి మునిగా
జీకోలాహల మెసఁగఁగ, నాకోలాంగూలకేతు♦నాశ్రమభూమిన్. 179

చ. వెఱచిన మౌనిపుంగవుల ♦ విహ్వలత న్విడుఁ డంచు బాణముల్
తఱగనితూణముల్ ధనువుఁ ♦ దాల్చి వరాహముఁ గూడముట్టి ముం

దఱిఁ జనుదెంచి ధూర్జటియుఁ ♦ దా నొక యమ్మున దాని నేసె న
త్తఱి విజయుండు నేసె నొక ♦ దారుణ బాణమునన్ సముద్ధతిన్. 180

క. ఇరువురు నేసినబాణము, లిరుబరులును దాఁకి తిరిగి ♦ నిరుదెసలకు న
క్కుఱి యిరుమొగముల నట్టువ, తిరుపుఁ గొనెను క్రమముతో న♦తిత్వరిత గతిన్.

క. ఖండేందుధరుని శరముం, బాండవమధ్యముని శరముఁ ♦ బ్రక్కలు గాఁడన్
రెండుతల లనఁగఁ దిరిగెం, జండగతిం బంది గఱచి ♦ శరములు దివియన్. 182

క. హరుఁడు నరుండును గిరి బిసు, దని కొనియాడి చేర ♦ నరుదేరఁగఁ ద
చ్ఛరముల నదియు న్మృతమై, ధరణిపయిం బడియెఁ బర్వ♦తంబును బోలెన్. 183

క. ఏ మున్నేసితి ననుచుం, దా మున్నేసితి నటంచుఁ ♦ దమలోఁ గిటుకై
భీముఁడు భీమానుజుఁడును, భీమాహవకేళి సల్పి ♦ పేర్చిరి కిటికై. 184

ఉ. సూనశరారియు న్నముచి♦సూదనపుత్రుఁడు దివ్యబాణసం
ధానమున న్మహాహవము ♦ దర్ప మెలర్ప నొనర్ప నొప్పి రిం
తైనఁ గొఱంత లేక తమ♦యందలి తేజము మిన్నుముట్టఁగా
భానుఁడు భానుఁడుం జటుల♦భానుపరంపరఁ బోరుకై వడిన్. 185

ఉ. చెంచనుచున్ ధనంజయుఁడు ♦ చీరికిఁ గైకొన కేయుచుం బ్రతా
పించి రణం బొనర్పఁ బుర♦భేదికిఁ గోపము పుట్టి వీఁడు న
న్నించుకయేనియుం దెలియఁ ♦ డిత్తఱి నూరకయున్న నీతిగా
దంచు మహేంద్రజాలకుని ♦ యట్లొకమాయ రచింపఁ బూనుచున్. 186

ఉ. అక్షయతూణమందు నొక♦యంబకమైనను లేకపోవున
ట్లాక్షణమాత్రఁ జేయ మది ♦ నద్భుత మందియు ధీరుఁడై సహ
స్రాక్షసుతుండు మోఁదె విశి♦ఖాసన మత్తఱి నెక్కుడించి ఫా
లాక్షునిమౌళిఁ బాటలజ♦టావళి వీడఁగ శేషుఁ డూడఁగన్. 187

క. బేడిదమగు నాదెబ్బకు, నోడక విల్లెక్కుడించి ♦ యుగ్రుఁడు నైచెన్
గ్రీడించు వేడ్క ననిలోఁ, గ్రీడించుక వెగడుపడఁ బ♦రిస్ఫుట శక్తిన్. 188

శా. కోదండంబుల నిట్టు లొండొరుజటా♦కోటీరముల్ గుక్షివ
క్షోదేశంబుల నంసభాగముల స♦క్రోధంబున న్వేయుచున్
రోధోంతంబున నట్టహాసములు నా♦ర్పుల్ పిక్కటిల్లంగ బా
హాదర్పంబున మల్లసంగరము సే♦యం జొచ్చి రుద్రార్జునుల్. 189

ఆ. మల్లచఱచికొనుచు ♦ మహిఁ బాదఘట్టనఁ, దల్లడిలఁగఁ జేసి ♦ తనువు లించు
కించుకంత వంచి ♦ యిరువురుఁ దొడ లప్పళించి వెదకి తెఱపి♦ లేమిఁ జేసి. 190

సీ. చెయ్యిచ్చి యొకకొంత♦సేపు పేర్చిన బల్మి, యినుమడింపఁగఁ జార♦నిక మలసి
యొక తెఱంగునఁ జొచ్చి♦యొండొండఁ గాసెలు, దొడికిపట్టుక కొంత♦తడవు పోరి
యది మాని కొంత ప్రౌ♦ఢవనినూఁదిన కాళ్ళు, పెకలించి పడవైవఁ♦ బెనఁగి పెనఁగి
మఱికొంతవడి మెడ♦విఱియ భుజమ్ములఁ, జిక్కించి యక్కున♦నొక్కి నొక్కి

తే. నడుముల నొడిసి కబళించి♦పుడమిమీఁద, సమముగా బ్రావాలిబలపరా♦క్రమము లెసఁగ
హెచ్చుఁగుందేమియును లేక♦యీశ్వరుండు, హరిహయసుతుండు మల్లసం♦గర మొనర్ప

మ. మదమాతంగము సింధురార్భకముతో♦మార్కొంచుఁ జెల్లాడు పం
పుదయింపన్ లయకాలతాండవకరుం♦ డుప్పొంగి గాండీవితోఁ
గదనం బిట్లొనరింప నాతఁడు భుజా♦గర్వంబు మాత్సర్యము
న్వదలం జాలమిఁ జూచి మెచ్చి శివుఁ డం♦తన్ దివ్యతేజంబుతోన్. 192

శా. వైకుంఠద్రుహిణాదిదేవతలుగొ♦ల్వన్ వామసీమావరో
ధాకారుండయి నాగచర్మవసనుం♦డై చంద్రరేఖాధరుం
డై కాకోదరభూషణుం డయి వళీ♦కౌనంగ భస్మాంగుఁడై
లోకవ్యాపకపాండుదీధితికరా♦ళుండై వృషారూఢుఁడై 193

క. ప్రత్యక్ష మగుచు సకలా, దిత్యులు జయజయ యనంగ♦ దేవేంద్రసుతున్
గాత్యాయనీమనోహరుఁ, డత్యాదరమున నభీష్ట♦ మడుగు మటన్నన్ 194

శా. ఆనందమ్మునఁ బాండునందనుఁడు సా♦ష్టాంగప్రణామంబు లె
న్నైనం జేసి యొడ ల్వడంకఁగ మదీ♦యాజ్ఞానజాతాపరా
ధానీకంబున కోర్చి శత్రువహనం♦బార్పం బ్రభాసారథా
రానిర్యత్ప్రళయాభ్రపాశుపతమం♦త్రశ్రేష్ఠ మీవే దయన్ 195

క. ఇదిగాక ముక్తిరమణీ, హృదయేశత్వము వహింప♦ నీవలయును భ
క్తదురాశాపాశలవి,త్ర 'దయావీక్షణ' ప్రసన్న♦తామది ననుడున్. 196

సీ. పాశుపతాస్త్రోప♦దేశంబు సేసెదఁ, బరులఁ గెల్వుము ప్రతా♦పంబు మీఱ
సాయుజ్య సామ్రాజ్య♦సౌఖ్యమీజన్మంబు, నందు నందవు బంధు♦హరణమునకుఁ
గాంతుఁ జేసితి గానఁ ♦ గలియుగంబున మృగ, హంతవై పుట్టి శై♦లాటవులకు
నాఖేటకార్థమై ♦ యరిగి యస్మద్రూప, మగుదివ్యలింగంబు ♦ నచటఁ గాంచి

తే. దేహమోహంబు విడిచి సం♦దేహ ముడిగి, భక్తిభజియించి కామిత♦పదముఁగాంతు
వనుచు సర్వేశ్వరుం డను♦గ్రహముసేయ, ఫల్గునుఁడు తిన్నఁడై పుట్టె♦పడసె ముక్తి.

వ. అని తత్కథావృత్తాంతం బంతయు మాయాజంగమాకారుండై నజగజ్జననీజనక
శరీరుండు నీనృసింహయాదవమేదినీకాంతున కానతిచ్చి కృతార్థుండ వయ్యెద
వమ్మహాదేవుని నివాసంబుఁ గిట్టంపు మనుచు సంతర్హితుం డయ్యె నంతట. 198

ఉ. ఎంతయుఁ జోద్యమంది ధర◆ణీశ్వరుఁ డీశ్వరుఁ బొందఁ గాంచె నే
డెంత కృతార్థురా లిది ని◆జేచ్ఛ విహారము లానతిచ్చె నే
నెంత కృతార్థుఁడన్ జనన◆మెంత కృతార్థతఁ బొందెఁ బట్టనం
బెంత కృతార్థతం బొరసె ◆ నేమని చెప్ప మదీయ భాగ్యముల్. 199

వ. అని యత్యంత సంతోషితస్వాంతుండై. 200

ఉ. అంగన నాదరించి వసు◆ధాధిపుఁ డాక్షణమాత్రలోఁ బుర
ప్రాంగణభూమి సాహిణి ర◆యంబునఁ బల్లనకట్టఁ బట్టసా
రంగజవంబుఁ గల్గినతు◆రంగము నెక్కి కదల్చి కాళహ
స్తిం గదియంగ వచ్చి డిగి ◆ చిద్వనధి న్మొగలేటఁ గ్రుంకుచున్. 201

లయగ్రాహి. మారహరు శైలతన◆యారమణు
నంతకది◆శారజతపర్వతవి◆హారముదితాత్మున్
మేరుధరకార్ముకస◆రోరుహదృగంబకు
ధ◆రారథు సరోజభవ◆సారథిఁ బురారిన్
సారసహితేందుధర◆ణీరసహులుతాశన
స◆మీరఖమహేశ్వరశ◆రీరుఁ బరమేశున్
జేరి భజియించుచుఁ దు◆షారగిరిపుత్రిఁ
బరి◆వారసురలం గొలిచి ◆ కోరిక దలిర్పన్. 202

సీ. దక్షిణకైలాస◆ధరహేమముఖరీన,భోనదీమధ్యమ◆భూమియందుఁ
దిరుకాళహస్తీశుఁ ◆ దిరుగువాఱంగ, జ,లాంతశిలాంతప◆ర్యంతముగను
నేలత్రవ్వించి య◆న్నెలవుననుండియు,రసవర్గమిళితచూ◆ర్ణంబుతోడ
నిటికల శిలల సం ◆ దీకుండబంధించి,యామీఁద హిమగిరి◆జాఖువాహ

తే. చండగుహాభైరవాదుల◆సదనములును, గోపురావర్ణ వర్తన◆కూటములును
భక్తిఁ గట్టించి యమ్మహీ◆పాలవరుఁడు, ధరణి నేలుచునుండె శం◆కరునికరుణ. 203

శా. నీవారాగ్రశిఖాంత చిద్రసమయా◆నీవారముష్టింపచా
త్త్రావాసస్థితదేవ షట్పురయనా◆థా రూఢభేదప్రతి
ష్ఠావష్టంభవిజృంభితాననని కా◆ర్యద్వాక్యవాటా మహా
దేవా జన్మజరావిపల్లయదశా◆ది క్లేశసంహారకా 204

క. బంధత్రయనాశక భవ,బంధాదికబంధరాశి◆బంధనవిద్యా
బంధురనమస్తభూత,స్కంధావారేశ భక్త◆కల్పమహీజా 205

పంచచామరము. వటుక్షమాజవాసభేద◆వాదివాగ్ఖండితా
జటాకుటీవిటంకలగ్న◆చంద్రఖండమండితా

కటీపటీభవద్దిగంతఁ కాలకూటఘస్మరా
నలత్కృపీటభూశిఖాపిఁ నద్ధదృగ్గితస్మరా. 206

గద్యము. ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణ కమల సేవాపరాయణసింగమరమానా
రాయణ జక్కయనారాయణ తనూభవభవపరాఙ్ముఖ ధూర్జటిప్రణీతం
బైన శ్రీకాళహస్తి మాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు
సర్వంబును జతుర్థాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీరామార్పణమస్తు.



శ్రీరామాయనమః.

# శ్రీ కాళహస్తిమాహాత్మ్యము టీక.



శ్రీకాళహస్తి. శ్రీ=చెలఁదిపురుగు, కాళము=సర్పము, హస్తి=ఏనుఁగు, ఈ మూఁడును ముక్తినందిన స్థలమునకు శ్రీకాళహస్తియని పేరు. ౨. ఆ. 92-93-155 పద్యములం జూచునది.

1. అజుఁడు=బ్రహ్మ, లూత=సాలెపురుగు, వాతాశనము=సర్పము, సామజము=ఏనుఁగు, ఆటవికుఁడు=తిన్నఁడను బోయవాఁడు, రాజీవాక్షీయుగము=(వార) స్త్రీలజంట:—ఈ గ్రంథమున శివుని కృపచే వర్ధిల్లినట్లు చెప్పఁబడినవారి పేర్లన్నియు నిందుఁగలవు. దీనిచేఁ గావ్యార్థము సూచింపఁబడియె. ఇట్లు సూచించుట యుత్తమ కావ్యలక్షణము. ఆర్యా=పార్వతి.

2. కులపాలిక=కులస్త్రీ.—ఇచ్చట హిమవత్పర్వతము భార్యయైన మేనక. ఆమె యొక్క-తను=దేహమను, వల్లికా=తీఁగయందు, జనించిన, ప్రసూన=పుష్పము. ఇది జ్ఞానప్రసూనాంబకు విశేషణము. ప్రథమ పాదమందు జ్ఞానప్రసూనాంబ యనెడు పుష్పమునుజన్మస్థలము, రెండవపాదమందా పుష్పసౌరభము, మూఁడవ పాదమున దానియందలి తేనె, నాలుగవపాదంబున సౌరభముచే నాకర్షింపఁబడి తేనెను గ్రోలుచున్న తుమ్మెదలును గీతియందుఁ బుష్పాడియుఁ జెప్పఁబడెను. సావయవ రూపకాలంకారము.

లోకమునఁ గోపాది దుర్గుణములు లేని ప్రభువులను జల్లని ప్రభువులని చెప్పుట వాడుక. హిమధరాధర మండలేశ్వరయనుటచేఁ బార్వతీదేవి తండ్రిచల్లని ప్రభువనియు, కులపాలికయనుటచే నామె తల్లి శీలసంపన్నయు, తను వల్లికయనుటచే సుకుమారియు సుందరియు నని స్ఫురించెడి. దీనివలనఁ బార్వతి సత్కులప్రసూతి వర్ణింపబడెను. ఇట్టులే తక్కినపాదములందు నూహించునది. చంద్రార్ధజూటకోటి=అర్ధచంద్రునిగల జడముడి చివర. శివునకువలెఁ బార్వతికిని విఘ్నేశ్వరునకును, సరస్వతికిని బాలచంద్రరేఖలు మాళియందుఁగలవు.

3. వ్యాకీర్ణస్థితి=భయముచేఁ జెదరిన స్థితియందు.

ఔకారా...వర్ణంబు=భౌయను నక్షరము. భైరవుని వాహనము కుక్క. అది భౌ భౌ యని మొఱుగును.

4. i. కాసరాసురుఁడు=మహిషాసురుఁడు. వీనిని జంపునపుడు దుర్గాదేవి యతనిఁ బడవైచి మెడఁద్రొక్కి శిరము ఖండింపఁగా నా నెత్తురామెపాదములకుఁ దగిలి స్త్రీలు విలాసముగాఁ బాదములకుఁ బూసికొను లత్తుకవలెఁ బ్రకాశించెనని భావము. ii. ఘర్మవాఃకణరాజి=చెమట నీటిబిందువుల వరుస. స్తనములందుఁ బుట్టిన చెమట బిందువులచాలు దుర్గాదేవి కంఠమున ముత్యముల సరమువలెఁ బ్రకాశించెను. iii. అట్టహాసముచేయఁగా ఆ నవ్వుకాంతి మోమున వ్యాపించి శృంగారవతులు మోమునకుఁ బూసికొనెడి పుప్పొడివలె నుండెను. iv. యుద్ధకాలమున లేచిన ధూళియె యామెకు మేలిముసుఁగు.—వీరశృంగారమూర్తి=యుద్ధవర్ణన మగుటచే వీరరసము, శృంగారము వర్ణించుటచే శృంగారరసము. "హాటకి నరకిఁజూడనందంద శృంగార వీరరసము లోలి విస్తరిల్ల" భాగ. అను దాని ననుసంధించునది.

5. సర్గస్థిత్యపహారములు=సృష్టి స్థితి లయములు.

ఈయన యద్వైతియని ౨ ఆ. 131 వ పద్యమువలనఁ దెలియుచున్నను

తే. జగదధీశ్వరుఁడగు మహేశ్వరునియందు,
సకలజగదంతరాత్ముఁడౌ శార్ఙ్గియందు
భేదవిజ్ఞాన మెయ్యెడ లేదు మాకు
నైనఁ దరుణేందుశేఖరునందు భక్తి.

యని భర్తృహరి చెప్పినట్టు పూర్వజన్మవాసన బలమునఁ గేవల శివభక్తుఁడగుటఁ దక్కిన దేవతల ధ్యానింపఁడయ్యెను.

కవులు తామేయే పూర్వగ్రంథములఁ బఠించి భాషాజ్ఞానము సంపాదించుకొనిరో యాగ్రంథముల కర్తలను గ్రంథాదిని కృతజ్ఞతచే స్మరించుట సంప్రదాయము. ఈయన దానిని బాటించినవాఁడు కాఁడు.

షష్ఠ్యంతములు=షష్ఠీవిభక్తి ప్రత్యయములంతముఁగలవి. యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసియత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వమదర్పణ" మ్మని యుండుటచే నార్యులు తాముచేయు కార్యములను భగవంతున కర్పింతురు. అట్లిచ్చునపు డెవ్వనికిత్తురో యతనికి ననివానిపేరు షష్ఠీవిభక్తియందుఁ జెప్పుట యన్నిజాతులవారియందును స్వభావము. ఉత్తరములు వ్రాయునపుడును "మ-రా-రా.............వారి సమ్ముఖమునకు" అని వ్రాయుదుము. షష్ఠ్యంతముల యుత్పత్తి కిదే కారణము. షష్ఠ్యంతపద్యములకు సంఖ్యానియమములేదు. షష్ఠ్యంతము నన్నయభట్టుకూడ వాడియున్నాఁడు.

11. నాదబిందు కళాతీతేశునకు="నాద మనఁగా కంచుగంటమ్రోఁగునట్లు కలుగు దీర్ఘమైనధ్వని. బిందువనఁగా అనుస్వారమునకుఁ దరువాతఁ గలుగు ధ్వని. కల యనఁగా నాదముయొక్క ఏకదేశము" వీని నతిక్రమించిన వానికి.

17. పారదము=పాదరసము. టంకము=ఉలి. కడంగరీయము=పొల్లు కసవు మేసెడి యెద్దు.

20. తూచా=సంస్కృత సముచ్చయములైన తు-చ. వర్ణనిర్దేశమందు దీర్ఘము. కొంచెమైనను విడువక యని యర్థము.

23. ఇందలి పెద్దపాదములు నాలుగు వరుసగ బ్రాహ్మణ,క్షత్రియ, వైశ్య, శూద్రుల కన్వయింపవలెను. వారి యందఱయందు రాజయోగలక్షణములు చెప్పఁబడినవి. i. నిత్యములు=సంధ్యావందనాదులు. నైమిత్తికంబులు=వ్రతాదులు. ii.సంగ+రహితబుద్ధియనియు శాంత+నవస్ఫూర్తియనియు రాజయోగపరము. సంగర+హితబుద్ధి, శాంతనవ+స్ఫూర్తి యని క్షత్రియధర్మపరము. శాంతనవుఁడు=భీష్ముఁడు. వైరి=శత్రువులు-కామక్రోధాదులు. iii. మహార్థ+ప్రభా+అసమానస్థితియని వైశ్యపరము. మహార్థ+ప్రభాసమాన+స్థితియని రాజయోగిపరము. అర్థము=ధనము-నివృత్తి. కోశములు=బొక్కసములు. అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనంద మయమనెడి పంచకోశములు. iv. రాజయోగులవలెనే కష్టజీవులగు శూద్రులు నెండ-చలి-గాలి లక్ష్యపెట్టరని భావము.

24. కామినీజనులు=స్త్రీలు. కామిని యనుటచే వారస్త్రీలని యిచట గ్రహింపఁదగు. నాదబిందు కళలఁగూర్చి 11 వ పద్యము టీకఁ జూడుఁడు. బంధములు=జాలంధరము-ఉడ్డీనములోనగు యోగబంధములు. ౧ ఆ 146 ప, టీకఁ జూడుఁడు. శుకవాక్యము=శుకయోగివాక్యము. మోహ+రహితవృత్తి. అనంగరహస్యవిచారము=బహుశాఖలు లేక యేకమార్గముననుండు తత్త్వవిచారము. బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధ యోఽవ్యవసాయినామ్. అని భగవ. ఇది యోగిజనపరమైన యర్థము.

బంధములు=కొక్కోక ప్రసిద్ధములైన రతిబంధములు. కళలు=పాడ్యమి మొదలాయా తిథుల యందాయా యవయవంబులనుండు చంద్రకళలు. నాదము=వీణాది నాదము. శుకవాక్యము చిలుకపలుకులవంటి పలుకులు. మోహర+హితవృత్తి=మొగ్గరమునందు హితమైన వ్యాపారము. అనంగుఁడు=మన్మథుఁడు. ఇది వారస్త్రీపరమైన యర్థము.

25. అరగంటం గనుఁగొంట=నాసికాగ్రమందు దృష్టి నిలుపుటచేత నిట్టిదృష్టికలుగును. మందగతి=యోగులు త్వరగా నడచినయెడలఁ బ్రాణశక్తి గోలుపోవు

దురు. పూర్ణాహంకృతి=అహంకారశూన్యత. ఉన్మత్తనవ్యరతిఁ='బాలోన్మత్త పిశాచవ దేవ' యన్నట్టు యోగులు పిచ్చివారివలె నటింతురు. సత్త్వము= సత్త్వగుణము. మృదితపద్మాభ్యున్నతిఁ=కొట్టఁబడిన సంపద యభివృద్ధిచేత, ఇది యవధూతపరమైన యర్థము. ఏనుఁగుపరమైన యర్థము సులభము.

26. సిబ్బితి=సిగ్గు.

17. మొదలు 2౩ పద్యములవఱకుఁ బురవర్ణనము. ఇన్నిటియందును గవి యోగవిషయము నుపమించియున్నాఁడు. దీనిఫలనను గ్రంథమం దచ్చట నచ్చట యోగవిషయమే వ్రాసియుండుటను ధూర్జటి యోగాభ్యాసపరుఁడని చెప్పవచ్చును.

28. శక్తిత్రయము=ప్రభుమంత్రోత్సాహ శక్తులు. జ్ఞానబలక్రియాశక్తులు. రాజశేఖరుఁడు=i. రాజశ్రేష్ఠుఁడు ii. చంద్రమౌళి. శరకిటి=మాయావరాహము. కరటి=ఏనుఁగు. కుధర=కులపర్వతములు.

30. కేదారకంకణము=పంచలోహములంగూర్చి చేసిన కడియము. గోణాము= గోఁచి. (రూ. గోవణము. గోణము). సందిఁగట్టిన=సందిటఁగట్టిన.

33. సామిధేని=సమిధ.

35. ఈ పద్యమున మాటలాడునది జంగము రాలు. వినువాఁడును జంగమువాఁడు. కావున వారు తెలుఁగున మాటలాడినను స్వసంప్రదాయ కర్ణాటకపదము లుపయోగించుట దోషముగాదు. ఆ యుపయోగింపఁబడిన కర్ణాటక పదము లన్నియు నగ్రామ్యములు వ్యాకరణ సమ్మతములు. దీనియందుఁ గవిపాటించిన నియమములన్నియు గమనింపక కొందఱు కవిపాత్రోచిత భాష యుపయోగించె నని తామన్యభాషా గ్రామ్యాసంప్రదాయ పదము లసంగతముగ నుపయోగించుట శోచనీయము.

బిజమాడు=విజయము చేయుము. దేవరు=దేవరవారు, గౌరవార్థంబున బహువచనము. బిడార=విడిది యిల్లు, మూర్తమాడి=కొంచెముసేపు విశ్రమించి, మాడబేకు=చేయవలయును. ఇవి కన్నడపదములు. నడలింగమూర్తి=నడచు లింగమూర్తి. తనివు=తృప్తి. విజితకందర్ప=రూపమున మన్మథుని జయించినవాఁడా. శివుఁడు విజితకందర్పుఁడే కదా.

47. కెంపులు=పండ్లనొక్కులు. రాజు ముందర నిలిచె నంభోజవదన=చంద్రుని కెదుటనుండు కమలమెట్లు కాంతిఁబాసి యుండునో యట్లే భీతిచే రాజునెదుట నిలిచినదాసి ముఖము వన్నెవాసి యుండెనని గ్రహింపవలయును.

50. దేహము నేల తగులకుండుటకు "బిగువైన పీనకుచభారము" కారణము.

51. మనువు=మంత్రము.

52. హిండనము=వ్యాప్తి.

59. నమశ్శివాయ=సంస్కృతపద మనుకరణరహితముగఁ బ్రయోగింపఁ బడినది. "ఆశ్చర్య సంతాపాద్యర్థంబుల ననుకరణంబులు రామి దోషంబుగాదు. ఉ. అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి. జయజయ శంకర. నమోవిశ్వసృజే వీనమెన్నఁడు." సులభ వ్యాకరణము.

65. పక్కణము=బోయపల్లె. ఖురళీ=గరడి.

81. అవటము=పల్లము.

83. ఇందు దధలకుఁ బ్రాసము. చూడుము 4 ఆ 189 పద్యము. ఈ ప్రాసము భారత కవులకు సమ్మతము.

88. జీవతా=జీవత్వము.

92. ఉదవసితము=ఇల్లు.

101. నీవార ముష్టింపచులు=ఋషులు.

108. జ్యోతి=ఈ గ్రామము కడపపురమున కేడుమైళ్ల దూరమునఁ బెన్నయొడ్డున నున్నది. సిద్ధవటము జ్యోతికి మూఁడుమైళ్ల దూరముననున్నది.

116. తాటంకవతి=ముత్తైదువ.

118. పొందు=యోగ్యమైన స్థలము.

122. కంచుకము=రవిక. వ్యజనము=విసనకఱ్ఱ.—గంధసారా...న్యము=మలయ పర్వతమునుండివచ్చు గాలియందు క్రీడింపనిచ్ఛపుట్టించునది. విక్షిప్త...తలము =చల్లిన నీళ్లనుండి పుట్టు నావిరిగల భూప్రదేశముగలది. అధ్వగా...కంబు= బాటసారుల కాయాసమిచ్చునది. ప్రాణే...కారి=భార్యల కౌఁగిలింతలకు విఘ్నము కలిగించునది. ఘర్మోదకము=చెమటనీరు. అంబరా...తాప=అంత రాళమునందును, భూమియందును, నీటి ప్రవాహమందును సంచరించు స్వభా వముగల జంతువుల యన్యోన్య ప్రదేశములందు సంచరించు కోరిక వర్ధిల్లఁజేయు తీక్ష్ణతాపము. అనఁగా నెండవేఁడిమికిఁ దాళఁజాలక ఆకాశమున సంచరించునవి భూమియందు సంచరించిన సుఖముగ నుండుననియు, భూమి యందుండునవి నీళ్లలోనుండిన సుఖముగ నుండుననియు, నీళ్లలోనుండునవి భూమియందుఁగాని యాకాశమందుఁగాని యుండిన సుఖమనియుఁ దలంచు చుండెనని భావము. ఉష్ణాగమంబు=ఎండకాలము.

124. అహమన్నమ్=ఇది అన్నసూక్తములోని వాక్యము. అత్యాసక్తితో భుజించె నని భావము.

125. పంచశిఖ=నాలుగుప్రక్కల నాలుగుమంటలు మీఁద నెండ.

132. పోత్రము=పందిమూతి. బ్రహ్మవిష్ణువులు నే నెక్కుడు నే నెక్కుడని తమలోఁ దాము కలహించి శివునియొద్దకుఁబోయి మాలో నెవ రెక్కుడ తెలుపుమని యడుగఁగా నా శిరస్సుగాని పాదములనుగాని చూచివచ్చిన వా రెక్కుడ యని యాయన చెప్పెను. అప్పుడు బ్రహ్మ హంసయై శిరముచూడ నెగిరి పోయెను. విష్ణువు వరాహమై పాదములను జూడఁబోయి యెంతకాలము పోయినను నవి గానరామి విసివివచ్చెను. బ్రహ్మహంసమై పోవుచుఁ దన కెదురుగ శివుని శిరమందుండివచ్చు మొగలిరేకుతోఁ దనస్థితి తెలుపఁగా నీవు శిరము చూచితినని చెప్పుము. నేనును సాక్ష్యము పలికెదనని చెప్పెను. ఆ కారణముచే శివుఁడు తనకు మొగలిపూలు పూజార్హములు కావని శపించెను.

135. చదలేఱు = ఆకాశగంగ.

146. మరున్నైచికి=దేవతాధేనువు, కామధేనువు. సిద్ధాసనము, పద్మాసనము, కూర్మాసనములోనైనవి యోగాభ్యాసవేళ యోగులు కూర్చుండు విధములకుఁ బేర్లు. నాడీశోధనము = ప్రాణాయామభేదము. ఆధారబంధము = మూల బంధము. ఉడ్డీనబంధము = నాభియూర్ధ్వాధో భాగములను వీఁపునకుఁ దగులునట్లు లాగుట. జాలంధరము=కంఠమువంచి ఱొమ్ముదగ్గఱ గడ్డము స్థాపించుట. షట్చక్రములు=మూలాధార చక్రము, స్వాధిష్ఠాన చక్రము, మణిపూరకము, అనాహత చక్రము, విశుద్ధ చక్రము, ఆజ్ఞాచక్రము. జ్ఞేయము=దెలియఁదగిన పదార్థము. జ్ఞాత=తెలిసికొనువాఁడు. జ్ఞానము= తెలివి.

147. సువర్ణ......మణి=మేరు పర్వతము విల్లుగాఁగల శివుని యుతఃపురస్త్రీ= పార్వతి.

153. ప్రతి=ఈ సంస్కృత పదమునకుఁ దెనుఁగునఁ బ్రత్యేక ప్రయోగము గలదు.

156. అవిముక్తము=కాశి.

158. సామజపూజ=ఏనుఁగువలని పూజ. సామజారి=గజాసుర విరోధియైన శివుఁడు. కాళహస్తియందుఁ జచ్చుదోమ, యేనుఁగు, కాముకుఁడును శివత్వమునొందు దురని భావము.

162. గుణ=సత్త్వ రజస్తమోగుణములు. ఇషణములు = దారేషణధనేషణ పుత్రే షణములు, తారకాక్షర=శ్రీరామమంత్రము. "శ్రీరామ రామరామేతి, రమేరామే మనోరమే. సహస్ర నామతత్తుల్యం రామనామవరాననే". యని శివుఁడు పార్వతి కుపదేశించెను. ప్రణవము తారకమే.

163. ఇందతా...హంతా=ఇది యనుభావమును, నేను అను భావమును.

## ద్వితీయాశ్వాసము.

1. శ్రీ...ఖని=మలయ పర్వతము గాలి పరంపరయొక్క స్పర్శము మొదలైన విషయములను ఆస్వాదింపని (సుఖస్పర్శాది విషయముల నాసక్తి గలిగింపని వేదాంత) విద్యకు గనియైన వాఁడా! ఈ యాశ్వాసమునఁ జెప్పఁబడు విషయము లిందు సూచింపఁబడినవి. శ్రీఖండాచలేత్యాదిచే బ్రహ్మ విషయము, ముని...శాఖయనుటచే ఋభువు కథయు, శ్రీకాళహస్తియనుటచే శ్రీ, కాళ, హస్తుల చరిత్రము సూచితము.

3. స్వస్తికహస్తులు=భయముచేఁ జేతులు జోడించినవారు. బొటనవ్రేళ్లను వంచి తక్కిన వ్రేళ్లను జాఁచి రెండు మణికట్టులను జేర్చిపట్టిన స్వస్తికహస్తమగును. భయముతో మాటలాడుట, వాదమొనర్చుట, కీర్తించుటయం దీహస్తమభినయింపఁబడును. కింకర్వాణులు=సేవకులు.

6. తులాకోటి ద్వయంబు=రెండందెలు.

18. ఓరంతప్రొద్దు=చాలఁబ్రొద్దు పోవువఱకు.

22. ఉన్నకార్యములు=తక్కిన పనులు. స్వభార్యతోనైనను నిషిద్ధ సమయముల రమించుట పాపమునకు హేతువు. దాని ఫలము దుష్టసంతానము.

25. అలరమ్ములు=పువ్వుబాణములు.

28. చార్వాక మార్గము=ప్రత్యక్షముగ గోచరించునదియే ప్రమాణముగాని తక్కినదేదియుఁ బ్రమాణముగఁ గైకొనని నాస్తికుల మార్గము. వీరికి సర్వము శరీరసౌఖ్యమే.

29. కుల...దూరంబులు చేయుట భ్రష్టులకు యోగులకుఁగూడ సమానమే. సంసారమగ్నులు భ్రష్టులై కులాచారాదులు వదలి నరకమునకుఁ బోదురు. యోగులు జితేంద్రియులై కులాద్యతీతులై సర్వసమదృష్టులై మోక్షము నొందుదురు.

30. కాదంబరి=కల్లు.

41. గగ్గులకాడు=గింజలేని కంకి=నిస్సారము.

49. వేధోండము=బ్రహ్మాండము.

56. జాఱొప్పున=జాఱు నొప్పున నని యుండవలయు. ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చుపరమగునపుడు నుగాగమము రామికిఁగారణము మృగ్యము. తెగుబటీఱులు=ఎల్లని సదులు.

62. పొలసు=మాంసము. బరికట్టియ=అలుగులేని యీఁటె. కఱుకుట్లు=ఇనుప సలాకయందుఁ గ్రుచ్చి కాల్చెడి మాంస ఖండములు. పదను=బూడిద.

68. ఝంఝూ=గాలివాన.

69. పిడి యేనుఁగు=ఆఁడేనుఁగు.

94. మర్కటకము=సాలె పురుగు.

101. మూరింబోవ=అతిశయింపఁగా

106. ఊర్ణనాభము=సాలె పురుగు.

112. అజ్ఞాతా సంతమసము=అజ్ఞా నాంధకారము.

120. దృషదావళి=ఱాల సమూహము.

122. రేపాడి=ఉదయము.

128. లోకనయనుండు=సూర్యుఁడు.

130. విపులా వాలము=భూమియను పాది. పలాశాంతర=ఆకుల నడుమ.

131. అర్ధదేవుఁడు=విష్ణువు.

134. చిందమృతంబు=చిందున మృతమని యుండవలయును. నుకారాగమము రామి దోషము (చూ. 56 వ ప, టీక).

137. అచ్ఛభల్లము=ఎలుఁగు బంటి.

140. పగ=శత్రువు.

145. మాలూరము=మారేడు.

146. క్రోళ్లు=క్రోవులు.

153. ఈఁదీఁది=ఈఁది + ఈఁది=క్త్వార్థకేకార సంధియామ్రేడితమందైనను సాధువు గాదు.

158. చిరంటీ=ముత్తైదువ. ఘంటా పథము=విశాలమైన బాట.

159. ఆజవంజవము=సంసారము.

## తృతీయాశ్వాసము.

1. శ్రీధర...శోణరాజీవ=విష్ణువు శివుని నర్చింపవలయునని సహస్రకమలములు సేకరించి పూజించు సమయమున నొక కమలము తక్కువ పడెను. దానికి మాఱుగ విష్ణువు తన కంటిచే నర్చించెనని శైవపురాణ కథ. దీనిచే నీయాశ్వాసమునఁ దిన్నఁడు తన కంటిచే శివున కర్పించు విషయము సూచితము మనో...వైద్యయనుటచే నత్కీర కథ సూచితము.

3. పొత్తపినాడు=పొత్తపి ముఖ్యప్రదేశముగాఁగల దేశము. ఈపొత్తపి కడప మండలమునందలి రాజంపేఁట తాలూకు టంగటూరు గ్రామమునకు మూఁడు

మైళ్లలో నున్నది. ఉడుమూరు=దీని నిప్పుడు ఉడుముల పాడు అని యందురఁట. పక్కణము=బోయపల్లె.

4. స్తబ్ధరోమ విషాణము=పందికొమ్ము. ముక్తకంచుకము=కుబుసము విడిచిన పాము. ఏనుఁగు కుంభస్థలము, మేఘము, పందికోఱ, శంఖము, మత్స్య శిరము, పాఁవ పడగ, ముత్తెపుఁజిప్ప, వెదురు వీనియందు ముత్తెములు పుట్టును.

6. పాఱుటాకులు=ఋషులు లోనగువారు వస్త్రములకు మాఱుగాఁగట్టుకొనెడి యొక విధమైన యాకులు.

7. తవిఁదచేలు=రాగిచేలు, వెఱబొమ్మ=పక్షులు బెదరుటకై చేలయందుంచు వికారపు బొమ్మలు.

8. అరబములు=పైర్లు.

9. గోవాళ్లు=యౌవన పురుషులు. ఇది నిత్యబహు వచనాంతము. దీని కాధుని కొకఁడేక వచనము గోవాఁడు అని కల్పించుట యవిచార మూలకంబు.

12. కరకరి=రాపిడి - విరోధము. బర్హాంబరము=ఆకుచీర. గసికకోల=మొదలు చెక్కఁబడిన కొయ్య.

16. ఈ పద్యమున ఆఁడు నెమిళ్లకు శబరకాంతల కచముల కుపమానోపమేయములు చెప్పఁబడినవి. ఆఁడు నెమిళ్లకుఁ బెద్ద బింఛెము లుండవుగాన నీ యుపమాన సారస్యము చింత్యము.

24. గర్భమునందున్న శిశువు జననానంతరము చేయఁబోవు కార్యములిందు సూచింపఁ బడినవి. గర్భిణీస్త్రీకిఁ గలుగు కోరికలు, ఆమె చేయు వింతచేష్టలు గర్భమందున్న శిశువు లక్షణము దెలుపునని శాస్త్రప్రసిద్ధము.

32. గుంజా=గురిగింజ.

35. మృగయా=వేఁట, గునుకుంద్రాలు=ఒక విధమైన గడ్డిగింజలు, ప్రాలు= బియ్యము. కీచక తండులము=వెదురు బియ్యము, కొఱ్ఱ=ఎసరు, ఉప్పి= ఆవిరిపోక యుడికించి, అవించి=ఆవిరికిఁబెట్టి, కాలింగ భంగములు=నేల గుమ్ముడు బ్రద్దలు, గుడా=ద్రాక్ష, గుడ=బెల్లము, గుడపుష్ప=ఇప్పపూవు, నరకట్లు=వీణెమెట్లు, గుమ్మెట=తుడుము.

41. ఉపదంశము=ఊరుఁగాయ.

46. గిద్దులు=ఒక విధమైన డేగలు, విడివేఁట=పక్షులను బక్షులపై విడిచి యాడెడు వేఁట. పాదివేఁట=పెంపుడు పిట్టలను నొక చోనుంచి వాని ధ్వనులచే నాకర్షింపఁబడివచ్చు పిట్టలను బట్టువేఁట.

55. కచ్ఛడము=గోఁచి, రుండమాల=తెగినతలల దండ.

58. రొకార్కారొక్కముల్=పలువిధములైనవి.

65. ఏనుట్టంబులు=ఏచుట్టములు. ఇది త్రికపూర్వ కర్మధారయముగావున చకార మునకు సకారాదేశము. దీనిని గొందఱు గ్రామ్యమని భ్రమింతురు. ఒడిపిల్లి ఆహార విశేషము.

71. 65 మొదలు 72 వఱకుఁగల పద్యములు బాలవాక్యములవలె ముద్దు లొలుకుచు స్వభావసిద్ధముగనున్నవి. ఈ పద్యము పానకములోని పుల్లవలెనున్నది. ఈమాటలుగాని యిందలి భావముగాని బాలునకు సహజముగఁ దోఁపదు.

82. కారాకూరము=(కాదుకూడదని) బలాత్కారము.

87. అద్రిరాజల్లుని=శివుని. అద్రిరాజు నల్లుని యని యుండవలెను. షష్ఠీసమాసంబున నుగాగమురామికిఁ గారణము మృగ్యము.

93. అందీయ=ఇది శబ్దపల్లవము.

105. గండూషజీవనము=పుక్కిటినీళ్లు. సేకము=తడుపుట.

129. హాలాహలభక్త=విషాహారము.

144. గ్రైవేయకము=కంఠహారము.

147. కూటమి...సౌఖ్యములు=ఇందుఁబడఁతులు కనఁగా స్వభార్యలకని గ్రహింపవలయుఁ గాకున్న రాజునందుఁ బరస్త్రీసంగమదోష మారోపించిన దోషము కవియందారోపింపవలసియుండును.

149. రేపాడి=ఉదయము. వర్షగర్భము నడవకపోయె=గర్భఋతువులందు వర్షించె ననుట. విదియల...దఱిగె=విదియనాఁటి చంద్రుని రెండుకొమ్ములు సమముగా నుండిన పదార్థముల వెలలు సమముగా నుండును. కుడిచేతి ప్రక్క కొమ్ము తగ్గిన కొలుచు పదార్థములును-ఎడమచేతి ప్రక్కకొమ్ముతగ్గిన తూనిక వస్తువులును జక్కఁగ ఫలింపక వెలలు హెచ్చగును. కన్యభిన్నింపదయ్యె=సూర్యుఁడు కన్యారాశియందుఁ బ్రవేశించినపుడు చినుకులుపడకుండుట వర్షములు లేమి సూచించును

152. మల్లె=ఒకవిధమైన తెగులు.

155. ప్రాసమున లఘ్వలఘు రేఫములకు మైత్రిగలసియున్నది. ఈ కవి రేఫఱకారమైత్రి నంగీకరించినట్టు లితరప్రయోగములు (1 ఆ 53. 2 ఆ. 44. 3 ఆ 71 చూడుఁడు) లేవు గనుక నిందుమాత్రము గలియుటకుఁ బ్రమాదమే కారణము. కఱవు ఇది యుభయరేఫములుగల శబ్దము కాదు.

170. లూలామాలపుమాటలు=మోసపుమాటలు.

181. జంబుకేశ్వరమున జలలింగము. అరుణాచలమున నగ్నిలింగము. చిదంబరమున నాకాశలింగము. తిరువాలూరునందుఁ బృథివీలింగము. కాళహస్తియందు వాయులింగము ఇవి పంచలింగములు. కాళహస్తియందు గర్భగృహమందు గాలి వచ్చుటకు మార్గమేమియు లేకున్నను గాలిచేఁ గదలునట్లు దీపము కదలుచునే యుండును.

185. ఉణ్ణాముల=అపీతకుచాంబ. అణ్ణామల=అరుణాచలము, మణ్ణాస = భూమి యాశ, పొన్నాస=బంగారుమీఁది యాశ, పెణ్ణాస=స్త్రీమీఁది యాశ.

187. విక్రమసింహపురి=నెల్లూరు.

210. కాశవనప్రభవ=తెల్లు వనమునందుఁ బుట్టినవాఁడా. దురితగిరిదేవేశ=పాప మను పర్వతమునకు నిందుఁడైనవాఁడా.

225. అష్టాపదగిరి=బంగారుకొండ. అష్టాపదగర్భ=బ్రహ్మ.

చతుర్థాశ్వాసము.

5. వైశ్య=వేశ్యాజన సంబంధమైన.

10. పంకించిన=పూసిన.

15. చతుర్జాతి=పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని యని స్త్రీలు నాలుగు తెగల వారు గలరు.

16. పరివాదిని=ఏడుతంతెలు గల వీణ. యథాసంఖ్యాలంకారము.

41. దారు...భుజంగుఁడు=దారుకారణ్యమందలి మునీశ్వరులు శివభక్తిశూన్యులై తపస్సుచేయుచుండ శివుఁడు నగ్నజంగమ వేషమునఁబోయి వారి స్త్రీల పాతివ్రత్యమును జెఱిచెను.

52. తొంగుండెడు=శయనించెడి. దీని శబ్దపల్లవక్రియగా గ్రహించినఁ గ్వార్థకేత్సంధి దోషము తొలఁగు.

53. తిరు=శ్రీయర్థమిచ్చు ద్రవిడపదము.

54. కుటుమావు=కొంచెము మాసిన.

55. అద్దమరేయి=అర్ధరాత్రము.

56. భేశరేఖావతంసు=చంద్రరేఖను దలపువ్వుగాఁగల శివుని.

58. కనకసభ=చిదంబరము.

59. ఉచ్చావచ=అనేక భేదములుగల, పాటచ్చర=దొంగ, వియత్=ఆకాశము,

62. ఇభరత్నము=ఐరావతము. తరురత్నము=కల్పవృక్షము, వధూరత్నము= లక్ష్మీదేవి, ధేనురత్నము=కామధేనువు, గ్లౌ=చంద్రుఁడు, హరిరత్నము= ఉచ్చైశ్రవము.

63. హేళి=సూర్యుఁడు.

69. తిరుకాళశైలము=దీనిని రామగిరియందురు.

96. ప్రోష్ఠులు=ఒక విధమైన జింకలు.

108. జీవులం గొట్టురట్టున కొడిగట్టు వేలువు=యముఁడు.

122. తొల్లిక=పాఱవంటి సాధనము.

127. ఒకదేహమై=అర్ధనారీశ్వరుఁడై.

128. వెడలుపాటి=వెడలుపైన.

132. జడధీజడధి=జడమైన బుద్ధియనెడు సముద్రమునందు.

190. మల్లచఱచు=భుజములు తట్టుకొను.

196. లవిత్రము=కొడవలి.

201. పల్లన=గుఱ్ఱములోనగువాని నెక్కునపుడు క్రింద మెత్తగానుండుటకై కట్టి మీఁదవేసి కట్టెడు గంత=జీని.

202. మఖేశ్వర=సోమయాజి. ఖ=ఆకాశము. పంచభూతములు-సూర్యచంద్రులు-సోమయాజి. ఇవి శివునకుఁ దనువులుగావున నాయన యష్టమూర్తియని పిలుపఁబడెను.

203. అఖువాహ=విఘ్నేశ్వరుఁడు.



# సవరణ.

## ప్రథమాశ్వాసము.

| పద్యము. | పాదము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 35 | 1 | బిడారు | బిడార |
| 49 | 2 | లజా | లజ్జా |
| 88 | 2 | జీవిత | జీవతా |
| 98 | 5 | ౨ | వై |

## ద్వితీయాశ్వాసము.

| పద్యము. | పాదము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 25 వ పుట. | | ప్రథమాశ్వాసము. | ద్వితీయాశ్వాసము. |
| 27 వ పుట. | | ప్రథమాశ్వాసము. | ద్వితీయాశ్వాసము. |
| 34 | 4 | బొసర్పు | బొసర్పు |
| 65 | 1 | అంచలు | అంచలఁ |
| 68 | 1 | మహాగ్రీష్మ | మహాగ్రీష్మ |
| 70 | 4 | విడి యేనుఁగు | పిడి యేనుఁగు |
| 71 | 2 | తోడుగ...తోడుగ | దోడుగ...దోడుగ |
| 75 | 3 | స్వస్తాంజలి | స్వస్తాంజలి |
| 128 | 4 | నయనంబ | నయనుండ |
| 130 | 4 | ఫలాశాంతర | పలాశాంతర |
| 137 | 3 | నిధాన | నిదాన |

## తృతీయాశ్వాసము.

| పద్యము. | పాదము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 3 | నుండు | నుండుఁ |
| 157 | 5 | బండు | బండువు |
| 180 | 3 | దీరని | దీఱని |
| 210 | 1 | ఐతల్స | వత్సల. |

## చతుర్థాశ్వాసము.

| పద్యము. | పాదము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 25 | 3 | ష్పలమై | ష్ఫలమై |
| 91 | 1 | జాలముల | జాజలము |

# ప్రకటన.

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము.

## రెండవ కూర్పు.

**వావిలికొలను సుబ్బరాయ విరచితము.**

సంస్కృతమున వాల్మీకిమహర్షి రచియించిన శ్రీమద్రామాయణమునకు సరియైన తెలుఁగు పద్యకావ్యము. శైలి మిక్కిలి సులభము. సర్వజన మనోహరము. ఇది యాంధ్రదేశంబునందెల్ల వ్యాపించి యున్నందున విశేషము వ్రాయనక్కఱలేదు. ఉత్తరకాండముతోడ 7 కాండములు రెండుసంపుటములు నిండుకాలికో వస్త్రముతో నట్ట కట్టింపఁ బడినవి. 50 పవునుల దళసరి కాగితములపైఁ బెద్దయక్షరములతో ముద్రింపఁబడినవి. రెండు సంపుటముల వెల తపాలాకూలి గాక రు. 4—8—0. పైకము ముందుగాఁ బంపిన 6 పుస్తకముల వెల రు. 24—0—0. పారాయణమున కుపయోగించుటకై కిత్తలినార వస్త్రముతో అట్ట కట్టి రామపంచాయతన ప్రతిమ గలది. రు. 4—12—0. 6 ప్రతులు. ... ... 24—12—0.

ఈ గ్రంథమునందు సుందరకాండము మాత్రము. కిత్తలినార వస్త్రము అట్ట. రామపంచాయతన ప్రతిమగలది. 1—4—0. 6 ప్రతులు. 5—10—0.

# సుభద్రావిజయ నాటకము.

ఇది శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము శ్రీ కుమారాభ్యుదయము. శ్రీ కౌసల్యాపరిణయము లోనగు ననేకాంధ్ర గ్రంథంబుల రచియించి ప్రకృతము చెన్నపురి రాజకీయ సర్వకలాపాఠశాలయం దాంధ్రపండితులుగ నుండు బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ, వావిలికొలను సుబ్బరావుగారిచే రచితము.

ఇందలి కథాశరీరము భారతములోనిదైనను గథాసంవిధానము మిగులఁ జమత్కారముగను శ్లాఘ్యతరముగను గూర్పఁబడినది. శైలిమృదువు, మధురము, మనోహరము. మాటల పొందిక నిరుపమానము. అర్థవిశేషములు సర్వజన రంజకములు. వ్యంగ్యప్రధానము. భాషా నాటకాభిమానుల కందఱ కిది యవశ్యపఠనీయము. ఇట్టి యుత్తమనాటక మిదివఱకు భాషయందు లేదు. 5 అంకములు. 112 పుటలు. 60 పవునుల దళసరి కాగితములపైఁ బెద్ద యక్షరములతో నాంధ్రవాల్మీకి రామాయణము వలెనే ముద్రింపఁబడి యదే విధముగ నిండుకాలికో వస్త్రముతో ముచ్చటగ నట్ట కట్టింపఁబడినది. తపాలా కూలిగాక వెల 0—9—0. 6 ప్రతుల వెల ముందుగఁ బైక మంపువారికి రు. 3—0—0. కొలఁది సంఖ్య ప్రతులుమాత్రమే కలవు.

# శ్రీ కౌ స ల్యా ప రి ణ య ము.

వావిలికొలను సుబ్బరాయ రచితము.

రెండవకూర్పు.

రావణుఁడు పెట్టుబాధలకు వెఱచి సురలుహరితో విన్నవింపఁదాను కౌసల్యా దశరథులకు జన్మించి యతనిఁజంపుదునని చెప్ప నారదుచే రావణుఁ డావార్త విని వారి వివాహము విఘ్నపఱుపఁ గౌసల్యను దొంగిలించి సముద్రములో దాఁచుటయుఁ జిత్ర విధముగఁ గౌసల్యా దశరథులకు వివాహమగుటయు లోనగు కథలు కలది. ఇట్టి గ్రంథము భాషయందులేదు రామభక్తుల కెల్ల నవశ్యపఠనీయము ఆంధ్రవాల్మీకి రామాయణము సుభద్రావిజయము శ్రీకాళహస్తిమహాత్మ్యములవలెఁ బెద్దయక్షర ములలో ముద్రింపఁబడినది కాలికో అట్ట 1—4—0 కాగిదపు అట్ట 1—0—0 6 ప్రతు లొక్కసారి కొనువారికి 1—0—0 కు 0—4—0 ల వంతున త్రోసివేత. ఇది 1914 డిశంబరు నెలలో వెలువడును, ఈగ్రంథము మొదటి యాశ్వాసమునకు టీక విడిగఁదీయువారికి 0—12—0 కౌసల్యా పరిణయముతోడఁ దీయువారికి 0-6-0 ఇవి 100 ప్రతులు మాత్రమే కలవు.

శ్రీరామ.

# సు ల భ వ్యా క ర ణ ము.

ఇది ప్రెసిడెన్సీ కాలేజి తెలుఁగుపండితులును శ్రీమదాంధ్ర వాల్మీకిరామాయణ, సుభద్రావిజయనాటకాది గ్రంథకర్తలును నగు మ-రా-రా-శ్రీ, బ్రll శ్రీll వావిలి కొలను సుబ్బరావుగారిచే రచియింపఁబడినది. ఇది నలక్షణభాషను దమంతటఁ దామే నేర్చుకొనఁ గోరువారికిని, నితరవ్యాకరణములలోని ముఖ్యవిషయములు తెలిసికొనఁ గోరువారికిని-అర్థము తెలియక బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణాది సూత్రములు ముఖస్థ ములు చేయువారికిని-వ్యాకరణసూత్రము లన్వయింపఁ దెలియఁ గోరువారికిని-మిక్కిలి యావశ్యకమైనది.

ప్రతి సూత్రమునకు నుదాహరణము-సూత్రార్థము - లక్ష్యములందు సూత్ర మన్వయించు పద్ధతి అపవాదములు లోనైన యన్ని విషయములు బాలురకును ఇతరుల తోడ్పాటులేక బోధపడునట్లు సులభశైలిని వ్రాయఁబడినది. ఈ వ్యాకరణ మును జదివినవాఁడు మఱి యేవ్యాకరణమును జదువఁ బనియుండదు గాని యితర వ్యాకరణములు చదువువారికి నిది తప్పక తోడుపడఁగలదు-తఱచు బాలవ్యాకరణ సూత్రములే యిందు వ్రాయఁబడి యుండుటచే నది చదువువారు దీనిఁ జదివి యర్థమును నెఱుంగవచ్చును-ఒక్కొక్క విషయమైన సూత్రము లన్నియు నొక్కటిగఁ బ్రకరణములఁ

చేర్పఁబడినవి. దీనియందర్థాను స్వారములు గల శబ్దములపట్టియు, నట్టి యనేక శబ్దముల కుత్పత్తియు-ఖండబిందువు లెందుండవలయునో కనుఁగొను రీతులును, సంస్కృత సంధి ప్రకరణము-వాక్యరచన విషయమైన వాక్యపరిచ్ఛేదమును గలవు. అదియునుగాక వ్యాస లేఖనము (వ్రాయవలసిన విద్యార్థులకుఁ గాను వ్యాసములు వ్రాయువిధము-అది నేర్చు కొనవలసిన విధము-బాలురు పడు పొరపాటులు లోనగునవి చక్కఁగ విశదీకరింపఁబడి యున్నవి. అదిగాక విద్యార్థులు వ్రాసిన వ్యాసములనుండి 500 దోషములు (3 వ భాగమున)సవరించి వ్రాయఁబడినవి. ఈపుస్తకము చదువు వారు వ్యాసలేఖన పరీక్ష యందుఁ దప్పిపోవఁ గారణము లేదు.

ఇది 3 భాగములుగ విభజించి మూఁడు సంపుటములుగ నట్ట కట్టఁబడినది.

| | |
|---|---|
| ౧ వ భాగము సంజ్ఞా సంధి పరిచ్ఛేదములు. | 0—8—0 |
| ౨ వ భాగము తత్సమ పరిచ్ఛేదము మొదలు వాక్య పరిచ్ఛేదము కడవఱకు | 0—9—0 |
| 3 వ భాగము వ్యాసలేఖనము. .. | 0—6—0 |

ఈ భాగము విద్యార్థులేగాక చక్కని శైలి వ్రాయఁగోరువారందఱుఁ జదువఁ దగినది.

# ఆర్యచరిత్రమాలికా గ్రంథములు.

మహాశయులారా! తల్లిదండ్రులారా! ఉపాధ్యాయులారా!

పాఠశాలలయందు బాలురకుఁగాని బాలికలకుఁగాని నీతి - మతము - సదా చారము నేర్పువిధిలేదు. పూర్వము పెద్దవారలు తమతమ బిడ్డలకు నింటియందే నీతి మతాచారములు పురాణములలోని కథల మూలమున నేర్పుచుండిన పద్ధతియు నిలిచి పోయినది. దీనివలన మన బాలురు బాలికలు నీతిహీనులై-మతజ్ఞానములేక - ఆచార ములఁగాని వాని వలని ఫలముగాని తెలియక చెడుచుండుటయు దానివలన దేశమున కును, ప్రజలకును, ఆయాకుటుంబములకును కలుగు కీడును ప్రభుత్వము వారికిని విదిత మయియేయున్నది. ఇదంతియు ఆలోచించి చక్కఁగ బాలురకును బాలికలకును కథల మూలమున నీతి మతాచారముల నేర్పుటకై ఆర్యచరిత్రముల నెల్ల చిన్నచిన్న గ్రంథ ములుగఁ బ్రకటించుచున్నాము. వీనియందు మన పురాణములఁ గల మంచి కథ లన్నియుఁ గలవు. శైలి 7-8 సంవత్సరముల వయస్సుగల బాలురకు - బాలికలకుఁ గూడ సులభముగ అర్థమగుచుండును. దేశాభిమానము-మతాభిమానము, పిల్ల వాండ్రు బాగుపడవలయునని తమ మనస్సులందు కోరికగల వారందఱు మాకీకార్య మునఁ దోడుపడి యీపుస్తకములను తమ పిల్లలచేతను పిల్లవాండ్రచేతను చదివింపఁ గోరెదము. వీనిని ఆంధ్రవాల్మీకిరామాయణమురచియించిన మ-రా-రా-శ్రీ వావిలికొలను

సుబ్బరావుపంతుల వారు వ్రాసిరి. అభిమానము గలవారు నిలుకడ చందాదారులుగఁ జేరికాని పాఠశాలలయందు బాలురు చదువునట్లు చేసికాని తోడ్పడఁ గోరెదము. రకమునకు 5-0-0 కొకసారిగ కొనువారికి రూ 1-0-0 కు 0-4-0 త్రోసివేయఁబడును.

| | | | |
|---|---|---|---|
| ఆర్యకథానిధి. మొదటిభాగము. | | హరిశ్చంద్ర చరిత్రము. | |
| కాలికో అట్ట | 0—2—6 | కాలికో అట్ట. | 0—3—0 |
| డిటో 2-వ భాగము | 0—2—6 | శకుంతలా చరిత్రము. డిటో | 0—3—0 |
| డిటో 3-వ భాగము | 0—2—6 | నలచరిత్రము డిటో | 0—4—0 |
| డిటో 4-వ భాగము | 0—3—0 | సావిత్రీ చరిత్రము డిటో | 0—3—6 |

ఈ గ్రంథములు పట్టు కాలికోలోను దొరకును 0—1—0 వెల యెక్కువ. హనుమంతుని చరిత్రము, సీతాదేవి చరిత్రము, ద్రౌపదీ చరిత్రము ముద్రణమందున్నవి.

# శ్రీ భీమేశ్వర పురాణము. భీమఖండము

శ్రీనాథకవి ప్రణీతము దక్షారామమాహాత్మ్యము వెల రు 0-10-0 కాలికోబైండు రు 1-0-0.

# శ్రీ కాళహస్తిమాహాత్మ్యము.

రెండవకూర్పు.

ధూర్జటి కవిప్రణీతము

ఆంధ్రవాల్మీకిరామాయణ సుభద్రావిజయములవలె నిదియుఁ బెద్దయక్షరములతో మరల ముద్రింపఁబడినది స్తుతమతియైన యాంధ్రకవిధూర్జటి పల్కులకేట్లు గల్గెనో యతులితమాధురీ మహిమయని కృష్ణదేవరాయలచే శ్లాఘింపఁబడినది. సత్కవిత్వ మభ్యసించువారికి మేలుబంతి కవితాసంప్రదాయమెఱుఁగఁ గోరువారికి నిధానము. శివభక్తులు ప్రతిదినము పఠింపఁదగినది.

ఇందు కాళహస్తిపటము, తిన్నఁడు శివలింగపూజ చేసినపటము గలవు

| | |
|---|---|
| వెల కాగిదపు అట్టది | 1—0—0 |
| ,, కాలికో అట్టది | 1—4—0 |

6 ప్రతులు తీయువారికి నూటికి ఇరువదియైదువంతున త్రోసివేత.

ఈ గ్రంథములు వలయువారు

(1) భారత భండారము లిమిటెడ్, తిరువళిక్కేణి

(2) శ్రీరామ జయమందిరము, తిరువళిక్కేణి

(3) కం - వేంకట శేషగిరిరావు & సన్సు, నెల్లూరు

(4) గిల్బర్ట్ అండుకో 29 సామిపిళ్లవీధి, నూలె మదరాసు

(5) పురాణపండా భద్రయశాస్త్రి, పిఠాపురము

వీరిలో నెవరికైన వ్రాసికొనవలయును.